

శ్రీశ్రీశ్రీ అరుళానందసరస్వతిస్వామివారు
శ్రీ సదాశివబ్రహ్మేంద్రాశ్రమము,
చిల్లకల్లు-521178
జగ్గయ్యపేట మండలం, కృష్ణాజిల్లా,
ఆంధ్రప్రదేశ్.

శ్రీః

# శ్రీసూక్తవ్యాఖ్యానమ్


తమిళమూలం :
శ్రీ ఎస్.కృష్ణస్వామి అయ్యంగార్, పుత్తూరు అగ్రహారం

తెలుగువ్యాఖ్య :
"పదపరిచర్యా" డా॥ ఈ.ఏ.శింగరాచార్యులు, తిరుపతి.





ప్రకాశకులు
శ్రీ సదాశివబ్రహ్మేంద్రాశ్రమము, చిల్లకల్లు-521178
జగ్గయ్యపేట మండలం, కృష్ణాజిల్లా.

# శ్రీసూక్తవ్యాఖ్యానమ్

తమిళమూలం :

**శ్రీ ఎస్.కృష్ణస్వామి అయ్యంగార్**

తెలుగుసేత :

**డా॥ ఈ.ఏ.శింగరాచార్యులు,** తిరుపతి.


| | |
|---|---|
| ప్రథమముద్రణ | : విరోధి, ఆశ్వయుజమాసము, దీపావళి 17-10-09. |
| పృష్ఠ సఙ్ఖ్యా | : 140 |
| వెల | : అమూల్యం |
| ప్రతులు | : 500 |

ఈ ప్రచురణకు **డా॥ నడిపినేని సూర్యనారాయణగారు** ప్రేరకులు.





1. **శ్రీశ్రీశ్రీ అరుళానందసరస్వతిస్వామిగారు,**
   శ్రీ సదాశివబ్రహ్మేంద్రాశ్రమము,
   **చిల్లకల్లు-521178,**
   జగ్గయ్యపేట మండలం,
   కృష్ణాజిల్లా.

2. **R. MOHAN RAO,**
   4-103, ILTD Colony Extn.,
   Kothapet,
   **CHIRALA** - 523 157,
   Phone : **9440115411**



***D.T.P. :-***

**J. RAJA**

**GANESH GRAPHICS, CHIRALA.**

Cell : 98483 90564


## మనవి

పలు వైదిక దేవతలలో శ్రీశబ్దవాచ్యురాలైన లక్ష్మీదేవికూడా ఒకతె. ఈ దేవతను వర్ణించే పదిహేనుమంత్రాలతో కూడిన సూక్తానికి శ్రీసూక్తం అని పేరు. ఈ సూక్తంలోని మంత్రాలను బట్టి చూస్తే ఈమె మంగళ స్వరూపిణి, సంపద్రూపిణి, ఔదార్యాది కల్యాణగుణశాలిని, సంపదలను ఇచ్చేది, అశుభాలను పోగొట్టేది-ఇత్యాదిగా గోచరిస్తుంది. తరువాత పుట్టిన వేదోపబృంహణసాహిత్యంలోను, ఆళ్వార్లు అనబడే ద్రావిడ సాహిత్యంలోని శ్రీవైష్ణవమధురభక్తి సంప్రదాయానికి చెందినమహాకవుల కృతులలోను, ఆ పిమ్మట రచింపబడ్డ ఆచార్యుల స్తోత్రాలలోను, లక్ష్మీతంత్రాది ఆగమగ్రంథాలలోను శ్రీతత్త్వానికి సంబంధించిన పలు విశేషాలు కన్పిస్తాయి. వీటిని అన్నిటినీ సమన్వయిస్తూ శ్రీసూక్తానికి ద్రావిడభాషలో శ్రీమాన్ కృష్ణస్వామి అయ్యంగార్ (పుత్తూరు-శ్రీరంగం దగ్గర) సంతరించిన వ్యాఖ్యను దృష్టిలో పెట్టుకొని ప్రస్తుత "పదపరిచర్యా" వ్యాఖ్య రచింపబడింది. అన్నివిధాల సహకరించిన మిత్రవరేణ్యులు, సాహితీరసికావతంసులు, శ్రీ ఆర్.మోహనరావు, చీరాల గారికి సర్వథా సర్వదా కృతజ్ఞతలు. ఈ వ్యాఖ్య సాహితీప్రియులకు, ఆస్తికులకు ఆదరణీయం కాగలదని భావిస్తున్నాము. శ్రీశ్రీశ్రీ అరుళానందసరస్వతిస్వామివార్కి నమస్కరిస్తూ-సెలవు.

భవదీయుడు

**ఈ.ఏ. శింగరాచార్యులు**

భగవానుని విషయంలో ఏ విధంగా పొసగుతుంది? అనే సందేహం ఏర్పడవచ్చు. ఈ లక్ష్మీదేవి సహజంగానే ఆ స్వామి సొత్తు. కాబట్టి ఈమెకు ఉన్న (పైన పేర్కొన్న) అతిశయాలు అన్నీ ఈమెను సొత్తుగా కల అతనికి చెందినవే అవుతాయి. కనుక, అతని నిరతిశయ బృహత్త్వరూపం అయిన పరబ్రహ్మత్వానికి ఏ కొఱత రాదు. తనకంటే మించిన పలు మహిమలను కల ఈ లక్ష్మీదేవికి స్వామిగా ఉండేవాడు అనే గొప్పతనం వేఱెవ్వరికీ లేదు కదా! రత్నం తనకున్న కాంతివల్ల గొప్పతనాన్ని పొందడాన్ని గమనిస్తున్నాము. అయినా, ఆ కాంతి ఆ రత్నంయొక్క స్వాభావిక ధర్మమై, దానికి చెందినదై ఉండడం వల్ల ఆ కాంతికి ఉండే అతిశయం అంతా రత్నానికి చెందినదిగానే పర్యవసిస్తుంది. మాణిక్యం కాంతితో గొప్పతనాన్ని పొందినా, అది సహజంగా గొప్పతనం లేనిది, వేఱొకదానివల్ల గొప్పతనాన్ని పొందుతున్నది- అని ఎవరూ అనరు కదా! ఈ విషయాన్ని పరాశరభట్టరు లక్ష్మీవైభవాన్ని ప్రఖ్యాపనం చేసే శ్రీగుణరత్నకోశం అనే స్తుతిలో **"స్వతః శ్రీ స్త్వం విష్ణో స్త్వమసి తత ఏవైష భగవాన్-త్వదాయత్తర్ధిత్వేఽప్యభవదపరాధీన విభవః, స్వయా దీప్త్యా రత్నం భవతి చ మహార్ఘం న విగుణం న కుంఠం స్వాతంత్ర్యం భవతి చ న చాన్యాహితగుణమ్"** అనే సూక్తి ద్వారా తెలియజేశారు. శ్రీ రామాయణంలో **"అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభా యథా"** (సూర్యుని అతని కాంతి విడిచిపోనట్లే, నేను కూడా రాముని విడిచి ఉండలేను) అని, "అనన్యా హి మయా సీతా భాస్కరేణ ప్రభా యథా" (సూర్యుని అతని కాంతివలె నన్ను విడచి ఉండనిది సీత) అని దివ్యదంపతులిద్దరూ స్వయంగా వ్యక్తం చేసినట్లే లక్ష్మీదేవి భగవానుని కాంతివలె అతని ప్రకారభూతురాలై ఉంటుంది. కనుక ఆ పురుషోత్తమున కుండే పరబ్రహ్మత్వం అనే అతిశయానికి ఏ కొఱత రాదు. పైగా, ఈమెకున్న అతిశయాలన్నీ స్వామి పరబ్రహ్మత్వాన్ని సుస్థాపిస్తాయి. ఈ లక్ష్మీదేవి వైభవాన్ని వ్యక్తీకరించే సూక్తాలు-శ్రద్ధాసూక్తం, మేధాసూక్తం, అదితిసూక్తం, వాక్ సూక్తం, శ్రీసూక్తం- అని చాలా ఉన్నాయి. పరాశరభట్టర్ "మాధవః" అనే నామాన్ని వ్యాఖ్యానిస్తూ **"వేదేషు తావత్ శ్రీసూక్తం, శ్రద్ధాసూక్తం, మేధాసూక్తమ్, ఉత్తరనారాయణమ్, కౌషీతకీ బ్రాహ్మణమ్ ఇత్యాదౌ"** అని అంటూ వచించడం గమనించవచ్చు. "మేధా శ్రద్ధా సరస్వతీ" (వేదాలలో మేధా, శ్రద్ధా, వాక్ అనే చెప్పబడేది లక్ష్మీదేవియే) అని విష్ణు పురాణాలలో పరాశరమహర్షి వేదాలలో చెప్పిన అర్థాన్ని ఉపబృంహణం చేశారు. అందువల్ల పై సూక్తాలన్నీ లక్ష్మీ వైభవ ప్రఖ్యాపకాలు. పలు సూక్తాలు పరమపురుషుని మహిమను చెప్పేవి అయినా, అతనికే చెందినవి అయిన పురుష, నారాయణ నామాలను, లక్ష్మీపతిత్వాది చిహ్నాలను పురస్కరించుకొని స్వామి వైభవాన్ని కీర్తించే పురుషసూక్త, నారాయణ సూక్తాలు ప్రధానాలు అయినట్లే, లక్ష్మీ దేవికే చెందిన శ్రీ, లక్ష్మీ మొదలైన నామాలను, ఐశ్వర్యప్రదత్వాది లింగాలను పురస్కరించుకొని ఈమె వైభవాన్ని ప్రఖ్యాపనం చేసే వాటిలో శ్రీసూక్తం చాలా ప్రధానం. భూసూక్త, నీళాసూక్తాలు రెండు –లక్ష్మీదేవికి అంగభూతలుగా,

# శ్రీసూక్తవ్యాఖ్యానమ్

**(తమిళమూలం : శ్రీ ఎస్.కృష్ణస్వామి అయ్యంగార్, పుత్తూరు అగ్రహారం)**
**"పదపరిచర్యా"-తెలుగువ్యాఖ్య : డా॥ ఈ.ఏ.శింగరాచార్యులు,** తిరుపతి.



**సూక్తం పంచదశర్చం లక్ష్మీవైభవ నిరూపకం శుభదమ్**
**వివృణోతి శింగరార్యః పూర్వాచార్యోక్తి మనుసృత్య॥**

## ఉపోద్ఘాతం

**"మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ, అతిథిదేవో భవ"** (తల్లిని దైవంగా కలవాడవు కావాలి, తండ్రిని దైవంగా కలవాడవు కావాలి, ఆచార్యుని దైవంగా కలవాడవు కావాలి, అతిథిని దైవంగా కలవాడవు కావాలి) అని వేదం ఘోషిస్తున్నది. ఈ వాక్యానికి సామాన్యంగా చెప్పే అర్థం ఒకటి ఉన్నది. లోకంలోని సోపాధికులైన (ఆయా జన్మల సంబంధం వల్ల ఏర్పడిన) తల్లి, తండ్రి మొదలైన వారి విషయంలో దైవీ భావనను కల్గి ఉండాలి అని పై వేదవాక్యాలు విధిస్తున్నవి అన్నది ఆ అర్థం. **"త్వం మాతా సర్వలోకానామ్"** (నీవు అన్ని లోకాలకు తల్లివి) అని విష్ణుపురాణంలో లక్ష్మీదేవి జగన్మాతగా చెప్పబడింది. ఇటువంటి జగన్మాత విషయంలోను, **'భూతానామ్ అవ్యయః పితా'** (లోకానికి అంతటికీ వ్యయం లేని, అంటే, నశించని తండ్రి) అని సహస్రనామాధ్యాయంలో చెప్పబడ్డ రీతిలో జగత్పిత అయిన శ్రీమన్నారాయణుని విషయంలో **"అతియాదన అతివిత్త అత్తా"** (అజ్ఞాతజ్ఞాపనాన్ని చేసిన స్వామీ!) అని నమ్మాళ్వార్లచే చెప్పబడ్డ రీతిలో భగవద్విషయక జ్ఞానాన్ని తెలిపే సదాచార్యుని విషయంలో, **"విరున్దాకుమ్ పెరుమ్తక్కోరే"** (అతిథులుగా వచ్చే మహనీయులు) అనేటట్లు భగవదనుభవం అనే పరమభోగ్యమైన అన్నాన్ని పెట్టదగిన అతిథులు అని అనదగిన భాగవతుల విషయంలో దేవతాభావనను కల్గి ఉండాలన్నది పై వేదవాక్యంలోని పరమతాత్పర్యం. వీరు నల్గురు జీవులకు మహోపకారాన్ని చేసే వారు

కనుక, పరమాత్మ విషయంలో ఉండదగిన ప్రీతిని, గౌరవాన్ని ఈ నల్గురి విషయంలో కల్గి ఉండాలని ఈ సూక్తి తాత్పర్యం. ఈ అర్థాన్ని (దివ్యసూరులలో) **"శీదై ఎన్నదోర్‌దెయ్‌వమ్"** (సీత అనే పేరు కల ఒక దైవకాంత) అని పరకాలసూరి, **"తిరుమజ్ఞై నిన్గరుళుమ్ దెయ్‌వమ్ నావాళ్‌త్తుమ్"** (లక్ష్మి అధివసించి ఉండే దైవాన్ని నా నాలుక కీర్తిస్తుంది) అని భూతయోగి, **"తేవుమత్తఱియేన్"** (ఆచార్యుని తప్ప వేఱొక దైవాన్ని తెలియను) అని మధురకవులు, **"కుల దెయ్‌వమ్"** (భగవద్భక్తులు మా కులదైవం) అని శఠకోపసూరి–ఈ నల్గురి విషయంలో దేవతాశబ్ద ప్రయోగాన్ని చేయడం ద్వారా పై వేదవాక్యంలోని తాత్పర్యాన్ని అనుసంధించారు. ఈ నల్గురిలో కూడా చాలా ఎక్కువ ఉపకారాన్ని చేసేది కాబట్టి **"మాతృదేవో భవ"** అని మొట్టమొదటగా లక్ష్మీదేవి నిర్దేశింపబడినది. ఈ విధంగా లక్ష్మీదేవి అందరిలోను ఎక్కువ ఉపకారాన్ని చేసేది–అని ఏ విధంగా తెలుస్తున్నది? అని అంటే– **"పేరాళన్ పేరోదుమ్ పెరియోర్తై ఒరుకాలుమ్ పిరికిలేనే"** (భగవానుని నామాన్ని అనుసంధించే పెద్దలను ఏ సమయంలోను విడువలేను) అని పరకాల సూరి, **"ఒళిక్కొణ్డశోదియమాయ్ ఉడన్ కూడువదెన్ఱుకొలో మాయప్పిరాన్ అడియార్‌కళ్ కుళాజ్గళైయే"** (ప్రకాశించే తేజోరూపమైన దివ్యశరీరాన్ని కలవాడనై ఆశ్చర్యచేష్టితుడైన భగవానుని భక్తుల సంఘంతో కలియడం ఎప్పుడో కదా!) అని **"అన్దమిల్ పేరిన్బత్తు అడియరోడు ఇరున్దమై"** (అంతంలేని ఆనందాన్ని పొందే భగవద్దాసులతో కలసి ఉన్న తీరును) అని చెప్పే రీతిలో పరమప్రాప్యభూతులైన భగవద్భక్తులతో కలసి ఆనందించే అవకాశం ఆచార్యునివల్ల కల్గుతుంది. ఆచార్యుడు మనకు మంత్రోపదేశాన్ని చేసి, తెలియదగిన విషయాలను బోధించిన తరువాతనే ఈ సద్భక్త సహవాసానుభవం కలుగుతుంది. కనుక భాగవత గోష్ఠీ సంబంధాన్ని కలుగజేసేవాడు ఆచార్యుడే. కనుక భాగవతానుభవం ఆచార్యునివల్ల కల్గుతుంది. జీవునకు ఈ సదాచార్య సంబంధం కల్గడానికి కారణం సర్వేశ్వరుని నిర్హేతుక కటాక్షమే. కనుక ఆచార్యలాభం భగవదధీనం. సర్వస్వతంత్రుడైన ఆ భగవానునికూడా ఈ జీవునితో చేర్చేది పురుషకార స్వరూపిణి అయిన లక్ష్మీదేవి. కనుక ఈశ్వరలాభం ఈ లక్ష్మీదేవి వలననే. ఈ విధంగా ఉత్తమోపకారాన్ని చేసేది కనుక "లక్ష్మీదేవిని దైవంగా కల్గి ఉండు"– అని మొట్టమొదటగా వేదం విధించింది. అంతేగాక, లక్ష్మీదేవి స్వరూప రూపగుణవిభూతులు పురుషోత్తముని స్వరూప రూపగుణ విభూతుల కంటే మించి ఉంటాయి. ఈమె స్వరూపం భగవానుని స్వరూపం కంటే **"న జీవే యం క్షణమపి వినా తామసితే క్షణామ్"** (నల్లని కన్నులను కల ఆ సీతాదేవి లేకుండా నేను ఒక్కక్షణం కూడా జీవించలేను) అనేటట్లుగా మాధుర్యంలో మించి ఉంటుంది. ఈమె రూపంగూర్చి చెప్పినట్లయితే, జితేంద్రియుడైన హనుమంతుని కూడ "రాఘవోఽర్హతి వైదేహీం తం చేయమసితేక్షణా" (రాఘవుడు వైదేహికి తగినవాడు. నల్లని కన్నులను కల ఆమె కూడా రాఘవునకు తగినది) అనేటట్లు ఆశ్చర్యచకితుని చేస్తుంది. ఈ శ్లోకంలో రాఘవుడు నిర్విశేషంగా చెప్పబడగా, సీతాదేవి "అసితేక్షణా"



అనే విశేషణంతో విశేషింపబడడం వల్ల రాఘవుని అందం కంటే సీతాదేవి రూపసౌందర్యం అధికం అని స్ఫురింపజేయబడింది కదా. భగవానుని కూడ తలమునకలు చేసేటట్లుంది లక్ష్మీదేవి సౌందర్యం. ఇక, ఈమె గుణాలను చూచినట్లయితే **"మాతర్మైథిలి! రాక్షసీస్త్వయి తథైవార్ద్రాపరాధాస్త్వయా రక్షంత్యా పవనాత్మజాల్లఘుతరా రామస్య గోష్ఠీకృతా, కాకం తం చ విభీషణం శరణమిత్యుక్తి క్షమౌ రక్షతః సాన స్సాంద్రమహాగస స్సుఖయతు క్షాంతి స్తవాకాస్మికీ"** (తల్లీ! మైథిలీ! అప్పుడే ఆర్ద్రాపరాధాన్ని చేసిన రాక్షస స్త్రీలను హనుమానుని బారినుండి రక్షించిన నీచే, కాకాసురుని, విభీషణుని "శరణు" అనే మాటను చెప్పిన తరువాతనే రక్షించిన రాముని గోష్ఠి తక్కువ చేయబడినది. అటువంటి నీ నిర్హేతుకకృప పరమపాపులం అయిన మమ్ములనుకూడా ఆనందింపజేయాలి) అని అంటూ శ్రీ పరాశరభట్టర్ పల్కిన రీతిలో భగవద్గుణాల వైభవాన్ని లక్ష్మీగుణాల వైభవం మించి ఉంటుంది. వాస్తవాన్ని పరిశీలిస్తే **"శ్రద్ధయా దేవో దేవత్వమశ్నుతే"** (శ్రద్ధా శబ్దవాచ్యురాలైన లక్ష్మి చేతనే దేవుడు దేవత్వాన్ని పొందుతున్నాడు) అని వేదం, **"అప్రమేయం హి తత్తేజః యస్య సా జనకాత్మజా"** (జనకుని పుత్రిక అయిన సీతను ఎవరు కల్గి ఉన్నాడో, ఆ రాముని తేజస్సు ఇంతటిది అని చెప్పడానికి వీలు లేనిది) అని శ్రీరామాయణం చెప్పిన రీతిలో భగవానుని స్వరూప రూపగుణ విభూతుల అతిశయానికి ఈమె కారణభూతురాలై ఉంటుంది. "భగవానునకు అందం ఆమెవల్ల, గుణాలు ఆమెవల్ల, పరత్వం ఆమెవల్ల, సౌలభ్యం ఆమెవల్ల, నిరూపించి చూస్తే అంతా ఆమెవల్ల"–అని అంటూ తిరుప్పావై ప్రబంధం వ్యాఖ్యానిస్తూ నాయనార్ అనే పెద్దలు వచించారు. తిరునిన్ఱపక్కమ్ తిఱవిదు" (లక్ష్మీదేవి అధివసించి ఉండే పార్శ్వాన్ని కల భగవానుని అప్రకంప్యం అయిన పరత్వంయొక్క తీరు ఇది) అని భక్తిసారయోగి పలికారు కదా! **"అపాంగా భూయాంసో యదుపరి పరం బ్రహ్మ తదభూత్"** (ఎవరిపై లక్ష్మి కటాక్షాలు ఎక్కువగా పడ్డాయో అతడు పరబ్రహ్మ అయ్యాడు) అని పరాశరభట్టర్ కూడా అన్నారు. ఇంతేకాకుండా, స్వతంత్రుడై, కర్మానుగుణంగా ఫలాన్ని ఇచ్చేవాడై, పరబ్రహ్మ కాబట్టి విజాతీయుడై ఉండే భగవానునివలె కాకుండా, భర్తృపారతంత్ర్యం అనే సంపదను కల్గినదై, కృపాగుణం మూర్తీభవించినదై, చేతనులతో సజాతీయురాలై ఉండే గొప్ప అతిశయం ఈ లక్ష్మీదేవికి ఉన్నది. ఇంతేకాక, తల్లిదండ్రులు ఇద్దఱిలో, హితాన్ని కోరే తండ్రి దగ్గర కంటే, ప్రియాన్ని అభిలాషించే తల్లి దగ్గరనే బిడ్డకు చనువు, అనురాగం ఎక్కువగా ఉంటుంది. ఈ కారణాల వల్ల వేదపురుషుడు ముందుగా జగన్మాత అయిన లక్ష్మీదేవిని **"మాతృదేవో భవ"** అని ప్రస్తుతించాడు. ఈ విధంగా లక్ష్మీదేవి పలురీతుల్లో భగవానుని కంటే గొప్పతనాన్ని కల్గినది అయితే, నారాయణునకే అసాధారణం అయిన పరబ్రహ్మత్వం అనే అతిశయం ఏ విధంగా నిలుస్తుంది? స్వరూప రూపగుణాదులలో నిరతిశయబృహత్త్వాన్ని కల్గి ఉండడం– తనకంటే గొప్పది వేఱొకటి లేదు అనే అతిశయాన్ని కల్గి ఉండడం– అనే పరబ్రహ్మ లక్షణం ఆ

**తృతీయయార్ఘ్యమీశానే పాద్యం చాపి ప్రకల్పయేత్।**
**చతుర్థ్యాచమనం చైవ పంచమ్యా చోపహారకమ్॥**

**షష్ఠ్యా స్నానం ప్రకుర్వీత సహ నౌ సాధకోత్తమః।**
**సప్తమ్యా వాససీ దద్యాత్ అష్టమ్యా భూషణాని చ॥**

**గంధం దద్యాత్ నవమ్యా తు దశమ్యా సుమనశ్చయమ్।**
**పరాభ్యాం ధూపదీపౌ తు పరయా మధుపర్కకమ్॥**

**ప్రాపణం చ చతుర్దశ్యా పంచదశ్యా నమస్క్రియాః।**
**తారికా మనుతారం చ ప్రయుంజీయాదథాంతతః॥**

**ప్రత్యచం నియతో మంత్రీ జపేచ్ఛక్త్యా యథావిధి।**
**సూక్తస్య విలయం పశ్చాత్ తారికాయామనుస్మరేత్॥**

**తారికాస్థౌ చ నౌ ధ్యాత్వా స్మరేత్ సర్వగతిం చ నౌ।**
**ఋగ్భిశ్చతసృభిర్యద్వా పూర్వమావాహనక్రియా॥**

**పంచమ్యా తు ప్రపద్యేత శ్రియం మాం శుద్ధచేతసా।**
**ఆప ఇత్యనయా కుర్యాత్ అర్ఘ్యపాద్యాచమనక్రియాః॥**

**ఆర్ద్రామితి చ మత్ స్నానం కర్దమేనేతి చాంబరమ్।**
**గంధద్వారేతి గంధాః స్యుః ఉపైతు స్యాదలంకృతిః॥**

**కాంసోఽస్మి ధూపదీపౌ చ షష్ఠ్యా చైవోపహారకమ్।**
**మనసః కామమిత్యేవ మధుపర్కం ప్రకల్పయేత్॥**

**క్షుత్పిపాసామితి హ్యేషా ప్రాపణప్రతిపాదికా।**
**అంత్యయా తు నమస్కారః శిష్టం పూర్వవదాచరేత్॥ 50-35**

(ఇంద్రా! నా సూక్తంయొక్క ప్రయోగవిధానం ఏ విధంగా విధింపబడిందో తెలుపుతున్నాను విను. నన్నే దీనికి ఋషిగా తెలియాలి. దీని ఛందస్సు 'శ్రీః' అని చెప్పబడుతున్నది. దీని దేవత సర్వాధార, విష్ణుపత్ని, ఈశ్వరి అయిన నేనే. లక్ష్మీనారాయణులను పూజించడంలో ఈ సూక్తం వినియోగపడుతున్నది. పరమేశ్వరినై, లక్ష్మి అనే తిరునామాన్ని కల్గిన నన్ను విష్ణువుయొక్క ఒడిలో కూర్చున్నదానినిగను, పరమాత్మయొక్క ఎడమ బాహువుతో ఆలింగనం చేసికొనదానినిగా, స్వామి బాహువులపై వేసిన చేతిని కల్గిన దాననుగాను, దివ్యకమలాన్ని ధరించిన దానినిగాను ఎల్లప్పుడూ ధ్యానించాలి. శార్ఙ్గమనే వింటిని దాల్చిన దేవదేవునియొక్క కుడి తొడపై అమరియున్నదానినిగా భావించి, పరమేశ్వరిని అయిన నన్ను నియమపురస్సరంగా శ్రీసూక్తమంత్రంతో అర్చించాలి. సోమరితనం లేనివాడై, మొదటి మంత్రంతో నన్ను



ఆమెకు భోగోపకరణస్థానీయలుగా, విభూతి భూతలుగా ఉండే భూదేవి, నీళాదేవుల గొప్పతనాన్ని తెలుపుతున్నవి.

**శ్రీసూక్తంయొక్క ఆవిర్భావం, గొప్పతనం :-** పాంచరాత్ర శాస్త్రానికి చెందిన **"లక్ష్మీతంత్రం"** అనే గ్రంథంలో లక్ష్మీవైభవాన్ని ప్రకటించే భాగం కొంత ఉన్నది. ఇంద్రునకు లక్ష్మీదేవి స్వయంగా తన గొప్పతనాన్ని తెలియజెప్పే రీతిలో ఇది ఉన్నది. 50 అధ్యాయాలను కల ఆ గ్రంథంలోని చివరి అధ్యాయం శ్రీసూక్తమహిమను, అర్థాన్ని తెలిపేదిగా ఉన్నది. అందులో శ్రీసూక్తం యొక్క ఆవిర్భావాన్ని గూర్చి, అతిశయాన్ని గూర్చి ఈ క్రింది విధంగా తెలుపబడింది.

**దేవో నారాయణో నామ జగతస్తస్థుషః పతిః।**
**ఆత్మా చ సర్వలోకానాం షాడ్గుణ్యానందవిగ్రహః॥**

**సర్వప్రకృతిరీశానః సర్వజ్ఞః సర్వకార్యకృత్।**
**నిరనిష్టోఽనవద్యశ్చ సర్వకల్యాణసంశ్రయః॥**

**తమసాం తేజసాం చైవ భాసకః స్వప్రకాశతః।**
**అంతర్యామీ నియంతా చ భావాభావవిభావనః॥**

**శక్తిమాన్ సకలాధారః సర్వశక్తిః మదీశ్వరః।**
**తస్యాహం పరమా శక్తిరేకా శ్రీర్నామ శాశ్వతీ॥**

**నిరస్తనిఖిలావద్యా సర్వకామదుఘా విభోః।**
**ఆత్మభిత్తిసమున్మీలచ్ఛుద్ధాశుద్ధాధ్వవర్గిణీ॥**

**అనువ్రతా హృషీకేశం సర్వతస్సమతాం గతా।**
**తావావాం పరమే వ్యోమ్ని పితరౌ జగతః పరౌ॥**

**అనుగ్రహాయ లోకానాం స్థితౌ స్వః పరయా శ్రియా।**
**కదాచిత్ కృపయావిష్టౌ జీవానాం హితకామ్యయా॥**

**సుఖినస్స్యురిమే జీవాః ప్రాప్నుయుర్నౌ కథం త్వితి।**
**ఉపాయాన్వేషణాయత్తౌ పరమేణ సమాధినా॥**

**మథ్నీవస్సమాతిగంభీరం శబ్దబ్రహ్మమహోదధిమ్।**

**మథ్యమానాత్ తతస్తస్మాత్ సామర్గ్యజుషసంకులాత్।**
**తత్సూక్తమిథునం దివ్యం దధ్నో ఘృతమివోత్థితమ్॥**

**అనాహతమసందిగ్ధమనస్పష్టమనశ్వరమ్।**
**సర్వైశ్వర్యగుణోపేతమనాకులపదాక్షరమ్॥**

**ఆద్యోస్తథాంతయోః శశ్వత్ అన్యోన్యాక్షరమిశ్రితమ్।**

**శక్తిశక్తిమదావిద్ధం తత్తదక్షరమిశ్రితమ్॥**
**తత్ర పుంలక్షణం సూక్తం సద్భ్రహ్మగుణభూషితమ్।**
**స్వీచకారారవిందాక్షః స్వమహిమ్ని ప్రతిష్ఠితమ్॥**
**తత్ర స్త్రీలక్షణం సూక్తం సద్భ్రహ్మగుణభూషితమ్।**
**స్వీచకారాహమవ్యగ్రా స్వమహిమ్ని ప్రతిష్ఠితమ్॥**
**త ఏతే పరమే సూక్తే మహర్షిగణసేవితే।**
**అధీతే చ విమృష్టే చ నయేతాం పరమాం గతిమ్॥ 50-18**

(స్థావరజంగమాత్మకాలైన అన్నిటికీ స్వామి, నారాయణుడనే పేరును కలవాడు అయిన దేవుడు లోకాలకు అన్నిటికీ ఆత్మయై, జ్ఞాన-శక్తి-బల-ఐశ్వర్య-వీర్య-తేజస్సులనే షడ్గుణాలు, ఆనందగుణం మూర్తీభవించినవాడై ఉన్నాడు. అన్ని వస్తువులకు ఉపాదాన కారణమై, అన్నిటినీ నియమించేవాడై, అన్నిటినీ తెలిసినవాడై, అన్ని కార్యాలను చేయగలవాడై ఉన్నాడు. అనిష్టం లేనివాడు, దోషరహితుడు, అన్ని కల్యాణ గుణాలకు ఆశ్రయంగా ఉన్నవాడు, తానే తన దివ్యప్రకాశంతో తేజోరహిత పదార్థాలను, తేజః పదార్థాలను అన్నిటినీ ప్రకాశింపజేసేవాడు, (హృదయస్థానంలో దివ్యమంగళవిగ్రహంతో కూడినవాడై) అంతర్యామిగా వేంచేసి ఉండేవాడు, అటువంటి సన్నివేశంతో ప్రాణులను అన్నిటినీ నియమించేవాడు, సదసత్తులను రెండిటినీ సృష్టించేవాడుగాను ఉన్నాడు. అధికమైన శక్తిని కలవాడుగాను, అన్నిటికీ ఆధారభూతుడై ఉండేవాడు, అన్ని శక్తులను కలవాడు అయిన అతడు గొప్పశక్తి అయిన నాకు కూడా ఈశ్వరుడై ఉన్నాడు. శ్రీదేవి అనే పేరును కల నేను అతనియొక్క గొప్పదైన, సాటిలేని, నిత్యమైన శక్తిగా ఉన్నాను. నేను ఏ దోషాలను లేనిదానను. సర్వవ్యాపి అయిన భగవానునకు అన్ని భోగాలను కల్గించేదానను. తన మనస్సునుండి వ్యక్తం అయే శుద్ధాశుద్ధగతులను కలదానను. (అంటే శుద్ధగతులైన పరమపదాన్ని, కైవల్యాన్ని, అశుద్ధగతులైన సంసారగతులను తన సంకల్పంతో కల్గించేదానను. **"శ్రేయో న హ్యరవిందలోచనమనః కాంతా ప్రసాదాదృతే సంసృత్యక్షర వైష్ణవాధ్వసు నృణాం సంభావ్యతే కర్హిచిత్"** అనే యామునుల వాక్కు ఇచట స్మరణీయం). (ఈ విధంగా సకలఫలాలను ఇచ్చేదిగా ఉండడానికి కారణం) హృషీకేశుడైన భగవానుని పురుషకారస్వరూపిణిగా లక్ష్మి వెన్నంటి ఉంటుంది. పాపులు, పుణ్యాత్ములు-అనే భేదం లేకుండా చేతనులను అందఱిని ఒకే విధంగా అనుగ్రహించే కారుణ్యగుణాన్ని కల్గినది ఈమె. అందఱికంటె గొప్పవారమై, లోకాలకు అన్నిటికీ తల్లిదండ్రులమై ఉండే మేము ఇద్దఱం లోకాలను అనుగ్రహించడం కోసం గొప్పతేజస్సుతో పరమపదంలో వేంచేసి ఉంటాము. ఒకానొక సమయంలో జీవులకు హితాన్ని కల్గించాలనే భావనతో కరుణతో నిండినవారమైన మేము ఇద్దఱం అచిత్తుతో సమానంగా, ఏ సుఖం లేకుండా పడి ఉండే



ఈ జీవులు ఏ విధంగా సుఖాన్ని పొందుతారు? అనే ఆలోచనతో ఉన్నాము. అపుడు ఆ విధంగా మనస్సులో ఆలోచన చేస్తూ, శబ్దబ్రహ్మమనబడే వేదసాగరాన్ని మథించడానికి ఆరంభించాము. ఋగ్యజుస్సామ మంత్రాలు నిండిన ఆ వేదసాగరం నుండి పెరుగును చిలికేటపుడు వెన్న ఉద్భవించేటట్లే, రెండు దివ్యసూక్తాలు ఉద్భవిల్లాయి. ఆ రెండు నిర్దుష్టమైనవి, సందేహం లేనివి, అస్పష్టం కానివి, నశింపనివి, శబ్దానికి ఉండ తగిన సకలసద్గుణాలతో నిండినవి, ఎటువంటి ఆకులత లేని పదాలను, అక్షరాలను కల్గినవి, మొదట- చివర ఒకదానిలో ఉండే అక్షరాలు వేరొక దానిలో కూర్చబడినవి. (అంటే- శ్రీసూక్తం మొదటి మంత్రంలోని **"లక్ష్మీం జాతవేదో మ ఆవహ"**- అనే చోట గల లక్ష్మీపదం పురుషసూక్తం చివరలో **"హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ"** అనేచోట, పురుషసూక్త ప్రారంభంలోని **"సహస్రశీర్షా పురుషః"** అనే మంత్రంలోని పురుషశబ్దం శ్రీసూక్తం చివర **"విందేయం పురుషానహమ్"** అనేచోట పఠింపబడుతున్నవి). శక్తి అనబడే నాచేత, శక్తిమంతుడైన భగవానునిచేత నిండినవై, మా ఇద్దఱి నామాలు అయిన పురుష, జాతవేదస్, లక్ష్మి, శ్రీ మొదలైనవి కలసినవై ఉన్నాయి. ఆ రెండిటిలో పురుషునిగూర్చి తెలిపేది, చక్కని శబ్దగుణాలచేత భూషితమైనది, తన మహిమలోనే సుప్రతిష్ఠితమైనది అయిన పురుషసూక్తాన్ని పుండరీకాక్షుడైన స్వామి తనదిగా పరిగ్రహించాడు. స్త్రీని తెలిపేది, చక్కని శబ్దగుణాలచే అలంకరింపబడినది, నా మహిమలోనే సుప్రతిష్ఠితమైనది అయిన శ్రీసూక్తాన్ని నేను నాకు చెందినదిగా స్వీకరించాను. గొప్పవి అయిన ఈ రెండు సూక్తాలు మహర్షి గణాలచేత కీర్తింపబడేవి. అధ్యయనం చేసినంత మాత్రంలోనే, అర్థాన్ని అనుసంధించిన మాత్రంలోనే ఉత్తమగతిని పొందించేవి).

ఇటువంటి గొప్పతనాన్ని కల ఈ శ్రీసూక్తానికి కల ఋషి, ఛందస్సు, దేవత, వినియోగం మొదలైన వానినిగూర్చి లక్ష్మీతంత్రం ఈ క్రింది విధంగా తెలిపింది.

**మామేవాస్య మునిం విద్యాత్ ఛందః శ్రీర్నామ కథ్యతే।**
**దేవతా సకలాధారా విష్ణుపత్న్యహమీశ్వరీ॥**
**వినియోగోఽస్య సూక్తస్య లక్ష్మీనారాయణార్చనే।**
**అంగస్థాం భావయేల్లక్ష్మీం విష్ణోర్మాం పరమేశ్వరీమ్॥**
**వామేనాలింగితాం శశ్వత్ బాహునా పరమాత్మనః।**
**తదంసలగ్నబాహుం చ దివ్యపంకజధారిణీమ్॥**
**అథ మామర్చయేత్ ఋగ్భిః ప్రయతః పరమేశ్వరీమ్।**
**వామోత్సంగనిషణ్ణాం మాం దేవదేవస్య శార్ఙ్గిణః॥**
**కుర్యాత్ ప్రథమయా చర్చా త్వావాహనమతంద్రితః।**
**ద్వితీయయాసనం దద్యాత్ దేవదేవస్య శార్ఙ్గిణః॥ 50-24**

సువర్ణమయమైనది అయిన, లక్ష్మీమ్=లక్ష్మీదేవిని, మే=నాకు, ఆవహ=ప్రత్యక్షం అయేటట్లు చేయాలి.

పూర్వం నాల్గు వేదాలను ఆవిర్భవింపజేసిన భగవానుని ఆహ్వానిస్తూ, శేషత్వలక్షణాన్ని పూర్ణంగా కల్గినదై, నీకు తగిన వైభవాన్ని కల లక్ష్మీదేవిని నా విషయంలో స్థిరంగా ప్రసన్నం అయేటట్లు చేయాలి–అని ఇందులో వేదపురుషుడు ప్రార్థిస్తున్నాడు.

**(హిరణ్యవర్ణామ్)** –బంగారువంటి రంగును కల్గినదానిని–అని అర్థం. "హిరణ్మయః పురుషః " (సువర్ణమయుడైన పురుషుడు) అని కీర్తింపబడిన వానికి తగినది–అని తాత్పర్యం. హేమసమానవర్ణునకు పత్ని అయినపుడు హిరణ్యవర్ణగానే ఉండాలి కదా!

**తుల్యశీలవయోవృత్తాం తుల్యాభిజనలక్షణామ్।**
**రాఘవోఽర్హతి వైదేహీం తం చేయమసితేక్షణా॥**

(సమానమైన శీలం,వయస్సు, నడవడికలను కల్గినది, తగిన అభిజాత్యాన్ని, లక్షణాలను కల్గినది అయిన వైదేహికి రాముడే తగినవాడు. అతనికికూడా నల్లని కన్నులను కల ఈమె తగినది) అనికదా హనుమంతుడు అన్నాడు నిజానికి మేఘవర్ణుడైన స్వామి సువర్ణమయుడు కావటం ఈమె నిత్యసాన్నిధ్యం వల్లనే కదా!.

**(హిరణ్యవర్ణామ్)**– హిరణ్యం అంటే బంగారం. వర్ణ శబ్దానికి అక్షరం అని అర్థం. బంగారంవలె భూతాలలో అంతర్హితంగా, వర్ణాత్మికగా ఉండేది–అని భావం. లేక బంగారంవలె స్పృహణీయం అయిన (ఆశపడతగిన) శబ్దాన్ని కల్గినది–అని కూడా చెప్పవచ్చు. "మధురా మధురాలాపా" (మధురమైనది, తీయని పల్కులను కల్గినది) అని సీతాదేవిని గూర్చి హనుమంతుడన్నాడు కదా! "పాల్ మొళియాయ్" (పాలవంటి మధురమైన పల్కులను కల్గినదై) అని కలివైరిసూరి సూక్తి. "నిహితా సర్వభూతేసు వ్రణే భృంగవధూరివ, జనయంతీ పరం నాదం తైలధారావదచ్యుతమ్" (37) (ఆడుతుమ్మెదతో భోగ్యబుద్ధితో మగ తుమ్మెద ఉన్నట్లు, నేను, నాకు చెందిన అన్ని భూతాలలోను భోగ్యబుద్ధితో నన్ను ధారవలె విడువకుండా గొప్పనాదాన్ని కల్గిస్తూ వేంచేసి ఉంటుంది) అని లక్ష్మీతంత్రంలో ఈ అర్థం ఆదరింపబడింది. ఈ శ్లోకంలో "రణే" (శబ్దిస్తున్నాను) అనే పాఠం కూడా (ద్వితీయచరణంలో) ఉన్నది. అపుడు "హి" అనే అక్షరం "నిహితా" (అంతర్యామిగా ఉన్నది) అని, "రణ్" అనేది "రణే" (శబ్దం చేస్తున్నాను) అని, "య" అనేది "జనయంతీ" అని వివరింపబడినట్లుగా గ్రహించాలి. (దీనివల్ల 'హిరణ్య' అనే పదం వివరింపబడింది) "నిహితా" అని అన్నందున భగవానుడు సర్వాంతర్యామియై ఉండే స్థితిలోకూడా ఈ లక్ష్మీదేవి అతనిని వెన్నంటి ఉంటుందనే అర్థం ఏర్పడుతున్నది. "అరవిన్దప్పావైయుమ్ తానుమ్ అకమ్బడి వన్దు పుకున్దు" (పద్మినివాసిని అయిన లక్ష్మి, తాను నా మనస్సులోకి వచ్చి ప్రవేశించి) అని భట్టనాథులు (విష్ణుచిత్తులు), "తిరుమాల్ వన్దు ఎన్నెఞ్జు నిఱైయ



ఆవాహనం చేయాలి. రెండవమంత్రంతో దేవదేవుడైన భగవానునకు, నాకు ఆసనాన్ని సమర్పించాలి. మూడవమంత్రంతో సర్వేశ్వరునకు అర్ఘ్యపాద్యాలను అర్పించాలి. నాల్గవమంత్రంతో ఆచమనాన్ని, ఆఱవ మంత్రంతో మా ఇద్దఱికీ స్నానాన్ని చేయించాలి. ఏడవమంత్రంతో వస్త్రాలను, ఎనిమిదవ మంత్రంతో భూషణాలను అలంకరించాలి. తొమ్మిదవ మంత్రంతో గంధాన్ని, పదవ మంత్రంతో పుష్ప సమూహాన్ని, పదకొండవ, పన్నెండవ ఋక్కులతో ధూపదీపాలను, పదమూడవ మంత్రంతో మధుపర్కాన్ని, పదునాల్గవ మంత్రంతో ప్రాపణాన్ని (ప్రతిష్ఠాపనాన్ని), పదిహేనవ మంత్రంతో నమస్కారాన్ని చేయాలి. **"తారికా"** అనే మంత్రాన్ని, దానికి తరువాత 'తారమ్' అనబడే ఓంకారాన్ని ఒక్కొక్క మంత్రం చివరలో నియమంతో కూడినవాడై మంత్రజ్ఞుడు ప్రయోగించాలి. సాధ్యమైనంతవరకు విధి పూర్వకంగా జపించాలి. సూక్తమంత్రాల చివరలో ఉండే తారికామంత్రంతో లయం అయేటట్లు (పూర్తి అయేటట్లు) భావించాలి. తారికలో ఉన్నవారినిగా మమ్ములను భావించి, మమ్ములనే సర్వప్రాప్యంగా తలచాలి. ఇది ఒక విధమైన వినియోగం. ఇంకొక వినియోగప్రకారం ఈ క్రింది విధంగా ఉంటుంది. మొదటి నాల్గు మంత్రాలతో మమ్ములను ఇద్దఱినీ ఆవాహన చేయాలి. శుద్ధమైన మనస్సుతో అయిదవ ఋక్కు ద్వారా శ్రీదేవి అయిన నన్ను శరణు పొందాలి. "ఆపః" అని ప్రారంభమయ్యే మంత్రంలో అర్ఘ్యపాద్యాలను, ఆచమనీయాన్ని సమర్పించాలి. "ఆర్ద్రామ్" అనే మంత్రంతో స్నానాన్ని, **"కర్దమేన"** అనే మంత్రంతో వస్త్రాన్ని, **"గంధద్వారామ్"** అనే మంత్రంతో గంధాన్ని, "ఉపైతు" అని ప్రారంభం అయే మంత్రంతో అలంకారాన్ని, **'కాంసోస్మితామ్'** అనే మంత్రంలో ధూపదీపాలను, ఆఱవమంత్రంతో ఉపహారాలను, 'మనసః', కామమ్ అనే ఋక్కుతో మధుపర్కాన్ని సమర్పించాలి. **"క్షుత్పిపాసామ్"** అనే మంత్రం ప్రాపణాన్ని చెబుతుంది. చివరి ఋక్కుతో నమస్కారాన్ని ఆచరించాలి. మిగిలినవానిని పూర్వంవలె చేయాలి).

శ్రీసూక్తానికి శ్రీదేవి పుత్రుడైన హిరణ్యగర్భుడు (బ్రహ్మ) ఋషి అని కూడా కొందఱు అంటారు. నాల్గవ, అయిదవ మంత్రాలు త్రిష్టుప్ ఛందస్సు అని, మిగిలినవి అనుష్టుప్ ఛంధస్సు అని చెప్పడం కూడా ఉన్నది. మూడవ, చివరి మంత్రాలు బృహతీఛందస్సులో ఉన్నాయనికూడా కొందఱు అంటారు. **బోధాయనమహర్షి** శ్రీసూక్త హోమాన్ని చేసే రీతిని తెలిపి, ఆ హోమాన్ని చేస్తే గొప్ప ఐశ్వర్యం కల్గుతుందని తెలియజేశారు. వశిష్ఠస్మృతిలో కూడా శ్రీసూక్త హోమవిధానం తెలుపబడింది. ఒక సంవత్సరకాలం దానిని అనుష్ఠించినవారికి గొప్ప సంపత్తి కల్గుతుందని అక్కడ ఘోషింపబడినది. ఇంకా పలు స్మృతిగ్రంథాలలో శ్రీసూక్త వినియోగ ప్రకారం, దాని ఫలం వ్యక్తం చేయబడ్డాయి.

**మల్లికైః శ్వేతపద్మైర్వా జాతిపుష్పైరథాపి వా।**
**మందారకుసుమం వాపి పూజాయాం గృహ్యతే శ్రియః॥**

**ఆద్యయావాహయేద్దేవీం శ్రీసూక్తస్య నృపేశ్వరీమ్।**
**ద్వితీయయాసనం దద్యాత్ పాద్యం చైవ తృతీయయా॥**

**చతుర్థ్యార్ఘ్యప్రదానం స్యాత్ పంచమ్యాచమనీయకమ్।**
**షష్ఠ్యా స్నానం ప్రకుర్వీత సప్తమ్యా వస్త్రమేవ చ॥**

**ముక్తాసంవీత మష్టమ్యా భూషణాని చ పార్థివ।**
**గంధం దద్యాన్నవమ్యాతు దశమ్యా పుష్పమేవ చ॥**

**ఏకాదశ్యా తథా ధూపం ద్వాదశ్యా జ్యోతిరేవ చ।**
**పాయసం ఘృతసంయుక్తం ఖండశర్కరసంయుతమ్॥**

**నివేదయేత్ త్రయోదశ్యా చతుర్దశ్యా ప్రదక్షిణమ్।**
**ఉద్వాసయేత్ పంచదశ్యా లక్ష్మీం తాం లోకమాతరమ్॥**

(మల్లెపూలు, తెల్ల తామరలు, జాతిపుష్పాలు, మందారపూలు–అనే వీటిలో వేటితో అయినా శ్రీదేవిని పూజించాలి. శ్రీసూక్తంలోని మొదటి మంత్రంలో ఆవాహనం చేయాలి. రెండవ, మూడవ, నాల్గవ, అయిదవ మంత్రాలతో క్రమంగా ఆసనం, పాద్యం, ఆర్ఘ్యం, ఆచమనీయం–అనే వీటిని అర్పించాలి. ఆఱవ మంత్రంతో స్నానాన్ని, ఏడవ మంత్రంతో వస్త్రాన్ని సమర్పించాలి. ముత్యాలమాలను, మిగిలిన భూషణాలను, ఎనిమిదవ మంత్రంతో, తొమ్మిదవమంత్రంతో చందనాన్ని, పదవమంత్రంతో పుష్పాలను, పదకొండవ, పన్నెండవ ఋక్కులతో ధూపాన్ని, దీపాన్ని, నేయి, ఖండశర్కర చేర్చిన పాయసాన్ని పదమూడవ మంత్రంతో సమర్పించాలి. పదునాల్గవ మంత్రంతో ప్రదక్షిణాన్ని చేసి, లోకానికి అంతటికీ తల్లి అయిన లక్ష్మీని పదిహేనవ మంత్రంతో ప్రతిష్ఠాపనాన్ని చేయాలి) అని ప్రారంభించి పద్మపురాణంలో

**"శ్రియః పంచదశర్చంతు శ్రీకామస్సతతం జపేత్"**

(పదిహేను మంత్రాలను కల శ్రీసూక్తాన్ని సంపదను కోరేవాడు నిత్యం జపించాలి) అని,

**"యః శ్రీసూక్తం జపేన్నిత్యమ్ ఋగ్భిస్తామర్చయేచ్ఛ్రియమ్।**
**శ్రీకామో జుహుయాదగ్నౌ పద్మైర్బిల్వైస్తథా ఫలైః॥"**

(సంపదను ఆశించేవాడు ప్రతిదినం శ్రీసూక్తాన్ని జపించాలి. ఆ మంత్రాలతోనే శ్రీదేవిని పూజించాలి. తామరపూలతోగాని, బిల్వఫలాలతో గాని, మంత్రాలతో అగ్నిలో హోమం చేయాలి) అని మిగిలిన స్మృతి పురాణాలలోను నియమింపబడింది. ఋషి, ఛందస్సు, దేవత, వినియోగం మొదలైనవానిని అవశ్యం తెలిసికోవాలనే అంశం–

**"యో హ వై అవిదితార్షేయచ్ఛందో దైవత బ్రాహ్మణేన మంత్రేణ యజతి యాజయతి వా, అధ్యాపయతి వా, స్థాణువర్ఛతి గర్తం వాఽపద్యతే ప్రవా మీయతే పాపీయాన్ భవతి యాతయామాన్యస్య ఛందాంసి భవంతి. అథ యో మంత్రే వేద స సర్వమాయురేతి అయాత్యామాన్యస్య ఛందాంసి భవంతి"**



(ఎవడు ఋషి ఛందస్సు, దేవత, బ్రాహ్మణం–అనే వీటిని తెలియడానికి సాధ్యంకాని మంత్రాలతో యాగాన్ని చేస్తున్నాడో, లేక, యాగాన్ని చేయిస్తున్నాడో లేక అధ్యయనం చేయిస్తున్నాడో అతడు స్థాణువు అవుతున్నాడు. అధః పతనాన్ని చెందుతున్నాడు. నశిస్తున్నాడు. పాపిష్ఠివాడు అవుతున్నాడు. అతని వేదాధ్యయనం అంతా నిష్ఫలం అవుతుంది. ఎవడు మంత్రానికి సంబంధించిన ఈ అంశాలను తెలిసికొంటున్నాడో అతడు నూఱు ఏండ్లు జీవిస్తున్నాడు, అతని వేదాధ్యయనం అంతా సఫలం) అని,

**అవిదిత్వా ఋషిం ఛందో దైవతం యోగమేవ చ।**
**యోఽధ్యాపయేత్ యాజయేద్వా పాపీయాన్ జాయతే తు సః॥**

(ఋషిని, ఛందస్సును, దేవతను, వినియోగాన్ని తెలియకుండా ఎవడు అధ్యయనం చేయిస్తున్నాడో, లేక యాగాన్ని చేయిస్తున్నాడో అతడు పాపిష్ఠివాడు అవుతున్నాడు) అని శాస్త్రంలో ఘోషింపబడింది. మంత్రాల అర్థజ్ఞానం కూడా ఆవశ్యకం అనే విషయం

**స్థాణురయం భారవహః కిలాధీత్య వేదం న విజానాతి యోఽర్థమ్।**
**యోఽర్థం చ యత్సకలం భద్రమశ్నుతే సనాకమేతి జ్ఞానవిధూతపాప్మా॥**

(ఎవడు వేదాన్ని అధ్యయనం చేసినా, దాని అర్థాన్ని గ్రహించకుండా ఉన్నాడో, అతడు వేదభారాన్ని మోసే స్థాణువే అవుతున్నాడు. ఎవడు వేదార్థాన్ని తెలిసికొంటున్నాడో అతడు అన్ని శుభాలను పొందుతున్నాడు. అర్థజ్ఞానంతో పాపం తీరి పరమపదాన్ని పొందుతున్నాడు) అనికూడా ఉద్ఘోషింపబడింది. ఈ అర్థజ్ఞానాన్ని అందఱు పొందటం కోసం లక్ష్మీదేవి స్వయంగా పల్కిన లక్ష్మీతంత్రవచనాలను, పరాశరాది మహర్షుల వాక్యాలను, దివ్యసూరుల సూక్తులను, విజ్ఞులైన ఆచార్యుల పలుకులను పురస్కరించుకొని ఈ శ్రీసూక్తంయొక్క అర్థం యథాశక్తి వివరింపబడుతున్నది. ఈ వివరణం ప్రాయికంగా తమిళంలో శ్రీమాన్ ఎస్.కృష్ణస్వామి అయ్యంగార్ చేసిన వివరణాన్ని అనుసరించి చేయబడింది.

**హరిః ఓమ్**

| | | |
|---|---|---|
| **1.** | **హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణరజతస్రజామ్।**<br>**చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మ ఆవహ॥** | **1** |

జాతవేదః=వేదాలను ఆవిర్భవింపజేసిన స్వామీ!, హిరణ్యవర్ణామ్=అందమైన వర్ణాన్ని కలిగినది, హరిణీమ్=ఆడ లేడివంటిది, సువర్ణరజతస్రజామ్=బంగారు మాలికలను, వెండి మాలికలను కల్గినది, చంద్రామ్=చంద్రునివలె ఆనందింపజేసేది, హిరణ్మయీమ్=

ప్రేరకత్వ రూపం అయిన అన్వయం ఉన్నదని అన్నారు కదా! వీటికి అన్నిటికీ మూలంగా దివ్యసూరులు కూడా **"అల్లిమలర్ పోకమయక్కుకళాకియుమ్ నిఱ్కుమమ్మాన్ ఎల్లైయిల్ ఞానత్తన్ ఞాన మవదే కొణ్డు ఎల్లాక్కరుమజ్గళుమ్ శెయ్ ఎల్లైయిల్ ఞానత్తన్"** (తామర పూవులో నివసించే లక్ష్మియొక్క సంశ్లేషంచే కల్గిన ఆనందాలను కలవాడై ఉండే స్వామి అవధిలేని జ్ఞానం కలవాడు, ఆ జ్ఞానాన్ని పరిగ్రహించి, సమస్త జగద్వ్యాపారాలను చేసేవాడు, అంతులేని ఆశ్చర్యకర చేష్టలను కలవాడు) అని అంటూ ఈ లక్ష్మీదేవి భగవానుని అన్ని కార్యాలలో అన్వయాన్ని కల్గి ఉన్నాడు అని అన్నారు. ఈ సందర్భంలో ఈ క్రింది ఐతిహ్యం స్మరణీయం. ఒక పర్యాయం శ్రీవాత్స్యవరద గురువులనే ఆచార్యులు తమకు ఆచార్యులైన కురుకేశులను ఉద్దేశించి "ఈ విధంగా ప్రేరణ కల్గించడమనే అప్రధానమైన అన్వయం జగత్కారణత్వంలో లక్ష్మికి ఉన్నదా?" అని ప్రశ్నించగా కురుకేశులు "ఈ విషయంలో సందేహం ఏమున్నది?" **ఆవాభ్యాం కర్మాణి కర్తవ్యాని, ప్రజాశ్చోత్పాదయితవ్యాః** (మనం ఇద్దఱం కలసి కర్మలను ఆచరించాలి, సంతానాన్ని కనాలి) అని ప్రమాణం చెబుతున్నందున సహధర్మచారిణి అయిన ఈమెకు అన్వయం ఉన్నది" అని సమాధానం చెప్పారు. "హరిని ప్రేరేపించేది" అనే అర్థాన్ని కల ఈ "హరిణీ" నామం వల్ల ఈ ఆచార్యుల సూక్తుల వల్ల లక్ష్మీదేవికి జగద్వ్యాపారంలోను, ముక్తిప్రదానంలోనూ ప్రేరకత్వ రూపకమైన అప్రధానమైన అన్వయం ఉన్నదే తప్ప, సాక్షాత్తు కార్యకరత్వరూపం అయిన ప్రధానమైన అన్వయం లక్ష్మికి లేదని వ్యక్తమవుతున్నది. అందువల్లనే

**''యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి యత్ప్రయంత్యభిసంవిశంతి తత్ విజిజ్ఞాసస్వ తత్ బ్రహ్మేతి"** (దేనివల్ల ఈ ప్రాణులు పుడుతున్నవో, దేనివల్ల పుట్టిన ఈ జీవులు జీవిస్తున్నాయో, దేనిలో ప్రళయ సమయంలో లయిస్తున్నవో, మోక్షంలో ఎవనిలో ప్రకారతయా ఏకమవుతున్నవో దానిని పరబ్రహ్మగా తెలిసికో) అని వేదాలలోను, **"జన్మాద్యస్య యతః"** (ఈ లోకానికి ఉత్పత్తి మొదలైనవి ఎవనివల్లనో, అది పరబ్రహ్మం) అని బ్రహ్మసూత్రాలలోను చెప్పబడ్డ జగత్కారణత్వం, ముక్తి ఫలప్రదత్వం అనే పరబ్రహ్మ లక్షణాలలో ఈమెకు అతివ్యాప్తి రాదు– అని తెలుస్తున్నది. వేదాంతదేశికులు కూడా చతుఃశ్లోకీ భాష్యంలో "కించ యదా ముక్తస్య భగవతా పరమసామ్యే శ్రుతి స్మృత్యాది సిద్ధేఽపి "జగద్వ్యాపారవర్జమ్" ఇతి లక్షణభూతైరాకారైః వైషమ్యం స్థాప్యతే తథా ఇహాపి భవతి" (అంతేకాక, ఏ విధంగా ముక్తునకు పరమాత్మతో గొప్పదైన సామ్యం **'పరమం సామ్యముపైతి', 'మమ సాధర్మ్యమాగతాః'** ఇత్యాది శ్రుతిస్మృత్యాదుల వల్ల సిద్ధించినా, ''జగద్వ్యాపారాలను తప్ప మిగిలిన విషయాలలోనే సామ్యం'' అని బ్రహ్మసూత్రాలలో చెప్పబడ్డరీతిలో వైషమ్యం చెప్పబడినట్లే, ఇక్కడ కూడా లక్ష్మీ విషయంలో) అని చెప్పారు. లోకంలో కూడా యజ్ఞాది నిర్వహణలో పత్నికి అన్వయం ఉంటుందని, కాని, అది అప్రధానమైన అన్వయమేనని గమనిస్తున్నాము. **"సహధర్మచరీ తవ"** అని



పుకున్దాన్" (శ్రియః పతి వచ్చి నా మనస్సులో నిండుగా ప్రవేశించాడు) అని శఠకోపసూరి ఈ దివ్యార్థాన్ని వ్యక్తం చేశారు. బంగారం వలె ఉన్నది–అని అనడం వల్ల వర్ణంలోను, అందంలోను గొప్ప విలువను కల్గి ఉండటం, సాధ్యంగా, సాధనంగా ఉండడం–మొదలైన గుణాలలో బంగారంతో సాటి వస్తుంది అనే విశేషం స్ఫురిస్తుంది.

**(హిరణ్యవర్ణామ్)– స్పృహణీయవర్ణకారణభూతామ్।।** అని అర్థం.

**మూలమాధారమారభ్య ద్విషట్కాంతముపేయుషీ।**
**ఉదితానేకసాహస్రసూర్యవహ్న్యిందుసన్నిభా।।**
**చక్రవత్ పునరాధారాత్ శాంతా పశ్యాథ మధ్యమా।**
**వైఖరీ స్థానమాసాద్య తత్రాష్టస్థానవర్తినీ।।**
**వర్ణానాం జననీ భూత్వా భోగాన్ ప్రాస్నోమి గౌరివ।**
**హిరణ్యవర్ణేత్యేవం మాం ప్రజాపతిరుదారధీః।।**
**స్తుత్వా తు మత్ప్రసాదాత్ స యోగానాం ధర్మమూచివాన్।**
**ప్రణవాదిర్నమోఽంతోఽయం మంత్రో మమ నవాక్షరః।।**
**శబ్దబ్రహ్మమయః సాక్షాత్ యోగినాం యోగసాధకః।** **50–42**

(నడుమునకు మూలభాగంలో ఉండే మూలాధార ప్రదేశంనుండి ప్రారంభించి, శిరస్సులో బ్రహ్మరంధ్రప్రదేశంనుండి పన్నెండువేళ్ళ అంతరం తర్వాత ఉండే ద్విషట్కాంతస్థానం వరకు వేంచేసి ఉండేదాననై, వేలాది సూర్యులు, అగ్నులు, చంద్రులు చేరి ఉదయించినట్లుండే గొప్ప కాంతిని కల్గినదాననై, చక్రాకారంలో ఉండే మూలాధారప్రదేశంనుండి శాంత అని, పశ్య అని, మధ్యమ అని పేరును కల ధ్వనులై, వైఖరీ స్థానాన్ని పొంది, అక్కడ (కంఠం మొదలైన) ఎనిమిది స్థానాల్లో ఉండేదాననై, శబ్దాలకు తల్లియై, గోవువలె భోగ్యాలను స్రవిస్తాను. ఇందువల్లనే ఉదారమైన బుద్ధిని కల బ్రహ్మ నన్ను "హిరణ్యవర్ణ" (అందమైన ధ్వనులకు ఉత్పాదికగా ఉండేది) అని స్తుతించి, నా అనుగ్రహంతో యోగధర్మాన్ని వివరించాడు. ప్రణవం నుండి ప్రారంభించి, నమస్సుతో ముగిసే (ఓమ్ హిరణ్యవర్ణాయై నమః) అనే ఈ మంత్రం తొమ్మిది అక్షరాలను కల్గినది. సాక్షాత్తు వేదమయమైనది. యోగులకు యోగాన్ని సిద్ధింపచేసేది) అని అంటూ లక్ష్మీదేవి లక్ష్మీతంత్రంలో చెప్పిన రీతిలో మానవులు ఉచ్చరించే అందమైన శబ్దాలకు కారణభూతురాలై ఉండేది అనే అర్థాన్ని ఈ నామానికి గ్రహించవచ్చు.

**(హరిణీమ్)** ఆడులేడి వలె ఉండేది అని అర్థం. **(హిరణ్యవర్ణాం హరిణీమ్)**– బంగారు లేడివలె ఉన్నది అని భావం. అభినివేశాన్ని కల్గించడంలోను, వశీకరించుకోవటంలోను హరిణి వంటిది. యోగులనే వేటగాళ్ళచే భక్తి అనే వలలో బంధింపబడే హరిణి. "హ్రంతి–బధ్నంతి ఏనామితి హరిణీ" అని వ్యుత్పత్తి.

**దూరాద్దూరతరం యామి హరిణీ యోగిమానసాత్।**
**భక్త్యా బధ్నంతి నిజయా యోగినో మాం యతవ్రతాః॥**
**షష్టిరష్ట సహస్రాణి యోగినో మత్పరాయణాః।**
**హరిణీం మామనుధ్యాయ ప్రత్యాహారం పరం గతాః॥ 50-44**

(హరిణి వంటి నేను యోగుల మనస్సునుండి చాలా దూరం పోతాను. వ్రతాలను అనుష్ఠించే యోగులు నన్ను తమభక్తితో బంధిస్తారు. 48వేలమంది యోగులు నన్నే గొప్ప ప్రాప్యంగా తలచి, నన్ను హరిణిగా ధ్యానించి గొప్పదైన ప్రత్యాహారస్థితిని పొందుతారు) అని లక్ష్మీతంత్రంలో ఈ అర్థం చెప్పబడింది.

**(హరిణీమ్)** హరిణాజినంతో (లేడి చర్మంతో) చుట్టబడినది-అని చెప్పవచ్చు. లేడి చర్మాన్ని సంస్తరంగా (చాపగా) కల్గినది అని, హరిచే ఆలింగనం చేసికోబడ్డ నడుమును కల్గినది అని, లేడికన్నుల వంటి అందమైన కన్నులను కల్గినది అని కూడా చెప్పవచ్చు.

**హరిణాజినసంవీతాం హరిణాజినసంస్తరామ్।**
**హరిణాశ్లిష్టమధ్యాం తాం హరిణాయతలోచనామ్॥**
**హరిణీం మామనుస్మృత్య పరాం శాంతిమవాప్నుయాత్।**

(లేడిచర్మంతో చుట్టబడిన దానను, లేడిచర్మాన్ని సంస్తరంగా కల్గిన దానను, హరిచే కౌగిలించుకోబడిన మధ్యభాగాన్ని కల్గిన దానను, లేడికన్నులవంటి కన్నులను కల్గినదానను అయిన నన్ను "హరిణీ" అని ధ్యానించి గొప్పశాంతిని పొందవచ్చు) అని లక్ష్మీతంత్రంలో ఈ నామాన్ని గూర్చి చెప్పబడింది.

**(హరిణీమ్)-** 'హరిం నయతీతి హరిణీ" (హరి అనబడే భగవానుని (సృష్ట్యాది) కార్యాలను చేసేటట్లు ప్రేరేపిస్తుంది) అనే అర్థాన్ని గ్రహించవచ్చు. జగత్సృష్ట్యాది కార్యాలు, మోక్షాది పురుషార్థప్రదానాలు మొదలైన వానిని అన్నిటినీ చేసేటట్లు హరిని పురికొల్పుతుంది. సహధర్మచారిణియై, పురుషకారస్వరూపిణియై ఉంటుంది. ఈ అర్థాన్ని భగవద్యామునులు చతుఃశ్లోకిలో

**ఈషత్త్వత్ కరుణానిరీక్షణసుధాసంధుక్షణాద్రక్ష్యతే**
**నష్టం ప్రాక్ తదలాభత స్త్రిభువనం సంప్రత్యనంతోదయమ్।**
**శ్రేయో న హ్యరవిందలోచనమనః కాంతా ప్రసాదాదృతే**
**సంసృత్యక్షర వైష్ణవాధ్వసు నృణాం సంభావ్యతే కర్హిచిత్॥**

(నీ కటాక్షం లేనందువల్ల పూర్వం నశించిపోయిన ముల్లోకాలు ఇపుడు కొంచెంగా నీ కరుణాకటాక్షం అనే అమృతవర్షం చేత అంతులేని అభ్యుదయాన్ని పొందేటట్లు రక్షింపబడుతున్నవి. మానవులకు ఐశ్వర్యం, కైవల్యం, పరమపదం-అనే వీటిలో శ్రేయస్సు తామరల వంటి కన్నులను కల భగవానుని మనస్సుకు మిక్కిలి ప్రియం అయిన లక్ష్మీదేవి



ప్రసాదం లేకపోతే ఏర్పడదు కదా) అని పలికారు. ఇదే భావాన్ని

**స్వస్తిశ్రీర్దిశతాదశేషజగతాం సర్గోపసర్గస్థితీః**
**స్వర్గం దుర్గతిమాపవర్గికపదం సర్వం చ కుర్వన్ హరిః।**
**యస్యా వీక్ష్య ముఖం తదింగితపరాధీనో విధత్తేఽఖిలం**
**క్రీడేయం ఖలు నాన్యథాఽస్యరసదాస్యాదైకరస్యాత్తయా॥**

(లోకాలను అన్నిటినీ సృష్టించడం, రక్షించడం, లయం చేయటం, స్వర్గనరక మోక్షాలను అనుగ్రహించడం చేసేటపుడు భగవానుడు ఎవరి ముఖ మండలాన్ని చూస్తూ, దాని ఇంగితాలకు వశుడై అన్ని పనులు చేస్తాడో, ఆ లక్ష్మీదేవి మనకు మంగళాన్ని అనుగ్రహించుగాక! భగవానుడు ఆమెతో ఒకే అభిప్రాయాన్ని కలవాడై ఉన్నందున ఆమె ఇంగితాలకు అధీనుడై కార్యాలను చేయకపోతే ఆ కార్యాలు ఆనందాన్ని కల్గించవు) అని కూరేశులు,

**"యద్భ్రూభంగా ప్రమాణం స్థిరచరరచనాతారతమ్యే మురారేః"**

(ఎవరి కనుబొమల కదలికలు భగవానుని స్థావర జంగమాత్మక సృష్టిలోని తారతమ్యాలకు కారణమో) అని,

**నమః శ్రీరంగనాయక్యై యద్భ్రూవిభ్రమభేదతః।**
**ఈశేశితవ్య వైషమ్యనిమ్నోన్నతమిదం జగత్॥**

(ఎవరి కనుబొమల విభ్రమాలలోని తారతమ్యంవల్ల ఈ లోకం నియమింపబడేవారు, నియమించేవారు అనే భేదంతో హెచ్చుతగ్గులను కల్గినది అవుతున్నదో, అటువంటి శ్రీరంగ నాయకికి నమస్కారం) అని,

**శ్రియై సమస్తచిదచిద్విధానవ్యసనం హరేః।**
**అంగీకారిభిరాలోకైస్సార్థయంత్యై కృతోఽంజలిః॥**

(సకల చేతనాచేతనాలను సృష్టించడంవల్ల భగవానునకు కలిగే శ్రమను తన అంగీకారాన్ని తెలిపే కటాక్షాలతో సఫలంగా చేసే లక్ష్మీదేవికి అంజలి చేయబడింది) అని,

**ఉల్లాసపల్లవితపాలితసప్తలోకీ నిర్వాహకోరకితనేమకటాక్షలీలామ్।**
**శ్రీరంగహర్మ్యతలమంగళదీపరేఖామ్ శ్రీరంగరాజమహిషీం శ్రియమాశ్రయామః॥**

(ఏడు లోకాలను భగవానుడు సృష్టించడంతో చిగురించినదిగా, అతనిచే రక్షింపబడ్డ ఏడు లోకాల నిర్వాహం చేత మొగ్గ తొడిగినట్లు ఉండే అర్ధ కటాక్షలీలను కల్గినదిగా శ్రీరంగ మందిరాన్ని ఒక మంగళదీపకళికగా ఉన్నది, శ్రీరంగనాథుని దివ్యమహిషి అయిన శ్రీదేవిని ఆశ్రయిస్తున్నాను) అని పరాశరభట్టర్ జగత్వ్యాపారాది సర్వకార్యాలలోనూ ఈమెకు

మాధవుడు) అని, **"వేరిమాఱాదపూమేల్ ఇరుప్పాళ్ వినైతీర్క్కుమ్"** (సువాసన మాఱని తామరపూవులో నివసించే లక్ష్మీదేవి కర్మలను పోగొడుతుంది) అని దివ్యసూరులు ఈ అర్థాన్ని ఆదరించారు.

ఇక్కడ ఒక సందేహం తలెత్తవచ్చు. ముక్తిఫలప్రదాతృత్వం అనేది పరబ్రహ్మకు మాత్రమే అన్వయించే లక్షణం. అది ఇష్టప్రాప్తి అని, అనిష్టనివృత్తి అని రెండు విధాలు. అందులో ఇష్టప్రాప్తి అంటే శ్రీ వైకుంఠాన్ని చేరి, స్వస్వరూపావిర్భావాన్ని పొంది, ప్రకాశించే జ్యోతిస్స్వరూపుడై, భగవద్భక్తులైన నిత్యముక్తులతో చేరి సర్వేశ్వరునికే చెందే నిత్య కైంకర్యాన్ని చేయడం. ఇక, అనిష్టనివృత్తి అంటే స్వరూపానికి తగిన భగవత్సేవకు విరోధులైన పుణ్యపాపరూపద్వివిధ కర్మలు, సంసారసంబంధం మొదలైన వాటిని తీర్చడం. "హరిణీ" అనే తిరునామం వల్ల, పైన ఉట్టంకించిన పలు ప్రమాణాలవల్ల పాపపుణ్యాది కర్మ నివృత్తి అనే అనిష్టనివృత్తిని లక్ష్మీదేవి చేస్తుంది–అని ఏర్పడుతున్నందున ఆమెకు కూడా మోక్షప్రదానత్వం ఉన్నదని, అందువల్ల ఆమె కూడా పరబ్రహ్మమే అని తెలుస్తున్నది కదా! అన్నది ఆ సందేహం. కాని, ఈ సందేహం సరికాదు. లక్ష్మీదేవి పాపనివృత్తిని చేయడం ఏ రీతిలో? అనే దానిని మొదట గమనించాలి. "పుణ్యాపుణ్యావీశ్వరప్రీతికోపౌ" (భగవానునకు కలిగే ప్రీతికోపాలే పుణ్యపాపాలు)అని, "యత్ త్వత్ప్రియం తదిహ పుణ్యమపుణ్యమన్యత్" (ఏది నీకు ఇష్టమో అది ఈ లోకంలో పుణ్యం, కానిది పాపం) అని చెప్పే రీతిలో పరమాత్మకు కలిగే ప్రీతి, కోపాలే పుణ్యపాపాలు. ఆ పరబ్రహ్మ "క్షమించాను, సహించాను" అన్నంతనే అవి నశిస్తాయి. అందువల్ల తాను "క్షమించాను" అని అనగానే నశించేవి, చేతనుని కర్మానుగుణంగా ఉండేవి అయిన ఆ ప్రీతి కోపాలను కలవాడు పరబ్రహ్మ అని తెలుస్తున్నది. ఇక, ఈ లక్ష్మీదేవి "నిత్యమజ్ఞాతనిగ్రహా" (ఏనాడూ కోపమన్నది తెలియనిది) అనే ప్రసిద్ధిని పొందినది. "కః కుప్యేత్ వానరోత్తమ" (వానరశ్రేష్ఠా! తమ స్వామికి అధీనలైన ఈ రాక్షసస్త్రీల విషయంలో ఎవడు కోపిస్తాడు?) అని పలికేది. అందుచేత ఈమె చేతనుని కర్మానుగుణంగా కోపాన్ని కల్గి ఉండడానికి, దానిని "సహించాను" అనే దానికి ప్రసక్తి లేనేలేదు. ఇక, ఈమె పాపాన్ని పోగొట్టే తీరు ఏమి? అని అంటే, జీవుని పాపకర్మలను చూచి "క్షిపామి, నక్షమామి" అని భగవానుడు కోపించి, నిగ్రహం చూపినపుడు తన రూపసౌందర్యాన్ని, భోగ్యతను చూపి, అతనిని వశీకరించుకొని, ఉచితోపాయాలలో, ఉక్తులతో భగవానుని నిగ్రహాన్ని ఉపశమింపజేసి, అతడు జీవుని "క్షమించాను" అని అనేటట్లు చేయడమే ఈమె పాపాన్ని పోగొట్టే విధానం. దీనిని భావించే దివ్యసూరులు కూడా పలు సూక్తులలో లక్ష్మీదేవితో కూడిన నారాయణుడు కర్మలను తీరుస్తాడు అని అనడం ద్వారా పాపాన్ని పోగొట్టడంలో భగవానుని అన్వయం ప్రధానం అని, ఈమెది అప్రధానమైనది అని తెలిపారు. "సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" అనే పాప నివర్తన సంకల్పాన్ని చేసేవాడు సర్వేశ్వరుడే. అతడు ఆ విధంగా సంకల్పించేటట్లు చేసేది లక్ష్మీదేవి.



చెప్పబడే ఈ లక్ష్మికి జగద్వ్యాపారాలలోనూ, ముక్తి ప్రదానాదులలోను అన్వయం లేదని చెప్పేవారు విష్ణుభక్తులలో ఎవరూ లేరు. అయితే, **"సహయుక్తేఽప్రధానే"** అనే వ్యాకరణసూత్రానికి, సహజమైన ఈమె పారతంత్ర్యానికి తగినట్లు ఆ అన్వయం అప్రధానమైనదే అవుతుంది. అందువల్లనే పరబ్రహ్మ లక్షణం ఈమె విషయంలో అన్వయించదు.

**(హరిణీమ్)**– "హరిణా నీయతే ఇతి హరిణీ" (హరిచే అన్ని కార్యాలలోను పిలువబడి తీసికొని పోబడుతున్నది కనుక "హరిణీ" అనబడుతున్నది) అనేటట్లు అన్ని కార్యాలలోను, అన్ని అవతారాలలోను, అన్ని స్థితులలోను హరిచే పిలువబడి, తీసికొనిపోబడుతున్నది కనుక ఈమెకు **"హరిణీ"** అనే పేరు కల్గినది అని కూడా చెప్పవచ్చును.

**(హరిణీమ్)**–జగత్సృష్ట్యాదులు, ముక్తిప్రదానాదులు మొదలైన కార్యాలలో భగవానునిచే వెంటతీసికొనిపోబడుతున్నది. కనుక హరిణి. **"క్రీడేయం ఖలు నాన్యథాఽస్య రసదా"** (జగత్సృష్ట్యాదులనే ఈ క్రీడ ఈ లక్ష్మీదేవి ముఖోల్లాసం కోసం చేయబడకపోతే భగవానునకు అవి ఆనందాన్ని కల్గించవు) అని కూరేశులు అన్నట్లు ఈమె అన్వయం లేకపోతే ఆనందం లేనందువల్ల నియమంగా అన్ని కార్యాలలోను అతనిచే అన్వయింపజేయబడుతుంది.

**(హరిణీమ్)**–అన్ని అవతారాలలోను స్వామిచే పిలువబడి, తనవెంట తీసికొనిపోబడుతుంది కనుక హరిణి.

**పునశ్చ పద్మా సంభూతా ఆదిత్యోఽభూత్ యదా హరిః।**
**యదా తు భార్గవో రామస్తదాసీద్ధరణీత్వియమ్॥**
**రాఘవత్వేఽభవత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని।**
**అన్యేషు చైవతారేషు విష్ణోః శ్రీరనపాయినీ॥**
**దేవత్వే దేవదేహేయం మనుష్యత్వే చ మానుషీ।**
**విష్ణోర్దేహానురూపాం వై కరోత్యేషాత్మనస్తనుమ్॥**

(భగవానుడు ఆదిత్యుడై అవతరించినపుడు లక్ష్మి పద్మ అయినది. పరశురాముడు అయినపుడు ఆమె ధరణి అయింది. రాఘవుడు అయినపుడు సీత అయింది. కృష్ణావతారంలో రుక్మిణి అయింది. మిగిలిన అవతారాలలో కూడా ఈ లక్ష్మి భగవానుని విడువకుండా ఉన్నది. అతడు దేవుడై అవతరించినపుడు ఈమె దేవదేహాన్ని ధరించింది. మనుష్యుడైనపుడు మానవరూపాన్ని దాల్చింది. ఈ విధంగా విష్ణువు దేహానికి అనురూపంగా ఈమె తన రూపాన్ని మలచుకుంటుంది) అని పరాశరమహర్షిచేత విష్ణుపురాణంలో చెప్పబడింది. **"కృష్ణాజినేన సంవృణ్వన్ వధూం వక్షఃస్థలాలయామ్"** (వక్షఃస్థలంలో నివాసం చేసే లక్ష్మీదేవిని కృష్ణాజినంతో కప్పిపుచ్చుకొనేవాడై బలి యజ్ఞవాటికకు వామనమూర్తి వచ్చాడు) అనే రీతిలో నిత్యబ్రహ్మచారిగా అవతరించినపుడు కూడా వక్షఃస్థలంలో ఉంచుకొని,

మఱుగుపఱచేటట్లు కదా ఈమె నిత్యసంశ్లేషం ఉంటుంది.

**యది మనుజతిరశ్చాం లీలయా తుల్యవృత్తేః-అనుజనురనురూపా దేవి! నావాతరిష్యః।**
**అసరసమభవిష్యన్నర్మ నాథస్య మాతః-దరదళదరవిందో దంతకాంతాయతాక్షి॥**

(కొంచెం వికసించిన ఎఱ్ఱతామరను పోలిన అందమైన నేత్రాలను కల లక్ష్మీదేవీ! నీ లీలకోసం దేవమనుష్య తిర్యక్ స్థావరరూపాలతో సమానమైన రూపాలను కలవాడై అవతరించే శ్రీరంగనాథుని అవతారాలు అన్నిటిలోను అతనితోపాటు అనురూపంగా నీవు అవతరించి ఉండకపోతే ఆ స్వామి లీలలు అన్నీ సారస్యాన్ని కల్గినవిగా కావు) అని శ్రీగుణరత్నకోశంలోను,

**అనుజనురనురూపచేష్టా-న యది సమాగమమిందిరాకరిష్యత్।**
**అసరస మభవాఽప్రియంభవిష్ణు-ర్ధ్రువమకరిష్యత రంగరాజ నర్మ॥**

(శ్రీరంగనాథా! లక్ష్మీదేవి నీ అవతారాలు అన్నిటిలో నీకు తగిన రూపాలను, లీలాలను కల్గినదై నీతో కలసి అవతారాలను ఎత్తి ఉండకపోతే, నీ అవతారాలనే లీలలు అసరసాలుగానో, లేక అప్రియాలుగానో తప్పకుండా అయివుండేవి) అని శ్రీరంగరాజస్తవం ఉత్తరశతకంలోను శ్రీ పరాశరభట్టర్ పలికిన రీతిలోనే భగవానుడు ఈమెను తనవెంట తీసికొనిపోకపోతే, అతని అవతారాలు అన్నీ ఆనందం లేనివే కాగలవు. ఇది నిశ్చయం.

**(హరిణీమ్)**-పైన పేర్కొన్న రీతిలో విభవావతారాలలో మాత్రమే కాక వ్యూహ-అంతర్యామి-అర్చారూపాలలో అన్నింటిలోను హరి వెంట తీసికొనిపోబడేది. "తిరుమాల్ కడల్" (శ్రియఃపతియొక్క క్షీరాబ్ధి) అని, "అమరర్ తొళ పణజ్గొళ్ పామ్బిల్ శన్దణి మెన్ములైమలరాళ్ తరణిమజ్గై తామిరువర్ అడివరుడుమ్ తన్మైయానై" (దేవతలు సేవిస్తుండగా పడగలను కల ఆదిశేషునిపై పరుండి, చందనం పూసికొన్న, మృదువైన స్తనాలను కల లక్ష్మీదేవి, భూదేవి అనే ఇద్దరు పాదసంవాహనం చేసే స్వభావాన్ని కలవానిని) అని క్షీరాబ్ధి మొదలైన వ్యూహాలలోను, **"మాధవా! మానేయ్ శిదైయ ఉణ్డైవిల్ నిఱత్తిల్ తెరిత్తాయ్ కోవిన్దా!"** (మాధవా! మంధర గూనితనాన్ని వింటితో పోగొట్టినవాడా! గోవిందా) "శీమాదవన్ గోవిన్దన్" (శ్రీమాధవుడు గోవిందుడు) అని విభవావతారాలలోను, "తిరుమాల్ వన్దుఎన్ నెఞ్జు నిరైయ ప్పుకున్దాన్" (శ్రియఃపతి వచ్చి నా మనస్సులో నిండి ఉండేటట్లు ప్రవేశించాడు), **"అరవిన్దప్పావైయుమ్ తానుమ్ అకమ్బుడి వన్దు పుకున్దు"** (అరవిందనివాసిని అయిన లక్ష్మి, తాను మనస్సులోపలకు వచ్చి, ప్రవేశించి) అని అంతర్యామి సన్నివేశంలోను, **"తిరువుడైయాళ్ మణవాళా తిరువరజ్గత్తే కిడన్దాయ్"** (లక్ష్మీవల్లభా! (శ్రీరంగంలో శయనించి ఉన్నవాడా!), **"వేజ్గడత్తెన్ తిరుమాలుమ్ పోన్దానే"** (వేంకటాద్రిలోని నా శ్రియఃపతి కూడా వచ్చాడా!) అని అర్చావతారాలలోను ఈమెతో కలిసే స్వామి వేంచేసి ఉంటాడు-అనే అర్థాన్ని దివ్యసూరులు తెలిపారు.



**(హరిణీమ్)**- "న జీవేయం క్షణమపి" అని భగవానుని విడచి క్షణం కూడా నిలువలేనందు వల్ల అరణ్యంలోకి వెళ్ళినపుడు, నగరానికి తిరిగి వచ్చినపుడు తేడా లేకుండా అతనివెంట తీసికొని పోబడింది కదా!

**(హరిణీమ్)- "మామ్ నయేత్ యది కాకుత్స్థః తత్తస్య సదృశం భవేత్"** (నన్ను శ్రీరాముడు తీసికొనిపోయినట్లయితే అది అతనికి తగినది కాగలదు) అని కదా సీతాదేవి పలికింది.

**(హరిణీమ్)**-"హరిమ్ నయతి" (హరిని తీసికొనిపోతుంది) అనే వ్యుత్పత్తిచేత 'నిన్ అన్బిన్ వళి నిన్ఱు శిలైపిడిత్తు ఎమ్బిరాన్ ఏక" (నీ ప్రేమమార్గంలో నిలచి వింటిని గ్రహించి స్వామి వెడలగా) అనే రీతిలో శ్రీరాముడు ఈ లక్ష్మీదేవి ప్రేమకు పరతంత్రుడు-అనే అర్థం తెలుపబడుతున్నది. **"హరిణా నీయతే"** (హరిచే తీసికొనిపోబడుతున్నది) అనే వ్యుత్పత్తి చేత ఈ లక్ష్మి స్వరూపంతోనే ఈ భగవానునకు పరతంత్ర అనే గొప్ప అర్థం తెలుపబడుతున్నది. ఈ విధంగా చెప్పవలసిన పని ఏమి? వీరిద్దరు ఒకరికొకరు ప్రేమ పరతంత్రులు తప్ప, స్వతఃశేషభూతులు కారు-అని గ్రహింపవచ్చును కదా! అని అంటే "విష్ణుపత్నీ" (విష్ణువుకు పత్ని) అని, **"లక్ష్మీశ్చ పత్న్యౌ"** (హ్రీ శబ్దవాచ్యురాలైన భూదేవి లక్ష్మీదేవి నీకు పత్నులు), **"విష్ణోఃశ్రీః"** (విష్ణువునకు శేషభూతురాలైన శ్రీదేవి) అని శ్రుతిస్మృతులలోను, **"స్వతః శ్రీస్త్వం విష్ణోః త్వమసి"** (లక్ష్మీదేవి! నీవు సహజంగానే విష్ణువునకు సొత్తుగా ఉన్నావు) అని ఆచార్య శ్రేష్ఠులైన పరాశరభట్టర్‌చేత చెప్పబడినందువల్ల **"శన్ద మెన్ములై మలరాళ్ తరణి మజ్గై తామిరువర్ అడివరుడుమ్ తన్మైయాన్"** (చందనం అలంకరించుకొన్న అందమైన, సుకుమారమైన స్తనాలను కల లక్ష్మీదేవి, భూదేవి తామిద్దరూ పాదసంవాహనం చేసే స్వభావాన్ని కలవాడు) అయిన దామోదరునకు "కేశవనమ్బియై కాల్ ప్పిడిప్పాళ్" (కేశవస్వామి శ్రీపాదాలను పట్టుకొంటుంది) అనే ఈ మహాఫలం పొందడం కోసం పెట్టిపుట్టిన లక్ష్మీదేవి సహజంగానే పరమాత్మకు శేషభూతురాలు అనే చెప్పాలి. లేకపోతే, శ్రుతి స్మృతులు, లక్ష్మీదేవి సూక్తులు, దివ్యసూరుల వచనాలు, ఆచార్యుల వివరణాలు-అన్నీ విరోధిస్తాయి.

**(హరిణీమ్)**-"హరిణీ ఏవ హరిణీ" (పాపాలను దుఃఖాలను దాసులకు లేకుండా చేస్తుంది కనుక హరిణి) అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు. "సంసారార్ణవతారిణీ, భవభంగాపహారిణీ" అని స్మృతులలో, **"శెడియాయ వల్వినైకళ్ తీర్‌క్కుమ్ తిరుమాలే"** (వృక్షాల వలె దట్టంగా ఉండే బలమైన కర్మలను తీర్చే శ్రియఃపతీ) అని, "తీవినైక్కరు నఞ్జైప్పూవినై మేవియ తేవిమణాళనై" (క్రూరకర్మలకు విషంవంటివాడు, పుష్పంలో నివసించే లక్ష్మీదేవికి నాథుడు) అని, **"శెడియార్ ఆక్కై అడియారై చ్చేర్‌దల్‌తీర్‌క్కుమ్ తిరుమాలే"** (నీచమైన శరీరంలో దాసులు ప్రవేశించడాన్ని, అంటే-సంసారబంధాన్ని తీర్చే శ్రియఃపతీ)అని, **"తిరుమకళార్ తనిక్కేళ్వన్ ఇరుమైవినై కడివారే"** (లక్ష్మీదేవికి వల్లభుడు ద్వివిధ కర్మలను తీరుస్తాడు) అని, **"కడివార్ తీయవినైకళ్ వడివార్ మాదవనారే"** (క్రూరమైన పాపకర్మలను తీర్చే

ఈశ్వర లక్షణం కనుక, ఆ లక్షణ ఈమెలో అతివ్యాప్తిని పొందకపోవడం కోసం ఈమె వ్యాప్తి అఘటితఘటనాశక్తి వల్ల ఏర్పడినది. కనుక సోపాధికం అని గ్రహించాలి–అని ఆ ఆచార్యులు అభిప్రాయపడ్డారు. విష్ణుపురాణ వ్యాఖ్యాత విష్ణుచిత్తులు, శ్రీవత్సాంకులు, పరాశరభట్టర్, నంజీయర్, నంబిళ్ళై, శ్రీ కృష్ణసూరి, వారి కుమారులు నాయనార్ ఆచ్చాన్‌పిళ్ళై మొదలైన మహనీయులు ఈ పక్షాన్ని ఆదరించారు. **"యథా సర్వగతో విష్ణుః"** అనే విష్ణుపురాణసూక్తి వ్యాఖ్యానంలో **"అథవా, భగవాన్ విభుత్వేన సర్వగతః, అస్యాస్తు శక్తివశాత్తత్ర తత్ర సన్నిధానాత్ సర్వగతత్వ ముక్తమ్ ఇయం చ సర్వగతా"** (లేక, భగవానుడు విభువై ఉన్నందున అంతటా ఉంటాడు. ఈమె తన అఘటితఘటనాశక్తివల్ల అక్కడక్కడ వ్యాపించి ఉండడం వల్ల ఈమెకు సర్వగతత్వం చెప్పబడినది. అందువల్ల ఈమె కూడా సర్వవ్యాపినియే) అని విష్ణుచిత్తులు వివరించారు. శ్రీకృష్ణసూరి అనే ఇంకొక పూర్వాచార్యులు "పరన్దరహస్యమ్" అనే గ్రంథంలోను, వడక్కు త్తిరువీధిప్పిళ్ళై అనే ఆచార్యులు అష్టాక్షరీదీపికా అనే గ్రంథంలోను ఈ క్రింది అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

**"అణురేష ఆత్మా"** అనే రీతిలో ఆత్మ సామాన్య ప్రయుక్తమైన ఈమెకు ఉండే అణుత్వం **"యథా సర్వగతో విష్ణుః తథైవేయం ద్విజోత్తమ"** ఇత్యాది ప్రమాణాలలో చెప్పబడినట్లుగా ఈశ్వరునకువలె ఈమెకుకూడా సర్వవ్యాపకత్వం చెబితే అది పరస్పరం విరుద్ధమై, ఏకాశ్రయస్థంగా సాధ్యం కాదు. కనుక అణుత్వ, సర్వవ్యాపకత్వాలు రెండూ సిద్ధించడం కోసం, **"అనుపపద్యమానార్థదర్శనాత్ ఉపపద్యమానార్థకల్పనమర్థాపత్తిః"** అని చెప్పబడే అర్థాపత్తి ప్రమాణానుసారం అపరిచ్ఛేద్యం అయిన స్వరూపవైభవాన్ని కల ఈశ్వరుడు అత్యంత సూక్ష్మపదార్థాలలో చేసే పరిసమాప్య వ్యాప్తికి ఒక శక్తి విశేషాన్ని ఒప్పుకొన్నట్లే, ఈమె కూడా ఒక శక్తి విశేషంతో, వ్యక్త్యాశ్రయం అయిన జాతివలె, ఈశ్వరుడు వ్యాపించిన ఉన్నచోట అంతా వ్యాపించగల్గినది కనుక, ఈశ్వరస్వరూప నిరూపక – అనే విషయం సంప్రతిపన్నం. ఇది శ్రీకృష్ణసూరి మొదలైనవారి అభిప్రాయం.

**యథా సర్వగతో విష్ణుః తథైవేయం ద్విజోత్తమ।**
**సర్వభూతస్థితేత్యాదేః శ్రీవిభుత్వప్రమాణతా॥**
**ఇతి చేత్తన్న, తద్వాక్యాదవిభుత్వేన చ శ్రియః।**
**శక్త్యా సర్వత్ర సాన్నిధ్యాత్ సర్వగత్వముదీరితమ్॥**
**ఇతి శ్రీవిష్ణుచిత్తార్యవ్యాఖ్యానాత్తు న సాధనమ్।**

(**"యథా సర్వగతో.... సర్వభూతస్థితా"** ఇత్యాది వాక్యాలు శ్రీదేవికి విభుత్వాన్ని సాధించే ప్రమాణాలు కావు. శక్తిద్వారా అంతటా సాన్నిధ్యాన్ని కల్గి ఉండటం చేత సర్వవ్యాపిత్వం చెప్పబడింది– అని శ్రీ విష్ణుచిత్తులనే ఆచార్యులు వ్యాఖ్యానించడంవల్ల ఆ వాక్యాలు విభుత్వసాధకాలు కావు) అని అంటూ రహస్యత్రయకారికావళిలో పలికారు.



స్వతంత్రుడైన భగవానునకు ఉన్నది ఉపాయత్వమే. భగవత్పరతంత్ర అయిన ఈమెకు ఉన్నది, ఈమెకు అతిశయాన్ని కల్గించేది–పురుషకారత్వమే. అందువల్లనే అజ్ఞాతనిగ్రహ, అనుగ్రహపరా అనే గొప్పతనాన్ని కల ఈమెకు పరంబ్రహ్మకావడం అనే అవకాశం లేదు.

**(హరిణీ)**–పచ్చని వర్ణాన్ని–హరితవర్ణాన్ని కల్గినది–అని కూడా చెప్పవచ్చు. ఈ అర్థాలన్నీ–

**హరిం నయామి కార్యేషు నీయే చ హరిణా స్వయమ్।**
**సదా హరిణభాసా – హం హరిణీ దురితం సతామ్॥**
**ప్రణవాదినమో – ంతశ్చ మంత్రో – యం మే షడక్షరః।**
**సర్వార్థసాధక స్సాక్షాత్ యోగసాధకముత్తమమ్॥**

(అన్ని కార్యాలలో హరిని ప్రేరేపిస్తున్నాను. హరిచేత ఎల్లప్పుడు వెంట తీసికొని పోబడుతున్నాను. ఎప్పుడూ పచ్చని రంగును కలదానినై ఉన్నాను. సత్పురుషుల పాపాలను తీరుస్తాను. ప్రణవాన్ని మొదట, నమశ్శబ్దాన్ని చివరగల **"ఓమ్ హరిణ్యై నమః"** అని ఆఱు అక్షరాలను కల ఈ మంత్రం అన్ని ఫలాలను సాధించి ఇస్తుంది. గొప్ప యోగసాధనం అవుతుంది.) అని లక్ష్మీతంత్రంలో లక్ష్మీదేవి చేతనే ఈ అర్థాలు ఆదరింపబడ్డాయి. ఈ విధంగా, పలు అర్థాలున్నా, లక్ష్మీదేవియొక్క విగ్రహసౌందర్యాన్నే ఈ మంత్రం వర్ణిస్తున్నందున నేత్రాలు మొదలైన వాటితో ఆడలేడిని పోలినది – అనే అర్థమే ముఖ్యంగా ఇక్కడ ఈ నామానికి గ్రాహ్యం. **"మానమరు మెన్నోక్కివైదేవీ"** (లేడికన్నులవంటి అందమైన కన్నులను కల వైదేహి) "మాళైమాన్ మడనోక్కి ఉన్ తోళి" (ఆడు లేడి కన్నులవంటి అందమైన కన్నులను కల నీ సఖి) అని దివ్యసూరులు కూడా ఈ అర్థాన్ని ఆదరించారు. ఇక మంత్రంలోని తరువాత నామం వివరింపబడుతున్నది.

**(సువర్ణరజతస్రజామ్)**–బంగారంతో, వెండితో చేయబడిన మాలెలను కల్గినది. ఈ నామం "సువర్ణస్రజామ్", "రజతస్రజామ్" అని రెండుగా విభజించి లక్ష్మీతంత్రంలో అర్థం చెప్పబడింది.

**(సువర్ణస్రజామ్)**–బంగారుతో నిర్మింపబడిన మాలెలను కల్గినది. "పొత్తామరైయాళ్" (బంగారు తామరలను కల లక్ష్మీదేవి) అని కలివైరిసూరి ఈ అర్థాన్ని పలికారు. **"సౌవర్ణైః కల్పితా నిత్యం మమ మాలా సరోరుహైః"** (నేను ఎల్లప్పుడు బంగారు తామరపూలతో చేసిన మాలెలతో అలంకరింపబడినందున "సువర్ణస్రజా" అనే పేరును కల్గి ఉన్నాను) అని లక్ష్మీతంత్రంలో ఈ అర్థం ఆదరింపబడింది.

**(రజతస్రజామ్)**–వెండితో చేయబడ్డ తామర పూలమాలలతో అలంకరింపబడినది. లేక విరాజమానం అయిన మాలెలను కల్గినది అని కూడా చెప్పవచ్చు.

**"రాజతైర్మే స్రజః పద్మైః రాజంతే చ స్రజో – మలాః"** (వెండి తామరపూలతో కూర్చిన మాలెలను నేను అలంకరించుకున్నందున, నా మాలెలు సదా ఏ దోషం లేనివై ప్రకాశిస్తు

న్నందున నేను "రజతస్రజా" అనబడుతున్నాను.) అని లక్ష్మీతంత్రంలో ఈ అర్థం వివరింపబడింది. దీనివల్ల **"దివ్యమాల్యాంబరధరా"** (దివ్యమైన మాలెలను, వసనాలను ధరించినది) అని విష్ణుపురాణంలో పరాశరమహర్షి వచించినట్లు అప్రాకృతాలైన మాలెలను కల్గినది – అనే అర్థం తెలుపబడినట్లయింది.

**(సువర్ణస్రజామ్)–"సువర్ణాన్ సృజతి ఇతి సువర్ణస్రజా"** (ప్రకాశించే వర్ణాలను సృష్టిస్తున్నది. కనుక సువర్ణస్రజా అనబడుతున్నది) అనే అర్థాన్ని చెప్పవచ్చు. **"సృజామి శోభనాన్ వర్ణాన్"** (అందమైన వర్ణాలను సృష్టిస్తున్నాను కనుక సువర్ణస్రజ అనబడుతున్నాను) అని లక్షీతంత్రంలో ఈ అర్థం ఆదరింపడింది. వర్ణాలు అంటే శబ్దాలు అని, బ్రాహ్మణ–క్షత్రియ–వైశ్య–శూద్రులనే నాల్గు వర్ణాలు అని అర్థం. ఈ రెండు అర్థాలు ఇక్కడ సమన్వయిస్తాయి.

**"చతుర్వర్ణాలను సృష్టిస్తున్నాను"**–అనే అర్థాన్ని చెప్పినపుడు **"శాస్త్రదృష్ట్యా తూపదేశతః"** అనే బ్రహ్మసూత్రంలో చెప్పినరీతిలో అంతర్యామియైన పరమాత్మ దృష్టిలో చెప్పినట్లుగా గ్రహించాలి. లేక, "సృష్టించేది" అనే అర్థాన్ని **"అంతర్భావితణిచ్"** గా గ్రహించి "సృష్టింపజేసేది" అనే అర్థాన్ని చెప్పాలి **"చాతుర్వర్ణ్యం మయా సృష్టమ్"** (చతుర్వర్ణాలు నాచే సృష్టింపబడ్డాయి) అని శ్రీ కృష్ణభగవానుడు గీతలో స్పష్టం చేశాడు కదా!

ఈ నామాలకు మంత్రశాస్త్ర ప్రక్రియలో అక్షర సామ్యాలను పురస్కరించుకొని కొన్ని అర్థాలు లక్ష్మీతంత్రంలో వివరింపబడ్డాయి. ఉదాహరణకు–"హిరణ్యవర్ణామ్" అనే నామానికి

***"నిహితా సర్వభూతేషు రణే భృంగవధూరివ।***
***జనయంతీ పరం నాదం తైలధారావదచ్యుతమ్॥"***

(తైలధారవలె నిరంతరం నాదాన్ని ఉద్భవింపచేసే నేను అన్ని భూతాలలోను ఉంటూ ఆడతుమ్మెదవలె నాదాన్ని శబ్దిస్తాను) అనే అర్థం వ్యక్తచేయబడింది. **"హిరణ్యవర్ణా"** అనే నామంలోని **"హి"** అనే అక్షరానికి అన్ని భూతాలలోను నిహితయై, మఱుగుపడి ఉండేది అనే అర్థం చెప్పబడింది. "హి – గతౌ" అని ఇచటి ధాతువు. "రణ–శబ్దే" అనే ధాతువును బట్టి "రణ్" అనే అక్షరానికి "రణే"–ధ్వనిస్తున్నాను అనే అర్థం చెప్పబడింది. ఈ రీతిలోనే "సువర్ణరజత స్రజామ్" అనే నామానికి కూడా అర్థాలు ఇకపై వివరింపబడుతున్నాయి.

**(సువర్ణరజతస్రజామ్)** – సువర్ణంగాను, స్రజగాను ఉండేది అని అర్థం. "సువర్ణా"–"సు" అనే పదం సృష్టిని తెలుపుతుంది. సృష్టికోసం భగవానుని (లేక, లోకాన్ని) వరించేది సువర్ణ. **"సృష్టిం విశ్వం వృణోతి వా"** (సృష్టించడం కోసం విశ్వమనే పేరునుగల భగవానుని (లేక, లోకాన్ని) వరిస్తున్నది. కనుక సువర్ణ) అని లక్ష్మీతంత్రంలో ఈ అర్థం ఆదరింపబడింది. సృష్టికోసం సర్వేశ్వరుని కర్తగాను, లోకాన్ని విషయంగా వరిస్తుందని భావం. స్రజా–సృతాః అజాః యయా సా–జన్మరహితులైన నిత్యముక్తబద్ధచేతనులు ఎవరిచే వ్యాపింపబడి ప్రకాశిస్తున్నారో ఆమె స్రజ అనబడుతున్నది – అనే రీతిలో త్రివిధచేతనులలో వ్యాపించి,



ప్రకాశించేది–అని భావం. "సృ–గతౌ" అని ఇచటి ధాతువు.

**"సృతాశ్చాపి మయాజస్రం బద్ధముక్తాదయో హ్యజాః"** (అజులు– అంటే జన్మలేనివారైన బద్ధముక్తాదులు నాచే ఎల్లప్పుడు వ్యాపింపబడి వెలుగుతున్నారు కనుక నేను స్రజ అనబడుతున్నాను) అని ఈ అర్థం లక్ష్మీతంత్రంలో తెలుపబడింది. ఇచట చెప్పబడే వ్యాప్తి గుణంతో, దివ్యమంగళవిగ్రహంతో అని చెప్పడం సర్వాచార్యాభిమతం అవుతుంది. "స్వరూపంతోను సకల జీవులను వ్యాపించి ఉండడం ఇచట వివక్షితం"–అని అంటే, ఈ విషయంలో విచారించ దగిన అంశాలు కొన్ని ఉన్నాయి.

**"యథా సర్వగతో విష్ణుః తథైవేయం ద్విజోత్తమ!"** (ఓ బ్రాహ్మణోత్తమా! సర్వవ్యాపి అయిన విష్ణువు ఎటువంటివాడో ఈమె కూడా అటువంటిదే) అని, **"త్వయా చ విష్ణునా చాంబ జగద్వ్యాప్తం చరాచరమ్"**. (తల్లీ! మీ చేత, భగవానునిచేత చరాచరాత్మకం అయిన ఈ జగత్తు అంతా వ్యాపింపబడింది) అని, **"సర్వభూతస్థితా"** (అన్నిజీవులలో అంతర్హితంగా ఉన్నది) అని శాస్త్రాలలో మిగిలిన జీవులకంటే విలక్షణం అయిన వ్యాప్తి ఈ లక్ష్మికి ఉన్నదని చెప్పబడడం సుస్పష్టం. అయితే, ఈ వ్యాప్తి ఎటువంటిది? అనే అంశాన్ని విచారిస్తే, ఆచార్యుల మధ్య చాలా అభిప్రాయభేదాలున్నాయి. పైన ఉదాహరించిన విష్ణుపురాణ శ్లోకానికి ముందు వెనుకలలో ఉండే ప్రకరణాన్నిబట్టి ఈ వచనాలు విగ్రహవ్యాప్తినే తెలుపుతున్నవి. అనేది తెలుస్తుంది–అని ఆచార్యులు పలువురి హృదయం.

***క్షీరోదాబ్ధౌ సముత్పన్నా శ్రూయత్వే - మృతమంథనే।***
***భృగోః ఖ్యాత్యాం సముత్పన్నేత్యేతదాహ కథం భవాన్॥***

(క్షీరాబ్ధిలో అమృతం కోసం మథనం చేసేటపుడు శ్రీదేవి ఉద్భవించిందని చెప్పబడుతున్నది. భృగుమహర్షికి ఖ్యాతి అనే పత్నివల్ల పుట్టిందని మీరు అంటున్నారేమి?) అనే ప్రశ్న రాగా–

***నిత్యైవైషా జగన్మాతా విష్ణోః శ్రీరనపాయినీ।***
***యథా సర్వగతో విష్ణుః తథైవేయం ద్విజోత్తమ॥***

(విష్ణువునకు సంపద్రూపిణిగా ఉన్నది, అతనిని ఎడబాయనిది అయిన ఈ లక్ష్మి నిత్యమైనదే. విష్ణువు ఏవిధంగా అన్ని యోనులలో అవతరిస్తున్నాడో ఆ విధంగా ఈమె కూడా) అనే సమాధానం చెప్పబడడంచేత అవతారరూపం అయిన వ్యాప్తి మాత్రమే ఇక్కడ చెప్పడం యుక్తం తప్ప, స్వరూపవ్యాప్తిని చెప్పడం యుక్తం కాదు. **"రాఘవత్వేఽభవత్సీతా"** అని ప్రారంభించి తరువాత చేయబడిన వివరణం కూడా దీనినే బలపరుస్తున్నది – అనేది వారి అభిప్రాయం. ఆ విధంగాకాక, ఈ వచనాలు స్వరూప వ్యాప్తినే చెబుతున్నవి అని అనుకున్నా. ప్రమాణ పురస్సరంగా విచారించినపుడు **"ఈశతే దేవ ఏకః", "ఏకః శాస్తా", "ఏవః స్వతంత్రః", "సదేవ", "పరమేవ"** అని చెప్పబడిన రీతిలో ఈశ్వరుడు ఒక్కడే కనుక, **"విభుత్వే సతి చేతనత్వమ్"** (సర్వవ్యాపియై ఉంటూ చేతనుడై ఉండడం) అన్నది

నేను యోగుల హృదయంలో చంద్రునివలె ఉదయిస్తాను. వారి నాల్గవదశ అయిన ధ్యానదశను చంద్రునివలె ప్రకాశింపజేస్తాను. యోగానికి అంతరాయం కల్గిన మహర్షి వశిష్ఠుడు చంద్రమయిగాను, పరిశుద్ధగాను, జ్ఞానానందసముద్రంగాను ఉండే నన్ను శరీరంలో ఉండే సుషుమ్నానాడిలో ఉన్నదానినిగాను ధ్యానించి తిరిగి యోగాన్ని సాధించారు. ఆఱు అక్షరాలను కల – **"ఓమ్ చంద్రాయై నమః"** అనే ఈ మంత్రం శీఘ్రంగా ఆనందాన్ని కల్గిస్తుంది. సంసారమనే దావాగ్నిచే తపింపబడినవారికి ఇది ఆనందాన్ని ఇస్తుంది) అని ఈ నామంయొక్క అర్థం, మంత్రంయొక్క అర్థం లక్ష్మీతంత్రంలో వివరింపబడ్డాయి.

**(హిరణ్మయీమ్)–"హిరణ్మయే పరే లోకే విరజం బ్రహ్మ నిష్కలమ్"** (ముండక–2–2–10) (బంగారుమయం అయిన గొప్పలోకంలో, మలినం లేనిది, అవయవరహితమైనది అయిన పరబ్రహ్మం ఉన్నది) అనే రీతితిలో హిరణ్మయమని కీర్తింపబడే సువర్ణమయలోకంలో వేంచేసి ఉంటుంది కనుక **"హిరణ్మయీ"** అనబడుతున్నది.

**వైకుంఠే తు పరే లోకే శ్రియా సార్ధం జగత్పతిః।**
**ఆస్తే విష్ణురచింత్యాత్మా భక్తైర్భాగవతైస్సహ॥**

(వైకుంఠం అనే గొప్పలోకంలో జగత్తుకు స్వామి, భావించడానికి సాధ్యం కానివాడు అయిన విష్ణువు శ్రీదేవితోపాటు భక్తులు, భాగవతులతో కూడినవాడై వేంచేసి ఉంటాడు) అని పురాణాలలో ఈ అర్థం ఆదరింపబడింది.

*"కుళక్కోవలర్ మడప్పావైయుమ్ మణ్మకళుమ్ తిరువుమ్ నిళల్ పోల్వనర్ కణ్డు నిఱ్కుఙ్గోల్ మీళుఙ్గోల్–తణ్ణన్తుళాయ్ అళల్పోలవుమ్ శక్కరత్తణ్ణల్ విణ్ణోర్తొళక్కడవుమ్"* (పిల్లన గ్రోవిని చిహ్నంగాకల గోపాలకుల వంశలో జన్మించిన నీళాదేవి, భూదేవి, శ్రీదేవి ఛాయవలె అనువర్తించడాన్ని చూచి చల్లనిది, అందమైనది అయిన తులసిని కలవాడు, అగ్నివలె విరోధులను భస్మంచేసే సుదర్శనచక్రాన్ని కల స్వామి అయిన సర్వేశ్వరుని బ్రహ్మరుద్రాదులు తమకు అనురూపంగా శేషవృత్తిని చేస్తూ ఉండగా) అని, *"తేవిమారావార్ తిరుమకళ్ పూమి యేవ మత్తమరర్ ఆట్చెయ్‌వార్"* (దివ్యదేవేరులైన లక్ష్మీదేవి, భూదేవి ప్రేరేపించగా మిగిలిన నిత్యసూరులు కైంకర్యం చేస్తారు) అని, *"తిరుమాల్ వైకున్దమ్"* (శ్రియః పతి యొక్క వైకుంఠం) అని ద్రావిడవేదంలోను, ***"హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ అహో రాత్రే పార్శ్వే"*** (శ్రీదేవి, భూదేవి నీకు పత్నులు. రాత్రి పగలు నీ పార్శ్వంలో ఉంటారు) అని సంస్కృతవేదంలోను అర్థం అనుసంధింపబడింది.

**(హిరణ్మయీమ్)** – హితంగాను, రమణీయంగాను ఉంటుంది. (హితంగా, ప్రియంగా ఉంటుంది) కనుక వేదం హిరణ్మయమనబడుతున్నది. ఆ వేదస్వరూపంగా ఉపనిషత్తులలో కీర్తింపబడే సూర్యమండలం "హిరణ్మయమ్" అనదగినది. వేదస్వరూపిణి కనుక హిరణ్మయ మనబడే సూర్యమండలంలో వేంచేసి ఉంటుంది కనుక లక్ష్మి ''హిరణ్మయీ''



సోమాశియాణ్డాన్ అనే వేఱొక ఆచార్యులు, శ్రీ వేదాంతదేశికులు మొదలైన కొందఱు ఆచార్యులు ఈ ప్రమాణాలు లక్ష్మి అంతటా స్వరూపంతోనే అన్ని లోకాలలో వ్యాపించి ఉంటుందని చెబుతున్నవని భావించారు. వీరి అభిప్రాయానుసారం లక్ష్మి కూడా ఈశ్వరకోటి లోనికే చేరుతుంది. అయితే, ఇద్దఱు ఈశ్వరులు అనే దోషం వస్తుందే! అని అంటే, పిరాట్టికి ఈశ్వరత్వం ఉన్నా, ఆమెకు సర్వేశ్వరత్వం అనే పరబ్రహ్మత్వం లేదు. ఆమెకు కూడా నారాయణుడు సహజంగానే ఈశ్వరుడైనందువల్ల, ఆమె అతనికి పత్నియై సహజం గానే శేషభూతగా ఉన్నందువల్ల, నారాయణునకు ఉండే స్వాభావికానవధికాతిశయేశితృత్వం అనే పరబ్రహ్మత్వం ఆమెకు లేదు. **"విభుత్వే సతి చేతనత్వమ్"** అనే పరబ్రహ్మ లక్షణం ఈమెకు వర్తించదా? అని అంటే, ఈమెకు ఉండే సర్వవ్యాపకత్వం ఫలపర్యంతంకానిది కనుక పై దోషం రాదు. **"అంతః ప్రవిష్టః శాస్తా జనానాం సర్వాత్మా"** (సర్వాంతర్యామి అయిన పరబ్రహ్మ జనులలోపల ప్రవేశించి వారిని నియమిస్తున్నాడు) అనేటట్లు పుణ్యపాపకర్మాను గుణంగా నియమించడం వ్యాప్తికి ఫలం. ఇది దండధరుడైన సర్వేశ్వరునకు మాత్రమే తగును తప్ప, అజ్ఞాతనిగ్రహ అయిన ఈమెకు తగదు. **"విభుత్వే సతి చేతనత్వమ్"** అన్నది పరబ్రహ్మలక్షణం అయితే విభుత్వం కర్మానుగుణనియమనం అనే ఫలంతో కూడిన సర్వవ్యాపిత్వాన్ని చెబుతున్నది కనుక, అటువంటి విభుత్వం లేని ఈమె విషయంలో అతివ్యాప్తి రాదు. **"విభుత్వే సతి చేతనత్వమ్"** అన్నది ఈశ్వర సామాన్యానికి లక్షణం అయినపుడు సర్వవ్యాపిత్వాన్ని మాత్రం చెప్పడంవల్ల ఈశ్వరకోటిఘటిత అయిన ఈమెకు కూడా అది లక్షణం అవుతుంది. జగత్తుకు ఇద్దరు ఈశ్వరులు. అయితే, సర్వేశ్వరుడైన పరబ్రహ్మ శ్రీమన్నారాయణుడు ఒక్కడే – అని ఈ ఆచార్యుల అభిప్రాయం. ఈ విధంగా లక్ష్మీదేవి జీవకోటిలోనికి చేరినదా? ఈశ్వరకోటిలోనికి చేరినదా? అనే అంశంలో అభిప్రాయభేదం ఆచార్యుల మధ్య ఉన్నా శ్రీమన్నారాయణుడు ఒక్కడే పరబ్రహ్మం అనే విషయాన్ని మాత్రం అందఱూ ముక్తకంఠంగా అంగీకరించారు. ఈ విషయంలో ఏ వివాదం లేదు. శ్రీ, నారాయణులు ఇద్దఱూ పరబ్రహ్మభూతులు – అనే మాట సర్వాచార్య గోష్ఠీ బహిష్కృమే.

ఈ విధంగా ఇంతవరకు లక్ష్మీదేవికి చెప్పబడే స్వరూపవ్యాప్తి అఘటిత ఘటనాశక్తిచే సిద్ధిస్తుంది అన్నది పలువురు ఆచార్యుల అభిమతం అని, ఈమెకు స్వాభావికం అయిన స్వరూపవ్యాప్తిని అంగీకరించే ఆచార్యులుకూడా ఈమెకు ఈశ్వరత్వాన్ని ఆదరించారే తప్ప పరబ్రహ్మత్వాన్ని అంగీకరించలేదని తెలుపబడింది. జగత్కారణత్వం, శేషిత్వం, ప్రాప్యత్వం, ముక్తిఫలప్రదత్వం, సర్వవ్యాపకత్వం – మొదలైన వానిలో అప్రధానం అయిన అన్వయం ఈమెకు ఉన్నది కనుక ఈమెను కూడా ఈశ్వరకోటిలోనికే చేర్చవచ్చునని శ్రీదేశికులు మొదలైన వారి అభిప్రాయం. అయితే, వారు లక్ష్మీదేవిని పరబ్రహ్మభూతగా భావించలేదు. ఆ విధంగా ఎక్కడా తమ వచనాల్లో వ్యక్తం చేయలేదు. జీవసమూహం నిత్య–ముక్త–బద్ధులనే

మూడువిధాలుగా ఉన్నట్లు, అచేతనతత్త్వం శుద్ధసత్త్వం–మిశ్రసత్త్వం– కాలం అని మూడు విధాలుగా ఉన్నట్లు, ఈశ్వరతత్త్వం భగవానుడు–లక్ష్మి అని రెండు విధాలని వీరి అభిప్రాయం. విష్ణుచిత్తులు, శ్రీ కృష్ణసూరి మొదలైనవారు మాత్రం–ఈశ్వరు డొక్కడే అని శాస్త్రాలు ఘోషిస్తున్నందున, లక్ష్మికి ఈశ్వరత్వం ఉన్నదని అంగీకరించినా, అది భగవత్సంకల్పాధీనమై ఉండవలసి ఉన్నది కనుక, అది సోపాధికమే కావలసి ఉన్నది కనుక, లక్ష్మిని జీవకోటిలోనికి చేర్చడమే ఆమెకు తగినది. అదే ఆమెకు అతిశయాన్ని కల్గించేది–అని భావించారు. ఈశ్వరత్వం ద్వినిష్ఠం, పరబ్రహ్మత్వం మాత్రం ఏకనిష్ఠం–అని దేశికుల మతం. ఈశ్వరత్వం కూడా ఏకనిష్ఠమే–అని శ్రీకృష్ణసూరి మొదలైనవారి మతం. **"జ్ఞానానందాత్, అత్యంతసామ్యాత్ జగజ్జనకత్వశేషిత్వ శరణ్యత్వాది సామ్యాచ్చ సామ్యగిరాం నిర్వాహో వ్యక్తః"** (జ్ఞానం, ఆనందం, మొదలైన వానిలో మిక్కిలి సామ్యం ఉన్నది కనుక, జగత్తుకు కారణం కావడం, శేషిత్వం, శరణ్యత్వం, విభుత్వం – మొదలైన వానిలో సామ్యం ఉన్నది కనుక భగవానునకు, లక్ష్మికి సామ్యాన్ని తెలిపే వచనాలు పొసగుతున్నాయి అన్నది వ్యక్తం అవుతున్నది) అని అంటూ శ్రీదేశికులు **న్యాయసిద్ధాంజనం** అనే గ్రంథంలో పల్కిన సూక్తిని అనుసంధించేవారికి దేశికుల అభిప్రాయం వ్యక్తం అవుతుంది. జ్ఞానానందాదులలో అత్యంత సామ్యం అన్నవారు మిగిలిన దానిలో సామ్యం అని పల్కిన విషయాన్ని నిశితంగా పరిశీలించాలి. ఈ రీతిలో ఇంతవరకు లక్ష్మికి స్వాభావికం అయిన విభుత్వాన్ని అంగీకరించే పక్షంతోపాటు,దానిని అంగీకరించని పక్షంతోపాటు భేదం లేకుండా అంతటా ఆమెకు పరబ్రహ్మత్వం అనే దోషం లేదు అని నిర్ణయించబడింది.

**సువర్ణస్రజమిత్యేవం గుహ్యకానామధీశ్వరః।**
**మేరౌ శిరముపస్థాయ ధనేశత్వమవాప్తవాన్॥**

(యక్షేశ్వరుడైన కుబేరుడు మేరుపర్వతంలో ఉండి చిరకాలం నన్ను ధ్యానించి, ధనాధిపత్యాన్ని పొందాడు) అని లక్ష్మీతంత్రంలో ఈ నామమహిమ **"సువర్ణస్రజమ్"** అని కీర్తింపబడింది.

**(రజతస్రజామ్)–"రాజసాః ఏవ రజతాః"** – అని రజోగుణ ప్రాచుర్యాన్ని కలవారిని తెలిపేదిగా ఈ పదాన్ని గ్రహించి, **"రజతాః స్రజాః యయా సా"** అని రజోగుణప్రచురులైన బ్రహ్మాదులను జగత్సృష్టిని చేసేటట్లు చేస్తుంది – అనే అర్థాన్ని ఈ నామానికి చెప్పవచ్చు. ఈ లక్ష్మీదేవిచే ప్రేరితుడై కదా! భగవానుడు బ్రహ్మాదులను సృష్టిస్తాడు.

**"బ్రహ్మోత్పన్నః స తేనోక్తః ప్రజాః సృజ మహామతే"** అని, "నాట్టై ప్పడై యెన్ఱు అయన్ ముదలాత్తన్ద వీట్టైప్పణ్ణి విళైయాడుమ్" (లోకాలను సృష్టించు అని బ్రహ్మ మొదలైన వారిని సృష్టించి క్రీడిస్తాడు) – అని చెప్పేరీతిలో భగవానునిచే ప్రేరితులై బ్రహ్మాదులు సృష్టిని చేస్తారు. అందువల్ల ఈ లక్ష్మిచేత ప్రేరితులై బ్రహ్మాదులు సృష్టిస్తున్నారు–అని చెప్పడంలో కొఱతలేదు కదా!



**"రాజసాశ్చ ప్రజః సర్వే ప్రష్టారో జగతాం మయా"** (రజోగుణం నిండిన అందఱు నాచే ప్రేరేపించబడినవారై సృష్టిస్తున్నారు కనుక నేను రజత స్రజ అనబడుతున్నాను) అని ఈ అర్థం లక్ష్మీతంత్రంలో ఆదరించబడింది.

**రజతస్రజమిత్యేవ రుద్రాణాం ప్రవరః పురా।**
**కైలాసే సముపస్థాయ రజతాధిపతాం యయౌ॥**
**అష్టాక్షరావిమౌ యంత్రౌ సతారనమసా యుతౌ।**
**జపార్చనహుతధ్యానాదభీష్టం సాధయిష్యతః॥**

(**"రజతస్రజమ్"** అనే ఈ మంత్రంతో ఏకాదశరుద్రులకు నాయకుడైన శివుడు తన నివాసస్థానం అయిన కైలాసంలో నన్ను ధ్యానించి రజతానికి అధిపతి అయినాడు. ఓంకార – నమశ్శబ్దాలతో కలసి ఎనిమిది అక్షరాలు కల్గిన **"ఓమ్ సువర్ణస్రజే నమః", "ఓమ్ రజతస్రజే నమః"**– అనే ఈ రెండు మంత్రాలు జపంతో, అర్చనతో, హోమంతో, ధ్యానంతో ఆరాధిస్తే కోరిన ఫలాలను సాధించి ఇస్తాయి) అని ఈ నామాల మంత్రవైభవం కూడా లక్ష్మీతంత్రంలో చెప్పబడింది.

**(చంద్రామ్) – "చంక్రమ్యమాణా (దుష్కృతం) ద్రావయతి ఇతి చంద్రా"** – (సంచరిస్తూ ఉండి పాపాన్ని ద్రవింపజేస్తుంది కనుక **"చంద్రా"** అనబడుతున్నది) అని దీని శబ్దార్థం. విహార రసిక అయిన రాజహంసవలె హృదయకమలంలో హంస శబ్దవాచ్యుడైన సర్వేశ్వరునితో కలసి సంచరించేదై, పురుషకారకృత్యంలో చేతనుని పాపాలను పోగొడుతుంది–అని భావం. **"హరిణీ"** అనే నామం పరదశలో పాపహరణాన్ని, ఇది అంతర్యామ్యవస్థలో పాపహరణాన్ని చెబుతున్నది కనుక పునరుక్తి దోషం లేదు. **"చంక్రమ్యమాణా భక్తానాం ద్రావయామి చ దుష్కృతమ్"** (సంచరిస్తూ ఉన్నదాననై భక్తుల పాపాలను పోగొడతాను) అని లక్ష్మీతంత్రంలో ఈ అర్థం చెప్పబడింది.

**(చంద్రామ్)** – చంద్రునితో పోలినది – అని కూడా భావం.

**చంద్రవత్ సతతం చిత్తం భక్తానాం ద్రావయామి చ।**
**ఉదేమి యోగినామంతరానందస్పందలక్షణా॥**
**చతుర్థీం తు దశాం తేషాం చంద్రవత్ భావయామి చ।**
**యోగాంతరాయనిహతో వశిష్ఠః పరమో మునిః॥**
**అంతశ్చంద్రమయీం శుద్ధాం చిదానందమహోదధిమ్।**
**నాడీస్థా మామనుస్మృత్య పునస్తం యోగమాప్తవాన్॥**
**ఆనందజనకస్సత్యో మంత్రో – యం మే షడక్షరః।**
**భవదావాగ్నిదగ్ధానాం నిర్వృతిం ప్రకరోత్యయమ్॥**

(చంద్రునివలె భక్తుల మనస్సులను ద్రవీకరింపచేస్తాను. ఆనంద ప్రవాహమే మూర్తీభవించిన

– అనే) అని గోదాదేవి పల్కిన రీతిలో దివ్యదేవేరులు అందఱు అచ్యుతునకు సహజంగానే పరతంత్రలు. దాసభూతలు. ఇటువంటి దాస్యాన్ని చేయడం అరుదైన ఫలంగా భావించేవారు.

**"మాం నయేద్యది కాకుత్స్థః తత్తస్య సదృశం భవేత్"** (నన్ను శ్రీరాముడు కాపాడి తీసికొని పోయినట్లయితే, అది అతనికి తగినది అవుతుంది) అని పల్కిన సీతాదేవి ఈ విధంగా భగవత్పరతంత్ర అనడంలో సందేహం ఏమున్నది? ఈ భగవత్పారతంత్ర్యమే లక్ష్మీదేవికి గొప్పసంపద. దానిని లేదనే వారు ఆమె స్వరూపాన్ని కాదనేవారే కదా! పూర్వాచార్యులెవ్వరూ లక్ష్మీపారతంత్ర్యం సోపాధికం అని చెప్పలేదు. లక్ష్మీదేవికి ఈశ్వరత్వం ఉన్నదని, పరబ్రహ్మత్వం కూడా ఉన్నదని పలికేవారు పలువురుసైతం లక్ష్మీదేవి భగవత్పారతంత్ర్యం స్వతస్సిద్ధమనే అన్నారు. ఇక్కడ ఇంకో విషయం కూడా గమనార్హం. లక్ష్మికి స్వాభావికం అయిన పారతంత్ర్యం ఉన్నదని అంగీకరించినపుడు, ఆమెకు పరబ్రహ్మత్వం, పారతంత్ర్యం రెండూ చీకటి – వెలుతురులవలె ఒకేచోట ఒకే సమయంలో ఉండడానికి వీలుకాని విరుద్ధధర్మాలు. లక్ష్మికి స్వామి నారాయణడు అని అంగీకరించిన తరువాత లక్ష్మి కూడా పరబ్రహ్మ భూతయే అని చెప్పడం పూర్వాపరవిరుద్ధమే అవుతుంది. స్వరూపంతోను, గుణాలతోను తనకు మించినది ఏదీ లేదనేటట్లు ఉండే వస్తువే పరబ్రహ్మం కాగలదు. నారాయణుడు లక్ష్మికి కూడా స్వామి అని అంగీకరించిన తరువాత లక్ష్మికూడా పరబ్రహ్మభూతయే అని అనడానికి ఏమాత్రం వీలులేదు. భగవద్రామానుజులుకూడా **"బ్రహ్మశబ్దేన చ స్వభావతో నిరస్తనిఖిలదోషః, అనవధికాతిశయాసంఖ్యేయకల్యాణ గుణాకరః । పురుషోత్తమో – భిధీయతే। సర్వత్ర బృహత్వగుణయోగేన హి బ్రహ్మశబ్దః। బృహత్వం చ స్వరూపేణ గుణైశ్చ యత్రానవధికాతిశయం సో – స్య ముఖ్యో – ర్థః। స చ సర్వేశ్వర ఏవ। అతో బ్రహ్మశబ్దస్స తత్రైవ ముఖ్యవృత్తః।"** (సహజంగానే ఏ దోషాలు లేనివాడు, అంతులేని అతిశయాన్నికల, లెక్కలేనన్ని కల్యాణగుణాలను కల్గినవాడు అయిన పురుషోత్తముడు పరబ్రహ్మశబ్దంచేత చెప్పబడుతున్నాడు. అన్ని చోట్ల బృహత్వగుణం కల్గి ఉన్నందువల్లనే కదా బ్రహ్మశబ్దం ప్రయోగింపబడుతున్నది. స్వరూపంతోను, గుణాలవల్ల ఎవని అతిశయం సాటిలేనిదిగా, మించినది లేనిదిగా ఉన్నదో అతడే బ్రహ్మశబ్దానికి ముఖ్యార్థ భూతుడు. అతడు సర్వేశ్వరుడొక్కడే.) అని అన్నారు.

**"స్వాభావికానవధికాతిశయేశితృత్వం**
**నారాయణ! త్వయి న మృష్యతి వైదికః కః?"**

(నారాయణా! సహజమైనది, అందులేని అతిశయాన్ని కల్గినది అయిన పరబ్రహ్మత్వాన్ని నీ పట్ల వైదికుడైనవాడెవడు అంగీకరించడు?) అని అనిన శ్రీ యామునాచార్యులువారు

**"కః శ్రీః శ్రియః పరమసత్త్వసమాశ్రయః కః**
**కః పుండరీకనయనః పురుషోత్తమః కః"**



అనబడుతున్నది– అని కూడా చెప్పవచ్చు. సవితృమండలమధ్యవర్తి అయిన భగవానుడు ఆ చోట కూడా లక్ష్మిని విడువకుండా ఆమెతో కలిసే – అనగా శ్రీధరుడుగానే వేంచేసి ఉంటాడు అనే అర్థాన్ని శఠకోపసూరి – **"శెయ్యదోర్ ఞాయిత్తైక్కాట్టి చ్చిరీదరన్ మూర్తి ఈదెన్నుమ్"** (ఎఱ్ఱని సూర్యమండలాన్ని చూపించి ఇది శ్రీధరునిమూర్తి అని అంటుంది) అని తెలిపారు. హిరణ్మయలోకం అయిన పరమపదంలో,సూర్యమండలంలో ఉండటంవల్ల లక్ష్మి హిరణ్మయి అని అనబడుతున్నది – అనే ఈ అర్థం.

**ప్రకృతేశ్చ పరే వ్యోమ్ని మండలే చ త్రయీమయే।**
**హిరణ్మయ్యే – వతిష్ఠే – హం హితాయ జగతాం సదా॥**

(ప్రకృతి మండలానికి ఆవలివైపున ఉన్నది, సువర్ణమయమైనది అయిన పరమపదంలోను, హిరణ్మయమైనది, వేదమయం అయినది అయిన సూర్యమండలంలోను నేను లోకాలు అన్నిటియొక్క హితం కోసం ఉంటాను. కనుక హిరణ్మయి అనబడుతున్నాను) అని లక్ష్మీతంత్రంలో వివరింపబడింది.

**(హిరణ్మయీమ్)** – బంగారంవలె హితంగా, రమణీయంగా ఉండేది–అని కూడా చెప్పవచ్చు. అనగా ప్రాప్యంగా – ప్రాపకంగా ఉంటుంది అని భావం. జీవుడు పరమపదం లోకిపోయి సేవచేయడం ఒక మిథునానికే (లక్ష్మీనారాయణులకే) కనుక, పురుషకార స్వరూపిణి అయిన ఈమె లేకపోతే ఫలసిద్ధిలేదు కనుక, ఈమెను ఉపాయోపేయభూత– అని అనడంలో విప్రతిపత్తిలేదు.

**(హిరణ్మయీమ్)** – బంగారుమయం అయిన దివ్యమంగళవిగ్రహన్ని కల్గినది–అని కూడా అర్థం. "ఞాలప్పొన్ మాదిన్ మణాళన్" (హిరణ్యవర్ణ అయిన లక్ష్మికి నాథుడు) అని శఠకోపసూరి ఈ అర్థాన్ని తిరువిరుత్తమనే ప్రబంధంలో (10) పలికారు.

**(హిరణ్మయీమ్) – ఆధారాబ్జాత్ ద్విషట్కాంతం సూత్రభాసా హిరణ్మయీ।**
**ఉదేమి సతతం ప్రోక్తా శబ్దసంకల్పకోరకైః॥**

(నడుము మూలభాగంలో ఉండే మూలాధార పద్మంనుండి బ్రహ్మరంధ్రానికి పన్నెండు అంగుళాల ఆవల ఉండే ద్వాదశాంతస్థానం వరకు బంగారు నూలువలె ప్రకాశించేదాననై, శబ్దసంకల్పాలను మొగ్గలుగా కలదాననై, ఎల్లప్పుడు యోగుల హృదయంలో ఉదయిస్తాను) అని లక్ష్మీతంత్రంలో చెప్పబడినట్లే యోగుల శరీరంలో ఉండే సుషుమ్నానాడిలో సంకల్పం అనే మొగ్గలను కల, సువర్ణమయం అయిన అద్వితీయమైన లతవలె దర్శనాన్ని ఇస్తుంది – అనే అర్థాన్ని గ్రహించవచ్చు.

**(హిరణ్మయీమ్) – "హిరణ్మయః పురుషః"** అని వేదాలచేత కీర్తింపబడే పరమ పురుషుని పత్ని – అని కూడా అర్థం.

**(హిరణ్మయీమ్)** – భగవానుడు హిరణ్మయుడైనట్లే, అతనికి అనురూప అయిన

లక్ష్మికూడా హిరణ్మయిగా ఉంటుంది–అని భావం. **“తుల్యశీలవయోవృత్తాం తుల్యాభిజన లక్షణామ్”** (తగిన శీలాన్ని, వయస్సును, నడవడికను, తగిన అభిజాత్యాన్ని, లక్షణాలను కల్గిన సీతను) అని, “తద్ధర్మధర్మిణీ” (భగవానుని ధర్మాలతో పోలిన ధర్మాలను కల్గినది) అని, “ఉనక్కేఱ్కుమ్ కోలమలర్ ప్పావై” (నీకు సాటివచ్చే అందమైన లక్ష్మీదేవి) అని ఈ అర్థం చెప్పబడింది.

**(హిరణ్మయీమ్)** – బంగారు మొదలైన సమస్తసంపదలను కల్గినది – అని కూడా చెప్పవచ్చు. “వామహస్తవసుప్రదామ్” అని లక్ష్మీధ్యానంలో చెప్పబడింది.

**వసుధారాముదారాం చ హరిణీం వసువర్షిణీమ్।**
**ధనధాన్యకరీం సిద్ధిం వసుధాం వసుధారిణీమ్।**
**నిధిద్వయేనాపి ధనం ప్రాపయంతీం మనోరథాన్॥**

(సంపదయొక్క ధారగా ఉన్నది, ఔదార్యాన్ని నిండుగా కల్గినది, హరిణి, ధనాన్ని వర్షించేది, ధనధాన్యాలను ఇచ్చేది, సిద్ధిని కల్గించేది, సంపదను తనలో కల్గినది, సంపదను ధరించేది, శంఖపద్మాది నిధులతో ధనాన్ని, మనోరథాలను పొందించేది అయిన శ్రీదేవిని) అని,

**శంఖపద్మనిధీ లక్ష్మ్యాః పాదయోరగ్రతః స్థితా।**
**పశ్యంతౌ ముఖమన్యోన్యం వమంతౌ విపులం ధనమ్॥**

(శంఖనిధి, పద్మనిధి ఒకదానిని వేరొకటి చూస్తూ, విపులమైన ధనాన్ని వెలువరిస్తూ శ్రీదేవి పాదాలచివర ఉన్నాయి) అని శాస్త్రాలలో ఘోషింపబడుతున్నది కదా!

**తాం మాం హిరణ్మయీత్యేవం మునయో వేదపారగాః।**
**స్తుత్వా సమాప్నువన్ కామం యోగినో యోగముత్తమమ్।**
**సప్తాక్షరో హ్యయం మంత్రస్సర్వకామార్థసాధకః॥**

(అటువంటి నన్ను వేదపారగులైన ఋషులు ఈ విధంగానే **“హిరణ్మయీ”** అని స్తుతించి వారు కోరిన దానిని పొందారు. గొప్ప యోగాన్ని యోగులు పొందారు. **“ఓమ్ హిరణ్మయ్యై నమః”** అని ఏడు అక్షరాలను కల ఈ మంత్రం అన్ని వస్తువులను కోరికలను ప్రదానం చేస్తుంది) అని లక్ష్మీతంత్రంలో ఈ నామానికి సంబంధించిన మంత్రంయొక్క వైభవం ప్రకటింపబడింది.

**(లక్ష్మీమ్)** – **“లక్షయతీతి లక్ష్మీః”** – (సకలచేతనుల మంచిచెడ్డలనుగూర్చి చింతిస్తున్నది కనుక లక్ష్మి అనబడుతున్నది) అనే వ్యుత్పత్తిని బట్టి సర్వభూతసాక్షిణిగా ఉంటూ అందఱి మంచిచెడ్డలను గూర్చి విచారించి, తగిన వానిని చేస్తుంది అనే భావాన్ని ఈ లక్ష్మీనామం తెలుపుతుంది. **“లక్ష–దర్శనే”** అన్నది ఇచటి ధాతువు. ఈ అర్థం. **సాక్షిణీ సర్వభూతానాం లక్షయామి శుభాశుభమ్ –** (జీవుల నందఱినీ సాక్షాత్తు చూచేది, వారిమంచి చెడ్డలను గూర్చి చింతించేది) అని లక్ష్మీతంత్రంలో తెలుపబడింది. ఈ లక్ష్మి చేతనులు



చేసే మంచి చెడ్డలను చూడడం సర్వేశ్వరునివలె వాటికి తగిన ఫలాన్ని ఇవ్వడం కోసం కాదు. మఱి ఎందుకోసం? అని అంటే, **“న కశ్చిత్ నాపరాధ్యతి”** (తప్పుచేయనివాడెవడూ లేడు) అని, **“కిమేతత్? నిర్దోషః క ఇహ జగతి”** (ఇదిఏమి? ఈ లోకంలో దోషం లేనివాడెవడు?) అని తగిన మాటలను పల్కి జీవుల దోషాలను మఱుగుపరచడం కోసమే ఈమె జీవులు చేసే చెడ్డ కార్యాలను గమనించడం. అతడు చేసే ఒక మంచి పనిని పదింతలుగా, నూఱు రెట్లుగా పెంచి పెద్దచేసి చూపి, చేతనుని భగవానుని పాదాల దగ్గరకు చేర్చడం కోసమే వాటిని చూడడం. ఈ విధంగా ఈమె దర్శనం (సాక్షిణీత్వం) అతని దర్శనం కంటే విలక్షణమైనదిగా, సుఖాన్ని మాత్రమే ఇచ్చేదిగా ఉంటుంది కనుక **“లక్ష్మీః”** (చూచేది) అనే నామాన్ని పొందింది.

**(లక్ష్మీమ్)** – చూడబడేది–అని అర్థం. (దర్శింపబడేది) అనుగ్రహ–నిగ్రహాలు రెండిటికి సాధారణం అయిన భగవానుని దర్శనం కూడా ఒక దర్శనమా! అనుగ్రహానికి మాత్రమే కారణం అయిన ఈమె దర్శనం కదా నిజమైన దర్శనం. ఈమె కదా దర్శింప తగినది.

**(లక్ష్మీమ్)** – విష్ణువుకు సంపదగా ఉన్నది – అని కూడా అర్థాన్ని చెప్పవచ్చు. **“లక్ష్మీశ్చాస్మి హరేర్నిత్యమ్”** (ఎల్లప్పుడు హరికి సంపదగా ఉంటాను) అని ఈ అర్థాన్ని లక్ష్మీదేవి స్వయంగా లక్ష్మీతంత్రంలో చెప్పింది. **“నిత్యైవైషా జగన్మాతా విష్ణోః శ్రీరనపాయినీ”** (విష్ణువును ఎడబాయకుండా ఉన్నది, సంపదగా ఉన్నది, లోకానికి తల్లి అయిన ఈమె నిత్యయే) అని విష్ణుపురాణంలో పరాశర మహర్షి, **“ఉన్‌తామరైమఙ్గైయుమ్ నీయుమ్”** (నీ కమలవాసిని అయిన లక్ష్మి, నీవు) అని దివ్యసూరులు, **“స్వతః శ్రీః త్వం విష్ణోః త్వమసి”** (శ్రీదేవి! నీవు సహజంగానే విష్ణువునకు సంపదగా ఉన్నావు) అని పరాశరభట్టర్ ఈ అర్థాన్ని అనుసంధించారు.

ఇందువల్ల ఈ లక్ష్మీదేవి భగవానునకు సహజంగానే అచిత్తువలె పరతంత్ర అనే పరమార్థం ప్రకటింపబడింది. తన ఇచ్ఛతోనే లక్ష్మీదేవి భగవానునకు శేషభూతురాలై ఉన్నది తప్ప, సహజంగా ఈమె పరతంత్ర కాదనే వాదం దీనివల్ల నిరసింపబడినట్లయింది. **“శ్రీరుపబర్హణమ్”** (శ్రీదేవి భగవానునకు కాలిదిండుగా ఉంటుంది) అన్నాడు వేదపురుషుడు కూడా.

**“వడివిణైయిల్లా మలర్‌మకళ్ మత్తై నిలైమకళ్ పిడిక్కుమ్ మెల్లడియై”** (రూపంలో సాటిలేని లక్ష్మీదేవి, ఇంకా భూదేవి సంవాహనం చేసే మృదుపాదాలు) అని శఠకోపసూరి, “శన్దణి మెన్ములై మలరాళ్ తారణిమఙ్గై తామిరువర్ అడివరుడుమ్ తన్మైయానై” (చందనం చేత అలంకరింపబడిన మృదువైన స్తనాలను కల లక్ష్మీదేవి, భూదేవి ఇద్దరు పాదసంవాహనం చేసేటట్లున్న వానిని) పరకాలసూరి, **“పెణ్మైయై త్తలైయుడైత్తాక్కుమ్ వణ్ణమ్ కేశవనమ్బియైక్కాల్ పిడిప్పాళెన్నుమ్”** (స్త్రీత్వం కృతార్థత చెందేటట్లు కేశవస్వామిపాదాలను సంవాహనం చేస్తుంది

నమః'' అనే ఈ మంత్రం పాతాళలోకాన్ని సాధించి ఇస్తుంది. దేవలోకంలో, అంతరిక్షలోకంలో, భూమిలో ఉండే భోగాలను అన్నిటినీ ఇస్తుంది. నామజ్ఞానమయం శరీరం అయిన ఈ లక్ష్మీశబ్దం భగవానుడైన విష్ణువు మనస్సులో ఉన్నది. ఇదే ఆత్మజ్ఞానం. ఇదే పుణ్యం, ఇదే గొప్ప యోగజ్ఞానం) అని లక్ష్మీతంత్రంలో ఘోషింపబడింది. "శ్రీః" అనే మొదటి నామానికి పిమ్మట లోకంలో, వేదంలోను ప్రసిద్ధంగా వ్యవహరింపబడేది ఈ తిరునామమే కదా!

**(లక్ష్మీం జాతవేదో మ ఆవహ)** పరమాత్మా! లక్ష్మీదేవి నాకు ప్రసన్నురాలు అయేటట్లు నీవు చేయాలి. నా పట్ల ఆమె కటాక్షాలు ప్రసరించేటట్లు చేయాలి – అని భావం.

**(జాతవేదః)–"జాతాః వేదాః యస్మాత్ సః"** (ఎవరివల్ల వేదాలు ఆవిర్భవించాయో అతడు జాతవేదు డనబడుతున్నాడు) అనే రీతిలో ఈ నామం నాల్గువేదాలను ప్రసాదించిన పరమపురుషుని తెలుపుతుంది. ఇచట అపౌరుషేయం అయిన వేదానికి చెప్పబడే జన్మ బ్రహ్మకు మునుముందుగా చేసిన ఉపదేశమేనని చెప్పాలి.

**"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై"** (ఎవడు బ్రహ్మను పూర్వం సృష్టించాడో, అతనికి వేదాలను ఉపదేశించాడో) అని కదా చెప్పబడింది.

**(జాతవేదః) – "జాతమ్ స్వతస్సిద్ధం వేదః ధనం వా, జ్ఞానం వా యశో వా యస్య సః జాతవేదః"** (ఎవనికి సహజమైన ధనం గాని, జ్ఞానం గాని, కీర్తి గాని ఉన్నదో అతడు జాతవేదుడనబడుతున్నాడు) అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు. "జాతవేదస్" అనే పదం అగ్నికి ప్రసిద్ధమైన వాచకం అయినా, లక్ష్మీవైభవాన్ని తెలిపే ఈ ప్రకరణస్వారస్యంవల్ల ఇక్కడ ఈ పదం భగవద్వాచకంగా గ్రహించడం ఉచితం. లేక, అగ్నికి అంతర్యామి అయిన భగవానుని తెలుపుతున్నదని కూడా చెప్పవచ్చు.

**(లక్ష్మీం మే ఆవహ) –** ఆ లక్ష్మిని నాకు అన్ని విధాలైన శ్రేయస్సులు కల్గించడం కోసం అనుగ్రహించు.

**(ఆవహ) –** సాన్నిధ్యాన్ని కలుగజేయి. (మే)–నాకు) నాకు సర్వశుభాలు సమకూరడం కోసం–అని భావం. లక్ష్మియొక్క కటాక్షలేశం వల్లనే అన్ని శుభాలు సిద్ధిస్తాయి అనే విషయం.

**స శ్లాఘ్యః స గుణీ ధన్యః స కులీనః స బుద్ధిమాన్ ।**
**స శూరః స చ విక్రాంతః యం త్వం దేవి! నిరీక్షసే ॥**

(దేవీ! ఎవనిని నీవు కటాక్షిస్తావో అతడు పొగడ తగినవాడు. అతడు గుణవంతుడు. అతడు ధన్యుడు. అతడు అభిజాతుడు. అతడు బుద్ధిమంతుడు. అతడు శూరుడు. అతడే వరుడు) అని,



(లక్ష్మికి కూడ లక్ష్మి అయిన సంపద్రూపుడెవడు? గొప్ప సత్త్వగుణానికి ఆశ్రయం అయిన వాడెవడు? పుండరీకాక్షుడెవడు? పురుషోత్తముడెవడు?) అని అంటూ పరబ్రహ్మయొక్క అసాధారణ లక్షణాలను ప్రస్తావించారు. శ్రియః పతిత్వం, పురుషోత్తమత్వం, నారీణాముత్తమ అయిన లక్ష్మికి సిద్ధించినపుడు కదా పరబ్రహ్మత్వం సిద్ధిస్తుంది. ఈరీతిగా, ఏతావతా, విష్ణువుకు సొత్తుగా ఉంటుంది – అనే అర్థాన్నికల "లక్ష్మీః" అనే నామాన్ని కల్గినది కాబట్టి లక్ష్మికి పరబ్రహ్మత్వం ఉండే అవకాశమే లేదని స్థిరీకరింపబడింది.

**(లక్ష్మీః) – "లక్ష్యం సర్వమితేరహమ్"** (సకలజ్ఞానాలకు లక్ష్యమై ఉన్నాను కనుక లక్ష్మి అనబడుతున్నాను) అనే లక్ష్మీతంత్రవచనం ప్రకారం సకలజ్ఞానాలకు లక్ష్యంగా ఉండేది–అనే అర్థాన్ని గ్రహించవచ్చు. "ఎప్పొరుట్కుమ్ నిన్రు" (అన్ని వస్తువులలో అంతరాత్మగా నిలచి) అని గోదాదేవి, **"ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానమ్"** (బ్రహ్మం ఒక్కటినీ తెలిస్తే అన్నిటినీ తెలిసి నట్లవుతుంది) అని చెప్పబడే సర్వభూతాంతరాత్మ అయిన పరమ పురుషునకు కదా ఈ అతిశయం ఉన్నది. ఈ అతిశయం లక్ష్మికి ఏవిధంగా పొసగుతుంది? అని అంటే, ఘటవ్యక్తికి ఘటత్వజాతివలె, గుణికి నిరూపకగుణంవలె, పిరాట్టి పరమపురుషునకు స్వరూపనిరూపకగా ఉన్నందువల్ల, అతనికి (భగవానునకు) సంబంధించిన జ్ఞానం లక్ష్మిని సంవిషయంగా చేసికొనకుండా ఉండదు. అందువల్ల పొసగుతుంది. అన్ని జ్ఞానాలకు ఈ ఇద్దరే విషయభూతులు. తేడా ఏమి? అంటే, లక్ష్మి విశేషణరూపేణ విషయభూత. సర్వేశ్వరుడు విశేష్యరూపంలో విషయభూతుడు. ఈ అంశాన్ని సరోయోగి–"ఒణ్ తామరైయాళ్ కేళ్వన్ ఒరువనైయే నోక్కుమునర్వు" (పద్మనివాసిని నాథుని ఒక్కని మాత్రమే లక్ష్యంగా కల్గి జ్ఞానం ఉంటుంది) అని తెలియజేశారు కదా!

ఇక లక్ష్మీతంత్రంలో ఈ నామంలోని ఒక్కొక్క అక్షరంలో ఉండే అర్థాలు తాంత్రికంగా వివరింప బడ్డాయి. అవి సంగ్రహంగా తెలుపబడుతున్నవి.

**(లక్ష్మీః)** – "లా–దానే" – అనే ధాతువు నుండి పుట్టిన లకారం అన్నిటినీ ఇచ్చేది అనే అర్థాన్ని ఇస్తుంది. **"ఐశ్వర్యమక్షరగతిమ్"** అని ప్రారంభం అయ్యే భట్టర్ శ్రీ గుణరత్న కోశ స్తోత్రంలోని శ్లోకాన్ని, **"ఉదారామ్"** అనే నామాన్ని ఆ వ్యాఖ్యానంలో ఉట్టంకింపబడే ప్రమాణాలను స్మరించడం తగినది. "క్షిప–ప్రేరణే" అనే ధాతువు నుండి పుట్టిన క్షకారం బద్ధముక్తనిత్యులని, శుద్ధసత్త్వమిశ్రసత్త్వ కాలాలని చెప్పబడే త్రివిధ చేతనా చేతనాలను ప్రేరేపించేది – అనే అర్థాన్ని ఇస్తుంది. లేక, ఈ క్షకారం మనోవాక్కాయాలను మూడింటిని ప్రేరేపిస్తున్నది–అని కూడా చెప్పవచ్చు. లేక, చిదచిదీశ్వరులనే మూడు తత్త్వాలను ప్రేరేపించేది–అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు. ఈ లక్ష్మియొక్క అనురాగానికి వశుడై, ఈమెచే ప్రేరేపింపబడి కదా భగవానుడు అన్ని కార్యాలను చేస్తాడు. **"అల్లిమలర్‌మకళ్ పోకమయక్కుక్కళ్ ఆకియుమ్ నిఱ్కుమమ్మాన్ ఎల్లా క్కరుమజ్గళుమ్ శెయ్"** (పద్మనివాసిని అయిన లక్ష్మీదేవి అనురాగానికి వ్యాముగ్ధుడై ఉండే స్వామి సృష్ట్యాది అన్ని కార్యాలను

చేస్తాడు.) అని అన్నారు కదా ఆళ్వార్లు. "మన–జ్ఞానే" అనే ధాతువు నుండి పుట్టిన మకారం ఈమె జ్ఞాన స్వరూపి–అనే అర్థాన్ని ఇస్తుంది. "లక్షణీయా మితౌ మితౌ" అని చెప్పినట్లు ఈ మూడు అక్షరాలు కలిసి "ఒక్కొక్క జ్ఞానంలోను దర్శింపబడేది" అనే అర్థాన్ని ఈ లక్ష్మీపదం ఇస్తుంది. ఈ విషయం అంతా

**దదతీ క్షేపణీ చాస్మి నిత్యా త్రిప్రేరణీ తథా।**
**తథా జ్ఞానస్వరూపా౽హం లక్షణీయా మితౌ మితౌ॥**

(అన్నిటిని ఇచ్చేదానను గాను, నిత్యమైనదాననుగాను, మూడు తత్త్వాలను ప్రేరేపించేదాననుగాను, జ్ఞానస్వరూపం గాను, ఒక్కొక్క జ్ఞానంలో తెలియబడేదానను గాను నేను ఉన్నాను కనుక లక్ష్మి అనబడుతున్నాను) అని లక్ష్మీతంత్రంలో చెప్పబడింది.

**(లక్ష్మీః)** – లకారం లయాన్ని, "క్షి–నివాసే" అనే ధాతువు నుండి పుట్టిన క్షకారం స్థితిని, "మాఙ్–మానే" అనే ధాతువు నుండి పుట్టిన మకారం నిర్మాణం అనే సృష్టిని సూచిస్తూ, ప్రకృతి సృష్టిస్థితిసంహారాలను చేసేది కనుక లక్ష్మి అనే అర్థాన్ని గ్రహించవచ్చు.

**"లయే నివాసే నిర్మాణే ప్రేరణీ ప్రకృతే రహమ్"** (ప్రకృతిని సృష్టిస్థితి లయాలకోసం ప్రేరేపిస్తున్నాను కనుక లక్ష్మి అనబడుతున్నాను) అని లక్ష్మీతంత్రంలో ఈ అర్థం వ్యక్తం చేయబడింది.

**(లక్ష్మీః)** – **"లక్ష్యతే అనేన ఇతి లక్షణా"** – అనే వ్యుత్పత్తిని బట్టి అన్ని వస్తువులను దర్శించడానికి ఉపకరణంగా ఉండే కాలం "లక్షణా" అనబడుతున్నది. "లక్ష" అనే అక్షరాలు ఈ అర్థాన్ని సూచిస్తున్నవి. "డుమిఞ్ – ప్రక్షేపణే"–అనే ధాతువు నుండి "మి" అనే అక్షరం లక్ష శబ్దవాచ్యం అయి కాలాన్ని ప్రేరేపిస్తున్నది–అనే అర్థాన్ని ఇస్తుంది. "లక్ష్యంతే ఇతి లక్షణాని" అనే వ్యుత్పత్తి ప్రకారం కనుపించే అన్ని వస్తువులను "లక్ష" శబ్దంతో నిర్దేశించి, వాటిని కాలస్వరూపిణిగా ఉంటూ ప్రేరేపిస్తున్నది కనుక లక్ష్మి అనబడుతున్నది. అని కూడా చెప్పవచ్చు.

**లక్షణాఖ్యస్య భావస్య కలాకాష్ఠాదిరూపిణీ।**
**అవ్యక్తవ్యక్తసత్వస్థా ప్రేరయిత్రీ సదాస్మ్యహమ్ ॥**

("లక్షణా" అనే పేరును కల పదార్థాన్ని (తత్త్వాన్ని) దాని అవయవాలైన కలాకాష్ఠాది రూపిణిగా స్థూలసూక్ష్మవస్తువులలో ఉంటూ నేను ఎల్లప్పుడూ ప్రేరేపించే దాననై ఉంటాను) అని లక్ష్మీతంత్రంలో చెప్పబడింది.

**(లక్ష్మీః)** – యోగులకు తనను లక్ష్యభూతురాలినిగా – దర్శనీయరాలునిగా చేస్తుంది– అనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు. "లా–ఆదానే" అనే ధాతువు నుండి పుట్టిన లకారం ప్రళయకాలంలో అన్ని వస్తువులను తనలో గ్రహించేది అనే అర్థాన్ని ఇస్తుంది. "క్షిప" ధాతునిష్పన్నమైన క్షకారం వాటిని సృష్టికాలంలో వ్యక్తం చేసేది – అనే అర్థాన్ని ఇస్తుంది.



"క్షిప, క్షప, క్షిణు" అనే ధాతువులు కూడా ప్రేరణార్థాన్ని ఇస్తాయి కనుక సత్పురుషుల పాపాన్ని వారిని విడిచి పోయేటట్లు ప్రేరేపిస్తుంది అనే అర్థాన్ని క్షకారం ఇస్తుంది. "క్షమూ–సహనే" అనే ధాతువునుండి పుట్టినదని తలిస్తే ఈ క్షకారం క్షమించేది, క్షమా స్వరూపిణిగా ఉండేది–అనే అర్థాలను కూడా ఇస్తుంది. "డుమిఞ్–ప్రక్షేపణే" అనే ధాతువు వల్ల పుట్టిన "మి" అనే అక్షరం "సృష్టిస్తున్నాను, సృష్టించబడుతున్నాను" అనే అర్థాలను ఇస్తుంది. "మాఙ్–మానే" అనే ధాతువు నుండి పుట్టినదిగా మకారాన్ని భావిస్తే "సృష్టించిన వానిని కొలుస్తాను" అనే అర్థాన్ని ఈ అక్షరం ఇస్తుంది. ఈ అపూర్వార్థాలు అన్నీ –

**లక్షం నయామి చాత్మానం లామి చాంతే క్షిపామి చ।**
**క్షిపామి క్షపయామ్యేకా క్షిణోమి దురితం సతామ్।**
**క్షమే క్షమా హి భూతానాం మిమే మమ్యే చ మామి చ॥**

(నన్ను భక్తులకు లక్ష్మీభూతురాలనుగా అయేటట్లు చేసికొంటాను. అన్ని వస్తువులను నాలో ప్రళయకాలంలో లీనం చేసికొంటాను. లోపలకు గ్రహిస్తాను. సృష్టికాలంలో వెలువరిస్తాను. సత్పురుషుల పాపాలను పటాపంచలు చేస్తాను. వాటిని సహిస్తాను. జీవులలోని క్షమాగుణ స్వరూపిణిగా ఉంటాను.లోకాలను సృష్టిస్తాను. లోకాలుగా సృష్టింపబడతాను. లోకాలను కొలుస్తాను.) అని లక్ష్మీతంత్రంలో ఉద్ఘోషింపబడ్డాయి.

**కడల్ ఞాలమ్ శెయ్‌దేనుమ్ యాన్ ఎన్నుమ్**
**కడల్ ఞాలమ్ ఆవేనుమ్ యానే ఎన్నుమ్**
**కడల్ ఞాలమ్ కొణ్డేనుమ్ యానే ఎన్నుమ్**

(సముద్ర పరివేష్ఠితం అయిన లోకాన్ని సృష్టించేదానను నేనే అని అంటుంది. సముద్ర పరివేష్ఠితం అయిన లోకాలుగా మారేది నేనే అని అంటుంది. సముద్ర పరివేష్ఠితం అయిన లోకాలను గ్రహించేది నేనే అని అంటుంది.) అని ప్రారంభం అయ్యే శఠకోపసూరి సహస్రంలోని దశకప్రమేయం ఇక్కడ అనుసంధేయం. శ్రీదేవి యొక్క వైలక్షణ్యాన్ని తెలిపే ఈ నామ వైభవం.

**ఇత్యేతాన్ మయి దృష్ట్వా౽ర్థాన్ పరమర్షిరుదారధీః।**
**లక్ష్మీర్లక్ష్యమేత్యేవ కపిలో మునిరుక్తవాన్ ॥**

**పంచాక్షరో హ్యయం మంత్రః పాతాళగతిసాధనః।**
**దివ్యాంతరిక్షభౌమానాం భోగానాముపపాదకః॥**

**తనుర్జ్ఞానమయీ సా మే విష్ణోర్హృది చ వర్తతే ।**
**ఆత్మజ్ఞానమిదం పుణ్యం యోగజ్ఞానమిదం పరమ్॥**

(ఇటువంటి పలువిధాలైన విషయాలను ఈ తిరునామంలో దర్శించి, "లక్ష్మీ! నన్ను కటాక్షించు" అని కపిల మహర్షి పలికారు. అయిదు అక్షరాలను కల్గిన "ఓమ్ లక్ష్మ్యై

అశ్వాలను, సేవకులను పొందుతానో, **"తామ్ మ ఆవహ"** (అటువంటి లక్ష్మిని నాకు అనుగ్రహించు) అని అన్వయం. ఇందువల్ల లక్ష్మి ఐశ్వర్యాన్ని తానే ఇస్తుందని అర్థం తెలుపబడింది. శ్రీదేవికి ఐశ్వర్యప్రదత్వం సాత్త్వతాది శాస్త్రాలలో ఉద్ఘోషింపబడింది. ముముక్షువు ఈరీతిలో ఐశ్వర్యాన్ని ప్రార్థించవచ్చునా? అని ప్రశ్నిస్తే, భగవత్ప్రాప్తికి సాధనాలైన యజ్ఞాదులకు ఐశ్వర్యం అవశ్యం అపేక్షితం కనుక, భగవద్భాగవతారాధనలకు సాధనంగా తగినది కనుక, వాటి కోసం ఐశ్వర్యాన్ని కోరడంలో దోషం లేదు కదా! తన కోసం కోరితే కదా అవద్యం.

| | |
|---|---|
| **3.** | **అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాదప్రబోధినీమ్**<br>**శ్రియం దేవీముపహ్వయే శ్రీర్మా దేవీ జుషతామ్॥ 3** |

అశ్వపూర్వామ్=(యోగంలో) ఆరంభదశలో అశ్వంవలె శబ్దించేదై, రథమధ్యామ్=నడుమ రథంవలె ధ్వనించేదై, హస్తినాదప్రబోధినీమ్=చివరలో గజంవలె ఘోషించేదైన, శ్రియం దేవీమ్=శ్రీదేవిని, ఉపహ్వయే=ఇక్కడకు ఆహ్వానిస్తున్నాను, మా=నా పట్ల, శ్రీః =శ్రీదేవి, జుషతామ్=ప్రీతిని కల్గినది కావాలి.

పూర్వం రెండు మంత్రాలలో వేదపురుషుడు లక్ష్మీసాన్నిధ్యాన్ని తనకు అనుగ్రహించమని సర్వేశ్వరుని ప్రార్థించాడు. ఇందులో భగవదనుమతిని పొంది లక్ష్మిని ఆహ్వానించి, నా విషయం ప్రీతిని కల్గి ఉండాలి–అని ఆమెను వేడుకుంటున్నాడు.

**(అశ్వపూర్వామ్)**–హృదయం–అనే పురాన్ని లాగే అశ్వంగాను, హృదయపురంగాను, ఆ హృదయపురాన్ని వాహనంగా కల్గినదిగాను ఉండేది–అని అర్థం.

**(పూర్వామ్)**–బుద్ధి, ప్రాణం, శరీరం–అనే పురాలలో వసించేది–అని కూడా అర్థం. ఈ అర్థం–

**అశ్వా పూర్వాహనీ చాస్మి వసామి చ పురే సదా।** 50-75
**బుద్ధిప్రాణశరీరాఖ్యే త్రివిధే త్రివిధాత్మనా॥**

(అశ్వంగాను,పురంగాను,వాహనాన్ని కల్గినదిగాను ఉంటాను. బుద్ధి, ప్రాణం, శరీరం–అనే మూడు పురాలలో మూడురీతుల్లో ఎల్లప్పుడు నివసిస్తాను.) అని **లక్ష్మీతంత్రం**లో ఆదరింపబడింది.

**(అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాదప్రబోధినీమ్)** యోగంలో ఆరంభంలోనే అశ్వంవలె ధ్వనించేది, నడుమన రథం శబ్దించేటట్లు శబ్దించేది, చివరలో కరిణివలె ఘీంకరించేది–అనే అర్థాన్ని చెప్పవచ్చు.

**అశ్వానాం హేషవన్నాదం యోగారంభే కరోమి చ।** 50-76
**నాడీమధ్యం సమాయాతా కరోమి రథవద్ధ్వనిమ్॥**
**వ్యోమరంధ్రమనుప్రాప్తా హస్తినాదవినాదినీ।** 50-77



**దారాపుత్రాస్తథాగారసుహృద్ధాన్యధనాదికమ్।**
**భవత్యేతన్మహాభాగే! నిత్యం త్వద్వీక్షణాన్నృణామ్ ॥**

(మహాభాగ్యాన్ని కలదానా! భార్యాపుత్రులు, అదేరీతిలో భవనాలు, మిత్రులు, ధనధాన్యాదులు అన్నీ మానవులకు నీ కటాక్షాలవల్ల సిద్ధిస్తాయి) అనే విష్ణుపురాణ సూక్తులవల్ల,

**"తిరుమామకళ్ తన్నరుళాల్ ఉలకిల్ తేర్ మన్నరాయ్ ఒలిమాకడల్ శూళ్ శెలునీరులకాణ్డు తికళ్వర్కళే"**–(లక్ష్మీదేవి అనుగ్రహంవల్ల ఈ లోకంలో రథాలను నడిపే ప్రభువులై, శబ్దించే మహాసముద్రంచేత పరివేష్టితం అయిన భూమిని పాలించి ప్రకాశిస్తారు) అని పరకాలసూరి సూక్తివల్ల, **"ఈషత్ త్వత్ కరుణానిరీక్షణసుధాసంధు క్షణాద్రక్ష్యతే నష్టం ప్రాక్ తదలాభతస్త్రిభువనం సంప్రత్యనంతోదయమ్"**(చతుఃశ్లోకి 3)–అనే యామునుల సూక్తివల్ల, **"యస్యాః కటాక్షణమనుక్షణమీశ్వరాణాం ఐశ్వర్యహేతురితి విశ్వజనీనమేతత్"** (ఎవరి కటాక్షం ఒక్కొక్క క్షణం ఈశ్వరుల ఐశ్వర్యానికి హేతువు అన్నది అందఱికీ తెలిసినదో) అని శ్రీవత్సాంకులు, **"ఏకో ముక్తాతపత్రప్రచలమణిఘృణాత్కారి మౌలిర్మనుష్యః దృష్యద్దంతావళస్థో న గణయతి నతాన్ యత్ క్షణం క్షోణిపాలాన్, యత్తస్మై తిష్ఠతే – న్యః కృపణమశరణో దర్శయన్ దంతపంక్తి తత్తే శ్రీరంగరాజప్రణయిని! నయనోదంచిత న్యంచితాభ్యామ్"** (శ్రీరంగ నాయకీ! ఒక మానవుడు మదగజంపై ఉన్నవాడై, ముత్యాలమయం అయిన గొడుగులో కదలాడే మణులచేత ధ్వనించే కిరీటాన్ని కలవాడై, తనను నమస్కరించే ప్రభువులను క్షణం కూడా లెక్కపెట్టకుండా ఉండడం, వేఱొకడు గతిలేనివాడై, తన దీనత్వాన్ని తెలుపుతూ అతనికి తన దంతపంక్తిని చూపిస్తూ నిలవడం–అనే ఈ తారతమ్యం అంతా క్రమంగా నీ నేత్రాలు కొంచెం విచ్చుకోవడంవల్ల, మూసి కోవడంవల్ల కల్గుతున్నది) అనే శ్రీపరాశరభట్టర్ సూక్తివల్ల వ్యక్తం.

**(మే ఆవహ) –** నాకు అనుగ్రహించు. దీనివల్ల ఇష్టవినియోగార్హం అయేటట్లు పరమపురుషునకు లక్ష్మీదేవి పరతంత్ర–అనే అర్థం వెల్లడింపబడింది.

| | |
|---|---|
| **2.** | **తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీమనపగామినీమ్।**<br>**యస్యాం హిరణ్యం విందేయం గామశ్వం పురుషానహమ్॥ 2** |

జాతవేదః=పరమపురుషా!, యస్యాః=ఏ లక్ష్మీదేవివల్ల, హిరణ్యమ్=బంగారాన్ని, గామ్=గోవులను, అశ్వమ్=గుఱ్ఱాలను, పురుషాన్=సేవకులను, అహం విందేయమ్=నేను పొందగలనో, అనపగామినీమ్=నిన్ను విడచి ఉండని, తామ్=ఆ లక్ష్మిని, మే=నాకు, ఆవహ= ఆవిర్భవింపజేయి.

ఈ రెండవ మంత్రంతో తాను లక్ష్మివల్ల పొందగోరిన ఫలాలను తెలిపి, అటువంటి లక్ష్మిని నాకోసం ఆవిర్భవింపజేయాలి అని తిరిగి ప్రార్థిస్తున్నాడు – వేదపురుషుడు.

**(తామ్ మ ఆవహ జాతవేదః)**–భగవన్! అటువంటి లక్ష్మిని నాకు అనుగ్రహించు.

లక్ష్మిని దర్శించాలనే ఆశతో తిరిగి ఈ విధమైన ప్రార్థన చేయబడుతున్నది. "తలచినవారికి అందఱికీ అనుగ్రహించేటట్లుగా నాకు వశమై లక్ష్మి ఉంటుందా? ఏమి?" అని భగవానుని అభిప్రాయంగా భావించి, వేదపురుషుడు సమాధానం పల్కుతున్నాడు.

**(లక్ష్మీమ్)**–ఈమె నీకు సొత్తుగా కదా ఉన్నది. నీకు ఈమె ఇష్ట వినియోగార్హ కదా! **"లక్ష్మ అస్యా అస్తీతి లక్ష్మీః"** (పారతంత్ర్యం అనే జీవలక్షణం ఈమెలో ఉన్నది కనుక లక్ష్మి అనబడుతున్నది) అనే వ్యుత్పత్తి వల్ల పారతంత్ర్యలక్షణాన్ని పరిపూర్ణంగా కల్గినది – అనే అర్థాన్ని చెప్పవచ్చు.

**(లక్ష్మీమ్)**–**"సర్వలక్షణసంపన్నామ్"** అనేటట్లు అన్ని లక్షణాలు పొందికగా కల్గినది– అనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు.

"నాకు తలచినపుడంతా ఇచ్చేటట్లుగా వశమై ఉంటే సరిపోతుందా! ఆమె చంచల అనే ప్రసిద్ధిని కల్గినది కదా! నీ దగ్గర స్థిరంగా ఉంటుందా?" అని భగవానుని అభిప్రాయంగా తలచి, సమాధానాన్ని వేదపురుషుడు తెలుపుతున్నాడు.

**(అనపగామినీమ్)**–**"అకల కిల్లేన్ ఇఱైయుమ్"** (క్షణం అయినా విడచి ఉండలేను) అని అన్నట్లు నిన్ను వీడి ఉండలేనిది కదా ఈ లక్ష్మి. నీవు సంకల్పిస్తే ఈమె కటాక్షం నన్ను వీడిపోదు సుమా! అని ఇచటి హార్దభావం.

**"అనన్యా హి మయా సీతా భాస్కరేణ ప్రభా యథా"** (సీత, సూర్యుని విడచి ఉండని కాంతివలె, నాంతో కలసి ఉంటుంది) అని, **"అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభా యథా"** (సూర్యుని విడచి ఉండని కాంతివలె, నేను రామునితో కలిసి ఉంటాను) అని దివ్యదంపతు లిద్దఱు శ్రీరామాయణంలో స్వయంగా పలికారు కదా! **"విష్ణోః శ్రీరనపాయినీ"** (విష్ణువును విడచి ఉండనిది లక్ష్మి) అని పరాశరమహర్షి వచించారు. ఇటువంటి భగవానుని విడువకుండా, నిత్యం కలసి ఉండడంవల్ల **"అనపగామినీ"** అనే పేరును కల్గినది అయినది – అనే ఈ అర్థం

**భానామివ గతా కాంతిః శీతరశ్మౌ సదా తథా।**
**శక్తిః శక్తిమతో విష్ణోః స్థితాహమనపాయినీ॥ (50–70)**

(కిరణాలకాంతి చంద్రునివద్దనే ఎల్లప్పుడూ కలిసి ఉండేటట్లుగా సర్వశక్తి అయిన విష్ణువును విడచి ఉండని శక్తిగా నేను ఉన్నాను) అని **లక్ష్మీతంత్రం**లో ఆదరింపబడింది.

**(అనపగామినీమ్)**–తన భర్తపట్ల ఆనుకూల్యాన్ని లేనివారి వద్ద నిలచి ఉండదు కనుక **"అపగామినీ"** అని, ఆనుకూల్యాన్ని కలవారి వద్ద స్థిరంగా ఉంటుంది కనుక **"అనపగామినీ"** అని – రెండు నామాలతో కీర్తింపబడేది.

**అపశ్చాహమయామ్యేకా ద్రవో భూత్వా గుణో మహాన్।** (ద్రవత్వం అనే గుణమై నేను జలాన్ని చేరుతున్నాను కనుక అపగామిని అవుతున్నాను) అని లక్ష్మీతంత్రంలో



"అపగామినీ" అనే నామానికి ఒక వ్యుత్పత్తి చూపబడింది. "పునఱ్కణ్ నిన్ఱ నాన్గుమాయ్" (నీటిలో ఉండే నాల్గువిధాలైన గుణాలకు నిర్వాహకుడై) అనే రీతిలో జలం మొదలైన సర్వపదార్థాలలో ఉండే గుణాలన్నీ తన అధీనంలో కల్గి ఉండే పరమాత్మయొక్క భావనతో పల్కిన మాట ఇది–అని చెప్పవచ్చు. లేక, భగవానుని తన అధీనంలో కల్గినది ఈ లక్ష్మి కనుక ఇవి కూడ ఈమె అధీనంలో ఉన్నవి అనడంలో కొఱతలేదు. "అపగామినీ", "అనపగామినీ" అనే రెండు నామాలు లక్ష్మికి కలగడానికి ఒక వృత్తాంతం లక్ష్మీతంత్రంలో పేర్కొనబడింది.

**అపావాహయమాదౌ చ మునిం భూత్వా సరస్వతీ।**
**సారస్వతే జలే పూర్వం విశ్వామిత్రోదితా సతీ॥**
**అపోవాహ వశిష్ఠం తం సత్యసంధా సరస్వతీ।**
**ఋషయః ప్రాహురేవం మాం వశిష్ఠే స్రోతసా హృతే॥**
**సత్యే సత్యప్రియం పాహి వశిష్ఠం శాత్రవాదితి।**
**సాహం సరస్వతీ భూత్వా తమపోవాహ శాత్రవాత్॥**
**ఋషయో నామ చక్రుర్మే తదా హ్యనపగామినీ।**
**నవాక్షరో హ్యయం మంత్రః సర్వాపద్వినివారణః॥**

(పూర్వం విశ్వామిత్ర–వశిష్ఠులకు మధ్య కలహం సంభవించినపుడు విశ్వామిత్రునిచేత ప్రార్థింపబడ్డ నేను సరస్వతీనదిగా మాఱి, వశిష్ఠమునిని నీటిలోనికి తీసికొనిపోయాను. సత్యాన్ని దాటనిది అయిన సరస్వతీనది విశ్వామిత్రునకు ఇచ్చిన మాట ప్రకారం వశిష్ఠుని తీసికొని పోయింది. వశిష్ఠుడు ఆ విధంగా నీటిలోనికి లాగుకొని పోయినపుడు మిగిలిన ఋషులు "సత్యాసత్యప్రియుడైన ఈ మునిని నీ కోపం నుండి రక్షించు" అని ప్రార్థించారు. సరస్వతిగా మాఱి నేను వశిష్ఠుని నీటిలోనికి లాగుకొని పోయినందువల్ల "అపగామిని" అయ్యాను. ఋషులు ప్రార్థించిన పిమ్మట వశిష్ఠుని నా కోపం నుండి విడచిపెట్టాను. అపుడు **"అనపగామిని"** (బలవంతంగా తీసికొని పోనిది) అని నాకు మునులు పేరుపెట్టారు. తొమ్మిది అక్షరాలను కల **"ఓమ్ అనపగామిన్యై నమః"** అనే ఈ మంత్రం ఈ కారణంవల్ల అన్ని ఆపదల నుండి రక్షిస్తుంది) అని అంటూ ఈ నామం లక్ష్మికి కలగడానికి కారణభూతం అయిన వృత్తాంతాన్ని, మంత్రమహిమను లక్ష్మీతంత్రం తెలిపింది.

నీవు లక్ష్మిని దర్శించాలని ఆశపడడం ఎందుకు? అని అంటే – సమాధానం ఇక తెలుపబడుతున్నది.

**(యస్యామ్)** – అన్ని ఫలాలను అనుగ్రహించగల్గినదిగా ప్రసిద్ధిపొందిన ఏ పిరాట్టి వల్ల.

**(హిరణ్యం విందేయం గామశ్వం పురుషానహమ్)**–బంగారాన్ని, పశువులను,

వాడెవడు?) అనే రీతిలో పరమపురుషునకు ఉపదేశించి, చేతనునిలో ఉండే దోషాలను, ఈశ్వరునిలో ఉండే నిరంకుశస్వాతంత్ర్యం అనే దోషాన్ని లేకుండా చేస్తుంది- అని భావం.

**(శ్రియమ్)-"శౄ-విస్తారే"** అనే ధాతువునుండి పుట్టినదిగా శ్రీ శబ్దాన్ని భావిస్తే, గుణాలను విస్తరింపజేస్తుంది అనే అర్థాన్ని ఈ శబ్దం **"శృణాతి గుణైః ఇతి శ్రీః"** అనే వ్యుత్పత్తి ద్వారా ఇస్తుంది. పూర్వం తెల్పిన ఉపదేశాల ద్వారా జీవుల, ఈశ్వరుల గుణాలను విస్తృత పఱుస్తుంది-అని భావం.

**(శ్రియమ్)- "శ్రు-శ్రవణే"**- అనే ధాతువు నుండి పుట్టిన శ్రీశబ్దం **"శృణోతి ఇతి శ్రీః, శ్రావయతీతి శ్రీః"** అనే రెండు వ్యుత్పత్తుల ద్వారా భక్తుల (ఆశ్రితుల) దీనాలాపాలను వింటుంది, వాటిని భగవానునకు వినిపిస్తుంది-అనే రెండు అర్థాలను ఇస్తుంది. లక్ష్మి వినడం, వినిపించడం-అనే ఈ రెండు పనులు చేసే ఇతః పూర్వమే సంగ్రహంగా ప్రస్తావింపబడ్డాయి.

ఈ రీతిలో ఈ ఆఱు అర్థాలచేత లక్ష్మియొక్క పురుషకారత్వం స్థిరీకరింపబడింది. "పురుషకారిణి కనుక, శరణ్యగా ఉంటుంది" అనే అర్థంకూడా శ్రీశబ్దానికి చెప్పవచ్చు. పురుషకారం (ఘటకకృత్యం) చేసేవారు చేతనులలో, ఈశ్వరునితో సంబంధం కల్గినవారై కదా ఉండాలి. "ఈశ్వరుని ఆశ్రయించి ఉంటుంది, జీవులచే ఆశ్రయింపబడుతుంది" అనే అర్థాలద్వారా ఈ సంబంధం లక్ష్మికి ఉన్నదని సూచింపబడింది. సంబంధం ఉన్నా, దీనవచనాలను పెడచెవిని పెట్టే మనఃకారిన్యాన్ని కల్గినది అయితే పురుషకారభూత అయే అవకాశం లేదు. తాను విన్నా, వాటిని భగవానునకు వినిపించగల్గిన సన్నిహితసంబంధం ఉంటే తప్ప ఘటకత్వం కార్యకరం కాదు. ఈ రెండు ఉన్నవి అనే విషయాన్ని "వింటుంది, వినిపిస్తుంది" అనే రెండు అర్థాలు సూచించాయి. ఇవి అన్నీ ఉన్నా, దోషాలకు అన్నిటికీ ఆశ్రయభూమిగా ఉండే జీవుని దోషాలను పోగొట్టి, గుణాలను పెంచకపోతే పురుషకారకృత్యం ఫలించదు. సర్వేశ్వరునివద్ద ఉండే స్వాతంత్ర్యం అనే దోషాన్ని తన సౌందర్యంతో తీర్చి, వాత్సల్యాది గుణాలను ఉద్బుద్ధం చేయకపోయినా కార్యకరం కాదు. దీనిని అంతటినీ లక్ష్మి నెరవేరుస్తుంది అనే విషయాన్ని "దోషాలను పోగొడుతుంది, గుణాలను విస్తరింపజేస్తుంది" అనే రెండు వ్యుత్పత్తులు చూపించాయి. అందువల్ల ఈ రీతిలో పురుషకారత్వమే స్వరూపంగా కల్గినది ఈ లక్షీదేవి-అనే విషయం **"శ్రీః"** అనే అసాధారణనామం ద్వారా తెలుపబడుతున్నది.

**ఆకించన్యైకశరణాః కేచిద్భాగ్యాధికాః పునః।**
**యత్పదాంభోరుహద్వంద్వం ప్రపద్య ప్రీతమానసాః॥**
**లక్ష్మీం పురుషకారేణ వృతవంతో వరాననే।**
**మత్ క్షమాం ప్రాప్య సేనేశ! ప్రాప్యం ప్రాపకమేవ మామ్॥**



(యోగం ఆరంభంలో సుషుమ్నానాడిమూలంలో ఉండి అశ్వఘోషవలె ధ్వనిస్తాను. యోగం మధ్యలో సుషుమ్నానాడి నడుమన చేరి, రథంవలె శబ్దిస్తాను. యోగం చివరలో బ్రహ్మరంధ్ర దేశాన్ని పొంది కరిణివలె ఘీంకరిస్తాను) అని **లక్ష్మీతంత్రం** తెలుపుతున్నది.

**(అశ్వపూర్వామ్)**-"అశూ-వ్యాప్తౌ"-అనే ధాతువునుండి ఉత్పన్నం అయిన అశ్వశబ్దం సర్వవ్యాపి అయిన సర్వేశ్వరుని తెలుపుతుంది. అందువల్ల **"అశ్వపూర్వా"** అనే నామం ఆశ్రితరక్షణాది విషయాలలో తనకంటే ముందుండేది-అనే అర్థాన్ని ఇచ్చేదిగా కూడా గ్రహించవచ్చు.

**యది త్వం ప్రస్థితో వీర! వనమద్యైవ రాఘవ!**
**అగ్రతస్తే గమిష్యామి మృద్నంతీ కుశకంటకాన్॥**

(వీరా! రాఘవా! నీవు ఈనాడే వనానికి బయలుదేరినా, దర్భమొనలను, ముళ్ళను అణచివేస్తూ నీకు ముందుగా ఆ దారిలో నేను వెళ్ళగలను) అని కదా ఈ తల్లి పలికింది.

**(అశ్వపూర్వామ్)-"అశ్వః పూర్వో యస్యాస్సా"** (సర్వేశ్వరుని మొదట కల్గినది) అనే అర్థాన్ని చెప్పవచ్చు. అంటే-జగత్సృష్టి, చేతనసంరక్షణం, జగద్వ్యాప్తి-ఇత్యాది సర్వకార్యాలలో సర్వస్వతంత్రుడైన సర్వేశ్వరునకు ప్రాధాన్యాన్ని ఇచ్చి, పరతంత్ర అయిన తాను తన స్వరూపానికి తగినట్లు అతనిని అనుసరిస్తూ ఉంటుంది-అని భావం. సర్వేశ్వరునకు ముందు ఉంటుంది అనే తత్పురుషసమాసంవల్ల ఈమె కరుణాగుణం ప్రకటితం అవుతుంది. అతనిని ముందు కల్గినది అనే బహువ్రీహిసమాసంవల్ల ఈ పారతంత్ర్యం వ్యక్తమవుతుంది.

**(రథమధ్యామ్)-"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ చ"** (జీవాత్మను రథాన్ని నడిపే సారథిగాను, శరీరాన్ని రథంగాను తెలిసికో) అనే ముండకోపనిషత్ సూక్తి రీతిలో రథంగా చెప్పబడే శరీరానికి నడుమ భగవానునితో కూడి వేంచేసి ఉంటుంది-అని కూడా అర్థం. లేక, రథం అన్నది సర్వేశ్వరుని అప్రాకృతశరీరాన్ని తెలుపుతున్నదని చెప్పి, ఆ శరీరం నడుమ వేంచేసి ఉండేది-అని కూడా చెప్పవచ్చు.

**(రథమధ్యామ్)-"ఓకారం రథమారుహ్య"** (ఓంకారం అనే రథాన్ని అధిరోహించి) అని అన్నట్లు రథంగా చెప్పబడే ఓంకారం నడుమన ఉండే ఉకారంచేత నిర్దేశింపబడేది-అని కూడా అనవచ్చు.

**అకారేణోచ్యతే విష్ణుః సర్వలోకేశ్వరో హరిః।**
**ఉద్ధృతా విష్ణునా లక్ష్మీరుకారేణోచ్యతే సదా॥**
**మకారస్తు తయోర్దాస ఇతి ప్రణవలక్షణమ్॥**

(సర్వలోకేశ్వరుడై, సర్వవ్యాపి అయిన హరి అకారంచేత చెప్పబడుతున్నాడు. ఆ భగవానుని వక్షస్సులో ఎల్లప్పుడూ ఉద్ధరింపబడే లక్ష్మి ఉకారంచేత చెప్పబడుతున్నది. మకారం ఆ ఇద్దరికీ దాసుడు (జీవుడు, అనే అర్థాన్ని కల్గినది. ఇది ప్రణవంయొక్క

లక్షణం) అని వేదంలోకూడా ఉద్ఘోషింపబడుతున్నది.

**(హస్తినాదప్రబోధినీమ్)**–పద్మవనంలో నివసించడంవల్ల పద్మంలో ప్రీతినికల ఏనుగుల నాదంతో ప్రబోధాన్ని పొందేది–అని అర్థం. తన ఆసనపద్మంలో ఉండే గుల్గులు, కురణ్డక, దమక, శలిలాది గజాల ఘోషచేత నిద్రలేచేది–అని కూడా అర్థం.

**ఆగ్నేయాదివళస్థాస్తే గుల్గులుశ్చ కురణ్డకః।**
**దమకః శలిలశ్చేతి ఖ్యాతాః పుష్ణం తు మే శ్రియమ్॥**

(ఆసనపద్మంలోని ఆగ్నేయాది దిక్కులలోని దళాలలో ఉండే గుల్గులు, కురండక, దమక, శలిల నామాలతో పేరుపొందిన గజాలు నాకు అన్ని విధాలైన సంపదను వృద్ధిని పొందించుగాక!) అని మంకణసంహితలోను,

**ఐరావతాదిభిః సమ్యక్ సామజైరావృతాం శుభమ్।**

(ఐరావతం మొదలైన గజాలచే పరివేష్టితమైనది, మంగళకరమైనది అయిన లక్ష్మిని) అని కాశ్యపేయంలోను

**కోణభద్రగతైర్దివ్యైః హిరణ్యకలశోదకైః।**
**సంప్రీతైః స్నాప్యమానాం తాం బోధ్యమానాం చ తైర్గజైః॥**

(ఆసనపద్మంలోని ఒక్కొక్క కోణంలోను ఉన్నవి, మిక్కిలి ప్రీతిని చెందినవి అయిన దివ్యగజాలచేత బంగారు కలశాల నీటితో స్నానం చేయించబడినది, ఆ గజాలచేత నిద్రలేపబడినది అయిన లక్ష్మిని) అని స్వాయంభువంలోను చెప్పబడినది.

**ఆద్యావష్టాక్షరౌ మంత్రావన్య ఏకాదశాక్షరః।**
**అభీప్సితప్రదా హ్యేతే త్రయో మంత్రా హి మన్మయాః॥**

(**"ఓమ్ అశ్వపూర్వాయై నమః"**, **"ఓమ్ రథమధ్యాయై నమః"** అనే మొదటి రెండు మంత్రాలు ఎనిమిది అక్షరాలను కల్గినవి. **"ఓమ్ హస్తినాదప్రబోధిన్యై నమః"** అనే మిగిలిన మంత్రం పదకొండు అక్షరాలను కల్గినది. నాకు వాచకాలైన ఈ మూడు మంత్రాలు కోరినవానిని అన్నిటినీ ఇస్తాయి) అని అంటూ లక్ష్మీతంత్రంలో వీటి మహిమ తెలుపబడింది.

**(శ్రియమ్ దేవీమ్)**– శ్రీదేవిని.

**(శ్రియమ్)**–లక్ష్మియొక్క అసాధారణనామం అనుసంధించబడుతున్నది. నారాయణ నామానికివలె ఈ నామానికి కూడా అర్థాలు అనేకం. అయినా–

**"శృణాతి నిఖిలాన్ దోషాన్ శ్రీణాతి చ గుణైర్జగత్।**
**శ్రీయతే చాఖిలైర్నిత్యం శ్రయతే చ పరం పదమ్॥**
**శ్రయంతీం శ్రీయమాణాం చ శృణ్వంతీ శృణతీమపి।**

(ఆశ్రితుల దోషాలను పోగొడుతుంది. వారి అద్వేషం, అభిముఖ్యం, మొదలైన



గుణాలను వృద్ధి చేస్తుంది. దాసులచేత నిత్యం ఆశ్రయింపబడుతున్నది. పరమప్రాప్యుడైన భగవానుని ఆశ్రయిస్తుంది. దాసుల విన్నపాలను వింటుంది. వాటిని స్వామికి వినిపిస్తుంది) అని ఆఱు అర్థాలు భగవచ్ఛాస్త్రంలో (పాంచరాత్రంలో) ఆదరింపబడ్డాయి. ఇవి కొంచెం వివరింపబడుతున్నాయి.

**(శ్రియమ్)– శ్రీఞ్–సేవాయామ్** – అనే ధాతువునుండి పుట్టిన శ్రీ శబ్దం "శ్రయతే ఇతి శ్రీః" అనే వ్యుత్పత్తిని బట్టి సర్వేశ్వరుని ఆశ్రయిస్తున్నది–అనే అర్థాన్ని ఇస్తుంది. ఇందువల్ల, ఇతర చేతనులవలె లక్ష్మికూడా తన స్వరూపస్థితి ప్రవృత్తులను అన్నిటినీ భగవదధీనాలుగా కల్గి ఉంటుందనే పరమార్థం వ్యక్తం చేయబడింది. సకలచేతనాచేతనాలు సర్వేశ్వరుని ఆశ్రయించి ఉండగా, దీనినే నిరూపకంగా చేసికొని లక్ష్మిని నిరూపించేటట్లయితే లక్ష్మిలో ఉండే విశేషం ఏమి? అని అంటే, అచ్యుతుని ఆశ్రయించేవారిలో ప్రధానభూత కాబట్టి, వ్యక్తిని ఆశ్రయించి ఉండే జాతివలె స్వరూపనిరూపకభూతయై అతడు (భగవానుడు) ఉండేచోట అంతా వ్యాపించి ఉన్నది కనుక, అంతేకాక–

**కా చాన్యా త్వామృతే దేవి! సర్వయజ్ఞమయం వపుః।**
**అధ్యాస్తే దేవదేవస్య యోగిచింత్యం గదాభృతః॥**

(ఓ దేవీ! గదను ధరించినవాడు, దేవదేవుడును అయిన భగవానునియొక్క యోగులచేత ధ్యానించతగినది, సర్వయజ్ఞమయమైనది అయిన దేహంలో నీవు తప్ప వేఱెవ్వరు ఉన్నారు?) అని విష్ణుపురాణంలో తెలిసినరీతిలో, అతని వక్షఃస్థలంలో వేంచేసి ఉన్నది కనుక ఈమె ఆశ్రయణం అనితరసాధారణం. అందువల్లనే సర్వేశ్వరుని ఆశ్రయిస్తున్నది–అనే దీనిని పురస్కరించుకొని ఈమె నిరూపింపబడుతున్నది.

**(శ్రియమ్) – "శ్రయతే ఇతి శ్రీః"** – (సకలజీవులచేత, ఆశ్రయింపబడుతున్నది కనుక "శ్రీః" అనబడుతున్నది.) అనే వ్యుత్పత్తిచేత నిత్య–ముక్త–బద్ధచేతనులందఱిచేత ఆశ్రయింపబడేది అనే అర్థాన్ని శ్రీ శబ్దం ఇస్తుంది. ఇందువల్ల జగత్తుకు శేషిగా ఉండేది ఒక దివ్యమిథునం–అనే అర్థంకూడా వ్యక్తమౌతున్నది. **"కాంతస్తే పురుషోత్తమః"** అని శ్రీనామంయొక్క మొదటి అర్థాన్ని, **"ఫణిపతిః శయ్యాఽసనం వాహనం వేదాత్మా విహగేశ్వరో యవనికా మాయా జగన్మోహినీ, బ్రహ్మేశాది సురవ్రజః సదయతస్త్వద్దాసదాసేగణః"** అని రెండవ అర్థాన్ని తెలిపి, తరువాత **"శ్రీరిత్యేవ చ నామతే"** అని ఈ రెండు అర్థాలు "శ్రీః" అనే నామంనుండే వచ్చినవి అని శ్రీయామునులు చతుఃశ్లోకి అనే స్తోత్రంలో తెలిపారు.

**(శ్రియమ్)–"శృ–హింసాయామ్"** అనే ధాతువునుండి పుట్టిన శ్రీశబ్దం **"శృణాతి దోషాన్ ఇతి శ్రీః"** అనే వ్యుత్పత్తినిబట్టి ఆశ్రితుల దోషాలను నశింపజేస్తుంది–అనే అర్థాన్ని ఇస్తుంది. **"తేన మైత్రీ భవతు తే"** (రావణా! రామునితో నీకు మైత్రి కలగాలి) అన్నట్లే ఈ చేతనునకు కూడా **"కిమేతత్? నిర్దోషః క ఇహజగతి?"** (ఇది ఏమి? ఈ లోకంలో తప్పు చేయని

అంటే,

**(శ్రియమ్)–"శక్తేరుజ్జ్వలినీ చాస్మి"** (పరమాత్మ వద్ద ఉండే ఇష్ట ప్రాపకత్వ–అనిష్టనివర్తకత్వ శక్తిని ప్రకాశింపచేస్తాను కనుక శ్రీః అనబడుతున్నాను) అని లక్ష్మీతంత్రంలో చెప్పబడ్డ రీతిలో పరమాత్మయొక్క శక్తిని ప్రేరేపించడం ద్వారా వీటిని నిర్వహిస్తాను–అని భావం.

**(శ్రియమ్)**–'శమ్' అనే పదం మంగళాన్ని సూచిస్తుంది కనుక ఆ పదంలోని ఒక భాగం అయిన శకారం పరమమంగళస్వరూపిణి–అనే అర్థాన్ని ఇస్తుంది. **"మంగళం మంగళానామ్"** అని లక్ష్మిని కీర్తిస్తూ శ్రీస్తుతిలో అన్నారు కదా శ్రీవేదాంతదేశికులు. "రతిః" అనే పదం ఆనందమనే అర్థాన్ని ఇస్తుంది కనుక, ఆ పదంలోని మొదటి అక్షరం అయిన రేఫం ఆనందస్వరూప–అనే అర్థాన్ని ఇస్తుంది. "ఈప్సితా" (అందఱిచేత అభిలషింపబడుతున్నది) అనే అర్థాన్ని ఈకారం ఇస్తుంది. అందువల్ల "శ్రీః" అంటే పరమమంగళాకారగా, ఆనందమయిగా, అందఱిచే అభిలషింపబడేదిగా ఉండేది–అని అర్థం. ఈ అర్థాలు అన్నీ–

**శ్రయామి శ్రయణీయాస్మి శక్నోమి రేమి రామి చ।**
**శక్తేరుజ్జ్వలినీ చాస్మి శంతమా రతిరీప్సితా॥**
**ఇతి త్రయ్యంతతత్త్వజ్ఞాః శ్రియం మాం విదురంజసా॥ 50–83**

(పరమాత్మను ఆశ్రయించి ఉన్నాను. మిగిలిన వారికి ఆశ్రయింపతగిన దానినై ఉన్నాను. (ఇష్టప్రాప్తి అనిష్టనివృత్తులను స్వామిచే నిర్వహింపజేయగల) శక్తిని కల్గిన దాననై ఉన్నాను. ఇష్టప్రాప్తిని కల్గిస్తాను. అనిష్టనివృత్తిని చేస్తాను. పరమాత్మశక్తిని ప్రేరేపిస్తాను. మంగళాకారిణిగా, ఆనందమయిగా, అందఱిచే అభిలషింపబడేదానినిగా ఉన్నాను. ఈ కారణాలచే వేదాంతతత్త్వజ్ఞులు నన్ను శ్రీదేవి అని చక్కగా గ్రహిస్తున్నారు) అని లక్ష్మీతంత్రంలో ప్రకటింపబడ్డాయి. "శక్నోమి రేమి" అనే దానికి బదులు **"శక్తిభీ రేమి"** అనే పాఠాంతరం ఉన్నది. నా శక్తులతో ఇష్టప్రాప్తి–అనిష్టనివృత్తులను కల్గిస్తాను–అని దీని భావం.

**అపి నాథో విభూత్యర్ధే త్రైలోక్యం సేశ్వరామరమ్।**
**పరాం మదీయవర్ణస్య కలాం నార్హతి షోడశీమ్॥**
**ఆద్యే పదత్రయే వర్ణాః శ్రీమ్ హ్రీమ్ ఓమితి మన్మయాః।**
**ఏషువైభిశ్చతుర్భిస్తైర్మదీయం ధార్యతే వపుః॥**
**ఏకైకశో ద్విశో వాపి త్రిశో వా సర్వ ఏవ వా।**
**జప్తార్చితహుతధ్యాతాః సాధయేయురభీప్సితమ్॥**
**ప్రయత్నేనైవ గోప్యం తదేతత్ రత్నచతుష్టయమ్।**
**అన్యోన్యఫలితం సర్వైరశేషైరధికం గుణైః॥ 50–86**



**లబ్ధ్వా కృతార్థాః ప్రాప్స్యంతే మామేవానన్యమానసాః॥**

(అందమైన ముఖాన్నికల విష్వక్సేనా! ఆకించన్యాన్నే ఆధారంగాకల కొందఱు భాగ్యశాలులు నా పాదద్వంద్వాన్ని ప్రీతితో–భక్తితో కూడిన మనస్సును కలవారై ఆశ్రయించి, లక్ష్మీదేవిని పురుషకారంగా చేసికొని, నా క్షమకు లక్ష్యభూతులై, నన్నే ప్రాప్య–ప్రాపకాలుగా పొంది కృతార్థులై, ఇక దేనిలోను మనస్సును నిలపకుండా నన్నే పొందుతారు).

**అహం మత్ప్రాప్త్యుపాయో వై సాక్షాల్లక్ష్మీపతిస్స్వయమ్।**
**లక్ష్మీః పురుషకారేణ వల్లభా ప్రాప్తియోగినీ॥**
**ఏతస్యాశ్చ విశేషోఽయం నిగమాంతేషు శబ్ద్యతే॥**

(లక్ష్మీపతి అయిన నేనే సాక్షాత్తు నన్ను పొందడానికి ఉపాయం అవుతున్నాను. నాకు ప్రియమైన లక్ష్మి పురుషకారం ద్వారా నన్ను పొందింపజేస్తుంది. పురుషకారత్వం అనే అతిశయం ఈమెకు వేదాంతాలలో చెప్పబడింది.)

**మత్ప్రాప్తిం ప్రతి జంతూనాం సంసారే పతతామధః।**
**లక్ష్మీః పురుషకారత్వే నిర్దిష్టా పరమర్షిభిః॥**
**మమాపి చ మతంహ్యేతన్నాన్యథా లక్షణం భవేత్॥**

(సంసారంలో అధః పతనాన్ని చెందే జీవులకు నన్ను ఆశ్రయించే విషయంలో లక్ష్మి మహర్షులచేత పురుషకారస్వరూపిణిగా నిర్దేశింపబడింది. నాకుకూడా ఈ పురుషకారత్వమే అభిమతం. వేఱు (ఉపాయత్వం అనే) ఆకారం ఈమెకు లేదు) అని మొదలైన పాంచరాత్రవచనాలు స్మరణీయాలు. లక్ష్మీపురుషకారపూర్వకంగానే భగవదాశ్రయణాన్ని చేయాలి–అనే విషయాన్ని శ్రీ శఠకోపసూరి తమ సహస్రగీతి ప్రబంధంలో–

**అకల కిల్లేన్ ఇఱైయుమెన్ఱు అలర్ మేల్మఙ్గైయుఱైమార్బా!**
**నికరిల్ పుకళాయ్! ఉలకమ్ మూన్ఱుడైయాయ్! ఎన్నై ఆళ్వానే!**
**నికరిల్ అమరర్ మునిక్కణఙ్గళ్ విరుమ్బుమ్ తిరువేఙ్గడత్తానే!**
**పుకలొన్ఱిల్లా అడియేన్ ఉన్నడిక్కీళ్ అమర్న్దు పుకున్దేనే**

(క్షణంకూడా విడిచి ఉండలేను–అని అంటూ పద్మనివాసిని అయిన లక్ష్మి నిత్యనివాసం చేసే వక్షఃస్థలాన్ని కలవాడా! సాటిలేని కల్యాణగుణాలను కలవాడా! ముల్లోకాలకు స్వామీ! నన్ను పాలించినవాడా! సాటిలేని నిత్యసూరులు, మునిగణాలు ఆశపడే వేంకటాచలపతీ! వేఱుగతి దేనినీ లేనివాడనై, దాసుడనైన నేను నీ పాదమూలాన్ని చేరి ఆశ్రయించాను) అని వ్యక్తపఱిచారు. ఈ పరమార్థాన్ని చతుఃశ్లోకిలో యామునులు, గద్యత్రయంలో శ్రీరామానుజులు, శ్రీస్తవంలో శ్రీవత్సాంకులు, శ్రీగుణరత్నకోశంలో పరాశర భట్టర్, శ్రీస్తుతిలో వేదాంతదేశికులు–ఇంకా పలువురు ఆచార్యులు అనుసంధించారు.

ఈమె పురుషకారంతో శ్రీరాముని ఆశ్రయించిన లక్ష్మణుడు, హనుమంతుడు, విభీషణుడు మొదలైనవారు కార్యసిద్ధిని పొందారు. ఈమెను క్రమమార్గంలో ఆశ్రయించనందున శూర్పణఖ ముక్కుచెవులను కోల్పోయింది. ఆమె అన్న రావణుడు శిరచ్ఛేదాన్ని పొందాడు. పైన తెలుపబడ్డ ఆఱు అర్థాలలో కొన్నిటిని వీటివల్ల సిద్ధించే పురుషకారత్వం అనబడే శరణ్యత్వాన్ని –

**శృణోమి కరుణాం వాచం శృణామి దురితం సతామ్।**
**శృణామి చ గుణైర్విశ్వం శరణం చాస్మి శాశ్వతమ్॥**

(దాసుల దీనాలాపాలను వింటాను. వారి పాపాలను హింసిస్తాను. వారి గుణాలను వృద్ధిచేస్తాను. ఈ కారణాలచేత నిత్యం శరణంగా అంటే పురుషకారంగా ఉన్నాను) అని లక్ష్మీతంత్రంలో శ్రీశబ్దార్థాలు అనుసంధింపబడ్డాయి. ఇక శ్రీశబ్దానికి ఉండే మిగిలిన అర్థాలు కూడా ప్రస్తావింపబడుతున్నాయి.

**(శ్రియమ్)**– భగవానునకు శరీరంగా ఉన్నదానిని –అని అర్థం. **"శరీరం చ హరేరస్మి"** (నేను హరికి శరీరంగా ఉన్నాను) అని లక్ష్మీతంత్రంలో ఈ అర్థం ఆదరింపబడింది. దీనివల్ల లక్ష్మి భగవానునకు శరీరవత్ అత్యంతపరతంత్ర అని, **"అన్యశరీరత్వాభావే సతి సర్వశరీరత్వమ్"** (వేఱెవ్వరికి శరీరం కాకుండా ఉండకపోవడంతోపాటు అందఱికీ శరీరంగా కల్గి ఉండడం) అనే పరబ్రహ్మలక్షణం ఈమెకు అన్వయించదు–అని స్ఫుటమవుతున్నది.

**(శ్రియమ్)– "శ్రద్ధయా చేప్సితా సురైః"** (దేవతలచే శ్రద్ధతో పొందాలని ఆశింపబడేదానను. అందువల్లకూడా నేను "శ్రీః" అనబడుతున్నాను) అని లక్ష్మీతంత్రంలో వేరొక అర్థం చూపబడింది. తమ తమ మనోరథాలు నెరవేరడం కోసం లక్ష్మిని పురస్కరించుకొని భగవదాశ్రయణాన్ని చేస్తారు కనుక ఈమె దేవతలు చేత అభిలషింపబడుతున్నది– అని భావం. **"నీఱేఱు శెజ్జడై నీలకణ్డనుమ్ నాన్ముకనుమ్ ముఱైయాల్ శీఱేఱు వాశకమ్ శెయ్యనిన్ఱ తిరుమాల్"** (భస్మధారి, ఎఱ్ఱని జటలను కలవాడు అయిన నీలకంఠుచే, చతుర్ముఖునిచే క్రమపద్ధతిలో గొప్ప వైదికసూక్తులతో అర్చించబడే శ్రియఃపతి) అని భట్టనాథులు.

**"ఎణ్మర్ పది నొరువర్ ఈరఱువర్ ఓరిరువర్**
**వణ్ణమలరేన్ది వైకలుమ్–నణ్ణి**
**ఒరుమాలైయాల్ పరవి ఓవాదు ఎప్పోదుమ్**
**తిరుమాలై క్కైతొళువర్ శెన్ఱు.**

(అష్టవసువులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, అశ్వినీదేవతలు చిత్రవర్ణాలను కల పూలను తీసికొని నిత్యం నమస్కరించి, అద్వితీయమైన పూమాలికలను నిరంతరం సమర్పించి, శ్రియః పతిని చేరి ఎల్లప్పుడు అంజలి ఘటిస్తారు) అని సరోయోగి,



ఈ అర్థాన్ని అనుసంధించారు. లేక, నిత్యసూరుల చేత కొలవబడేది–అనే అర్థాన్నికూడా చెప్పవచ్చు. ఈ అర్థాన్ని **"నికరిల్ అమరల్ మునిక్కణఙ్గళ్ విరుమ్బుమ్ అలర్ మేల్ మఙ్గైయుఱైమార్బా"** (సాటిలేని నిత్యసూరి గణాలు కొలిచే, పద్మనివాసిని వక్షఃస్థలంలో కలవాడా) అని శఠకోపసూరి తెలిపారు.

బద్ధముక్త నిత్యులనబడే త్రివిధ చేతనులచేత, పరమచేతనుడైన సర్వేశ్వరునిచేత శ్రద్ధతో అభిలషింపబడేది–అని కూడా అనవచ్చు. ఐశ్వర్యప్రద అయిన ఈమెను బద్ధచేతనులు కూడా ఆరాధిస్తున్నారు కదా!

**(శ్రియమ్)**– ధ్వని స్వరూపంగా ఉన్నది–అని కూడా అర్థం. ధ్వని–ఉదరం మూలభాగం నుండి వెలువడేటపుడు **"శాంతా"** అనే పేరును కల్గినదై ఉంటుంది. అది శ్రీశబ్దంలో ఉండే శకారంయొక్క అర్థం. నాభిదేశం నుండి వచ్చేటపుడు **"పశ్యా" "రంతీ"** అనే నామాలను కల్గినది. ఇది శకారానికి, రేఫకు, ఈకారానికి అర్థం. మధ్యస్థాన మనబడే కంఠదేశంనుండి వచ్చేటపుడు **"ప్రేరణీ"** అనే పేరును కల్గి ఉంటుంది. ఇది రేఫకు, ఈకారానికి అర్థం. చివరగా ధ్వని నోటినుండి వెలువడేటపుడు **"సృష్టి"** అనే పేరును పొందినదై ఉంటుంది. ఇది ఇకారానికి అర్థమై ఉంటుంది. ఈ అర్థాలన్నీ అక్షరసామ్యాలనుబట్టి చెప్పబడ్డాయి. ఈ విధంగా శకారం, రేఫం, ఈకారం–అనే వీటికి విషయమై, నాలుగు స్థానాలలో శాంతా, పశ్యాది నామాలను కల ధ్వనిస్వరూపంగా ఉంటుంది కనుక "శ్రీః" అనే పేరుతో పిలువబడుతున్నది–అని భావం. ఈ విషయాలన్నీ

**శాంతాధారపదస్థాస్మి పశ్యా రంతీ చ నాభిజా।**
**ప్రేరణీ చ ధియాం మధ్యా సృష్టిః వక్త్రే తథార్ణసామ్॥**
**చతుః స్థానస్థితా చైవం శాంతాపశ్యాదిభేదినీ॥ 50–82**

(ఆధారస్థానంలో శాంత అనే పేరుతో ఉంటాను. నాభినుండి పుట్టేటపుడు పశ్యా, రంతీ అనబడుతున్నాను. మధ్యస్థానంలో జ్ఞానానికి ప్రేరణిగా, నోటినుండి సృష్టిగాను ఉన్నాను. ఈ విధంగా శాంతా, పశ్యాది భేదాలతో నాల్గుస్థానాలలో ఉండే ధ్వనిగా ఉన్నందున "శ్రీః" అనబడుతున్నాను) అని లక్ష్మీతంత్రంలో చెప్పబడ్డాయి.

**(శ్రియమ్)–"శక్నోమి"** (దాసుల ఇష్టప్రాప్తి–అనిష్టనివృత్తులను చేయడంలో శక్తిని కల్గిన దానిని అవుతున్నాను) అనే అర్థాన్ని ఇస్తుంది శకారం. శక్తి మాత్రమే కాదు ప్రాప్తి కూడా (సంబంధంకూడా) ఉన్నదనే విషయాన్ని తెలుపుతున్నది రకారం. "రి–హింసాయామ్" అనే ధాతువునుండి పుట్టిన రకారం దాసుల అనిష్టాలను పోగొడుతున్నదనే అర్థాన్ని, 'రా–దానే' అనే ధాతువునుండి ఉత్పన్నమైనపుడు ఆశ్రితుల ఇష్టాలను అనుగ్రహిస్తున్నది–అనే అర్థాన్ని రేఫం ఇస్తున్నది. ఈ విధంగా, ఇష్టప్రాప్తి–అనిష్ట నివృత్తులను నిర్వహించే శక్తిని, ప్రాప్తిని కల్గినది అని చెప్పినట్లయింది. వీటిని తాను నేరుగా చేస్తుందా? అని

**(దేవీ)–"దివు–విజిగీషా"** అనే ధాతువునుండి పుట్టిన శబ్దంగా దీనిని గ్రహించినపుడు, అందఱినీ "జితంతే" అనేటట్లు పరాజితులను చేస్తాడు కనుక భగవానుడు దేవుడనబడు తున్నాడు. అతనివద్ద జితులు కావడానికి ముందు, పురుషకారభూత అయిన ఈ లక్ష్మీదేవి గుణాలకు భక్తులు మునుముందుగా వశులు అవుతున్నారు. కనుక, అతనివద్ద వారు పరాజితులు అయేటట్లు చేసేది ఈమె కనుక, ఈమె దేవీశబ్దవాచ్యురాలు.

**(దేవీ)–"దివు–వ్యవహారే"** అనే ధాతువునుబట్టి వేదం మొదలైన శాస్త్రాలలో మొట్టమొదటగా అతడు వ్యవహరింపబడినవాడు కనుక భగవానుడు దేవుడు. "మఱై యురైత్త తిరుమాల్" (వేదం వివరించిన శ్రియఃపతి) అని పరకాలసూరిసూక్తి ప్రకారం అందులోను ఈ లక్ష్మికి ప్రేరకత్వం ద్వారా అన్వయం ఉన్నది కనుక, లక్ష్మీతంత్రాదులను తానే సాక్షాత్తు వ్యవహరించడంవల్ల ఈమె "దేవీ" అనబడుతున్నది.

**(దేవీ)–"దివు–ద్యుతి"** అనే ధాతువును బట్టి, "తమేవ భాంతమనుభాతి సర్వమ్, తస్య భాసా సర్వమిదం విభాతి" (ప్రకాశించే అతనినిబట్టే అన్ని వస్తువులు అనుసరించి ప్రకాశిస్తున్నాయి. అతని కాంతిచే ఇవి అన్నీ ప్రకాశిస్తున్నాయి) అని, **"నారాయణపరో జ్యోతిః"** అని చెప్పే రీతిలో జ్యోతిస్స్వరూపుడైన భగవానుడు దేవుడనబడుతున్నాడు.

"వడివాయ్ నిన్ వలమార్బినిల్ వాళ్కిన్ఱ మఙ్గై" (నీ వక్షఃస్థలంలో కుడివైపు ప్రకాశించే లక్ష్మి) అని, "తికళ్కిన్ఱ తిరుమార్బిల్ తిరుమఙ్గైతన్నోడుమ్ తికళ్ కిన్ఱ తిరుమాలార్" (ప్రకాశించే వక్షస్సులో శ్రీదేవితో ప్రకాశిస్తున్న శ్రియఃపతి) అని దివ్యసూరులు, **"అప్రమేయం హి తత్తేజః యస్య సా జనకాత్మజా"** (జనకుని కుమార్తె అయిన సీతాదేవి ఎవరికి చెందినదో ఆ శ్రీరాముని తేజస్సు ఇంత అని కొలువ సాధ్యం కానిది) అని శ్రీరామాయణం తెల్పిన రీతిలో అతనికి కూడా ప్రకాశాన్ని కల్గించే ఈమె దేవీశబ్దవాచ్యురాలు. "భాస్కరేణ ప్రభా యథా" (సూర్యుని విడచి ఉండని కాంతివలె) అని కదా ఈమె చెప్పబడుతున్నది.

**(దేవీ)**–"దివు–స్తుతి"–స్తుతింపబడేవాడు దేవుడనబడుతున్నాడు. ఎవరిని స్తుతించినా భగవానుని స్తుతించినట్లే అవుతుంది. ఆ భగవానునకు నిరూపక కాబట్టి భగవానుని స్తుతిస్తే ఈమె కూడా స్తుతింపబడినట్లే అవుతుంది. అందువల్ల ఈమె "దేవీ" అనబడుతున్నది.

**"ఓదువార్ ఓత్తెల్లామ్ ఎవ్వులకుత్తు ఎవ్వైయుమ్**
**శాదువాయ్ నిన్ పుకళిన్ తకైయల్లాల్ పిఱిదిల్లై**
**పోదువాళ్ పునన్తుళాయ్ ముడినాయ్ పూవిన్మేల్**
**మాదువాళ్ మార్బినాయ్"**

(సమస్త లోకాలలో ఉండే పలువిధాలైన, అధ్యయనం చేయబడే వేదాలన్నీ మంగళప్రదాలైన నీ గుణాలను స్పృశించడం మాత్రమే చేయగల్గుతున్నాయి తప్ప,



(నా విభూతులను తెలిపే మంత్రాలలో ప్రధానమైన "లక్ష్మీః" అనే మంత్రం, దేవతలను, దేవతానాయకులను కల మూడు లోకాలు కూడా నా "శ్రీః" అనే వర్ణంలో పదహారు భాగాలలో ఒక భాగానికి కూడా సరికావు. పూర్వకాలంలో పుట్టిన "శ్రీమ్, హ్రీమ్, ఓమ్"–అనే మూడు పదాలు నన్ను విషయంగా కల్గినవి. ఈ మూడిటిలోను, **"అశ్వపూర్వా, రథమధ్యా, హస్తినాదప్రబోధినీ, శ్రీః"**–అనే ఈ నాల్గు నామాలలోను నా రూపం ధరింపబడుతున్నది. ఈ నాల్గు తిరునామాలలో ఒక్కొక్కటిగా అయినా, రెండు రెండుగా అయినా, మూడు మూడుగా అయినా, నాలుగు చేర్చి అయినా జపం చేయబడినా, అర్చింపబడినా, హోమం చేయబడినా ఇష్టప్రాప్తి కల్గుతుంది. ఒకదానితో వేఱొకటి కలిసి ఫలాన్ని ఇచ్చేవి, అన్ని గుణాలతో నిండినవి, నాల్గు రత్నాలవంటివి అయిన ఈ నాల్గు నామాలు ప్రయత్నపూర్వకం అనధికారిచెవిలో పడకుండా రక్షింపబడతగినవి) అని అంటూ లక్ష్మియొక్క స్వరూపరూపగుణవిభూతులను అన్నిటినీ సుస్పష్టంగా తెలిపే శ్రీ శబ్దంయొక్క మహిమను, **"అశ్వపూర్వామ్"** అనే నామంనుండి **"శ్రియమ్"** అనే నామంవరకు గల నాల్గునామాల గౌరవం లక్ష్మీతంత్రంలో సుస్పష్టం చేయబడింది.

"ఏషువైభిః" అన్నపుడు "ఏషవైభిః" అనే పాఠాంతరం ఉన్నది. **"శ్రీమ్, హ్రీమ్, ఓమ్, ఓమ్ శ్రియై నమః"** అనే నాల్గుమంత్రాలు నన్ను అర్థంగా కల్గినవి. వీటిలో నా మంత్రార్థం అయిన రూపం ధరింపబడుతున్నది–అని దీని భావం.

**(శ్రియం దేవీముపహ్వయే)**–శ్రీదేవిని సమీపంలోనికి ఆహ్వానిస్తున్నాను. ఎందుకు? అని అంటే,

**(శ్రీర్మాదేవీ జుషతామ్)**–"మా" అని, "దేవీ" అని పేర్లను కల లక్ష్మి నా పట్ల ప్రీతిని పొందుగాక! అందుకోసమే నేను ఆహ్వానిస్తున్నాను–అని భావం.

**(మా)**–ఇది లక్ష్మియొక్క ప్రసిద్ధం అయిన తిరునామాలలో ఒకటి. దీని అర్థాలనుగూర్చి సంగ్రహంగా తెలుపబడుతున్నది.

**(మా)**–ఇరవై అయిదవ తత్త్వం కనుక, ఇరవై అయిదవ అక్షరం అయిన మకారం చేత చెప్పబడే జీవులందఱికి స్వామినిగా ఉన్నా, తాను తన పారతంత్ర్యస్వరూపానికి తగినట్లుగా మకారవాచ్యయై, జీవకోటిలోనికి అంతర్భవిస్తుంది. ఓంకారంలో ఉండే అకార–ఉకార–మకారాలనే మూడు అక్షరాలతో అన్వయాన్ని కల్గినది లక్ష్మీదేవి. అకారం చేత చెప్పబడే భగవానునకు స్వరూపనిరూపక కనుక అకారంచేతకూడ ఈమె చెప్పబడుతున్నది. "భగవానుని వక్షఃస్థలాన్ని విడిచి ఉన్నపుడు కదా ఈమె అకారాన్ని విడచి ఉంటుంది" అని భగవత్సేనామిశ్రులనే పెద్దల సూక్తి.

**ఉద్ధృతా విష్ణునా లక్ష్మీరుకారేణోచ్యతే సదా**

(భగవానునిచే ఎల్లప్పుడు వక్షఃస్థలంలో ఉద్ధరింపబడే లక్ష్మి ఉకారంచేత

చెప్పబడుతున్నది) అనే శ్రుతి వాక్యానుసారం ఉకారంచేతకూడా ఈమె చెప్పబడుతున్నది. జీవకోటిలో చేరినది కనుక మకారార్థ భూతురాలై ఉన్నది. "భర్త యొక్క పడుకను, బిడ్డ పరుండిన తొట్టిని విడువకుండా ఉండే తల్లివలె మొదటి, చివరి పదాలను (అకార-మకారాలను) విడువకుండా లక్ష్మి ఉంటుంది" అనే శ్రీలోకాచార్యులసూక్తి ఇక్కడ స్మరణీయం.

**(మా) "మాఙ్-మానే", "మా-మానే"** అనే ధాతువుల నుండి పుట్టిన మకారం అన్నిటినీ కొలిచేది, అంటే, వ్యాపించి ఉండేది, అని, ప్రమాణాలచేత కొలువబడేది అని, ప్రళయకాలంలో లోకాన్ని అంతటినీ తనలో ఇముడ్చుకొన్నది-అనే అర్థాలను ఇస్తుంది.

**మిమే మీయేఽఖిలైర్మానైర్మయి మాతి జగత్ క్షయే.**

(అన్నిటినీ కొలుస్తాను. అన్ని ప్రమాణాలచేత కొలువబడతాను, ప్రళయకాలంలో లోకం నాలో లయిస్తున్నది) అనే లక్ష్మీతంత్రవచనం అనుసంధేయం.

**(మా)**-"మన-జ్ఞానే" అనే ధాతువునుండి పుట్టిన మకారం జ్ఞానాన్ని స్వరూపంగాను, గుణంగాను కల జీవులను, సర్వేశ్వరుని తెలుపుతుంది. వీరిని అందటినీ తన వశంలో కల్గినది కనుక, "మా" అని అనబడుతున్నదని చెప్పాలి. జీవులు లక్ష్మికి సహజంగానే శేషభూతులు కనుక, పరమపురుషుడు ఆమెకు ప్రేమపరతంత్రుడు కనుక, ఈమెకు చేతనులలో, పరమచేతనుడైన భగవానునితో తేడాలేకుండా అందఱు వశులే కదా!.

**(మా)**-"మాఙ్-మానే" అనే ధాతువునుండి పుట్టిన మకారం అన్నిటినీ కొలుస్తుంది అనే అర్థం ఇస్తుంది కనుక, అన్నిటినీ వ్యాపించి ఉంటుందనే తాత్పర్యార్థం దీనివల్ల సిద్ధిస్తుంది. "స్రజా" అనే పదవివరణం ఇక్కడ అనుసంధేయం.

**(మా)**-మకారంచేత, మచ్ఛబ్దంచేత చెప్పబడే ఆత్మస్వరూపాన్నివలె, ప్రతి ఒక్కరిచేత చాలా ఎక్కువగా ఆరాధింపబడడంచేత ఈమె 'మా' అనబడుతున్నదనే అర్థం కూడా చెప్పవచ్చు.

**ఆత్మేశ్వరవతీ చాహం వ్యాప్తాయాం మయి మేతి ధీః। 50-88**
**ఆత్మవచ్చేప్సితాత్యర్థమతో మాం మద్విదో విధుః॥**

(ఆత్మవర్గాలను, ఈశ్వరుని (లేక, ఆత్మేశ్వరుడైన భగవానుని) కల్గినదాననై ఉన్నాను. సర్వస్వామిని కనుక నన్ను "మా" అని అంటున్నారు. అందఱిచేత తమవలె అభిలషింపబడుతున్నాను. అందువల్ల నన్ను తెలిసినవారు నన్ను "మా" అని అంటున్నారు) అని లక్ష్మీతంత్రంలో ఈ మూడు అర్థాలు ఆదరింపబడ్డాయి.

**పంచాక్షరో హ్యయం మంత్రః సర్వకామఫలప్రదః।**

(ఓమ్ మాయై నమః-అనే అయిదు అక్షరాలనుకల ఈ మంత్రం అన్ని కోరికలను అనుగ్రహిస్తుంది) అని మంత్రవైభవం కూడా తెలుపబడింది.

**(మా జుషతామ్)** నన్ను పొందుగాక- అనే అర్థం శ్రీసూక్తభాష్యంలో తెలుపబడింది.



**(దేవీ)**-దేవుని పత్ని. "దివు-క్రీడా, విజిగీషా, వ్యవహార, ద్యుతి, స్తుతి, మోద, మద, స్వప్న, కాంతి, గతిషు" -అని ధాతుపాఠం.

**(దేవీ)**-"దివు-క్రీడా" అనే ధాత్వర్థాన్నిబట్టి లోకాలను అన్నిటినీ సృష్టించడం, లయం చేయడం అనేవానిని లీలగా కల్గినవాడు దేవుడు. ఆ లీల అనే సృష్ట్యాదియజ్ఞంలో అతనితో కలసి అన్వయించి, అనుభవించే పత్ని కనుక ఈమె దేవి అయినది.

**ఉలకుమ్ ఉలకిఱన్ద ఊఴియుమ్ ఒణ్కేళ్**
**విలకు కరుమ్ కడలుమ్వెఱ్పుమ్-ఉలకినిల్**
**శెన్దీయుమ్ మారుతముమ్ వానుమ్ తిరుమాల్ తన్**
**పున్దియలాయ పుణర్ప్పు**

(లోకాలు, లోకాలు లయం అయేటపుడు ఉండే కాలం, అందమైన వర్ణాన్ని, అలలను కల్గిన నల్లని సముద్రం, లోకాలకు ఆధారాలైన పర్వతాలు, లోకంలో కన్పించే ఎఱ్ఱని అగ్ని, గాలి, ఆకాశం-ఇవన్నీ శ్రియఃపతియొక్క సంకల్పంచేత ఏర్పడిన సృష్టి) అని సరోయోగి పల్కిన రీతిలో లక్ష్మిచే ప్రేరేపింపబడినవాడై సర్వేశ్వరుడు సృష్ట్యాదుల సంకల్పాలను చేస్తాడు కనుక,

**స్వస్తిశ్రీర్దిశతాదశేషజగతాం సర్గోపసర్గస్థితీః**
**స్వర్గం దుర్గతిమాపవర్గికపదం సర్వం చ కుర్వన్ హరిః।**
**యస్యా వీక్ష్య ముఖం తదింగితపరాధీనో విధత్తేఽఖిలం**
**క్రీడేయం ఖలు నాన్యథాస్య రసదా స్యాదైకరస్యాత్తయా॥ (1)**

(లోకాలను అన్నిటిని సృష్టించడం, రక్షించడం, లయం చేయడం, స్వర్గనరకాలను, మోక్షాలను అనుగ్రహించడం అనే వీటిని చేసేటపుడు భగవంతుడు ఎవరి ముఖాన్ని చూస్తూ అందలి హావభావాలకు వశుడై, అన్నికార్యాలను చేస్తున్నాడో, ఆ లక్ష్మి మనకు మంగళాలను అనుగ్రహించుగాక! భగవానుడు ఆమెతో ఒకే అభిప్రాయాన్ని కల్గినవాడు కావడం వల్ల, ఆమె ఇంగితాలకు పరాధీనుడై కార్యాలను చేయకపోతే, అవి అతనికి ఆనందాన్ని కల్గించవు) అని శ్రీస్తవంలో శ్రీవత్సాంకమిశ్రులు,

**శ్రియై సమస్తచిదచిద్విధానవ్యసనం హరేః।**
**అంగీకారిభిరాలోకైః, సార్థయంత్యై కృతోఽంజలిః॥**

(సకలచేతనాచేతనాలను సృష్టించడంలో భగవానునకు కలిగే శ్రమను తన అంగీకారాన్ని చూపే కటాక్షాలతో సఫలం చేసే లక్ష్మికి అంజలి చేయబడింది) అని శ్రీగుణరత్నకోశంలో పరాశరభట్టర్ పల్కినరీతిలో జగత్సృష్ట్యాది లీలలో లక్ష్మికూడా భోక్తగా అన్వయిస్తున్నందువల్ల ఈమె "దేవీ"-జగత్సృష్ట్యాదులను లీలగా కల్గినది- అనే పేరు పొందింది.

(జటామండలాలను ధరించి ఉండే బ్రహ్మరూపాన్ని దాల్చిన నేను వేదాన్ని అనుసంధిస్తూ పలురీతులలోని భూతాలను అన్నిటిని సృష్టిస్తున్నాను. ఈ నాల్గు అర్థాలను గ్రహించి వేదపారగులైన మునులు నన్ను "కా" అని అన్నారు. అయిదు అక్షరాలను కల్గిన **"ఓమ్ కాయై నమః"** అనే ఈ మంత్రం వేదాధ్యయనఫలాన్ని ఇస్తుంది) అని తంత్రంలో ఆదరింపబడింది, మంత్రంయొక్క గొప్పతనం తెలుపబడిందికూడా.

"కా"అనే పేరు అన్ని వేదాలచేత అధ్యయనం చేయబడుతున్నది -అనే అర్థాన్ని కల్గినది అని పూర్వం నిరూపింపబడింది. లక్ష్మిని తెలిపే వేదవాక్యాలు కొన్ని మాత్రమే ఉన్నపుడు "అన్ని వేదాలచేత అధ్యయనం చేయబడుతున్నది" అని అనడం పొసగుతుందా? అని సందేహం కలుగగా, దానికి సమాధానాన్ని తరువాతి ఈ నామం తెలుపుతున్నది.

**(సోస్మితామ్)– "య ఏషోఽంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశః ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః. తస్య యథా కప్యాసం పుండరీకమేవమక్షిణీ తస్య ఉదితి నామ"** (ఛాందో. 1-6-7)

(సూర్యుని నడుమ బంగారంవలె అందమైన రూపాన్నికల ఏ ఈ పరమపురుషుడు కనబడుతున్నాడో, అతడు బంగారంవంటి అందమైన మీసాలను, కేశాలను, అన్ని అవయవాలను కలవాడు. అతనికి సూర్యునివల్ల వికసించిన తామరలవంటి రెండు కన్నులున్నాయి. అతనికి "ఉత్" అని పేరు) అనే రీతిలో "ఉత్" అనేది పుండరీకాక్షుడై, ఉత్తమపురుషుడైన పరబ్రహ్మయొక్క తిరునామం. "అస్మితా" అని ఉండవలసినది "స్మితా" అని మొదటి వర్ణలోపంతో ఏర్పడింది. "అస్మితా" అంటే గొప్పతనం. అందువల్ల "ఉత్" అనే పరమపురుషుని గొప్పతనాన్ని "ఉత్ స్మితా" అనే పదం సూచిస్తున్నది. వేదం కనుక తకారం లోపించి, ఈ పదం "ఉస్మితా" అని అయినది. **"ఉస్మితయా సహవర్తతే ఇతి సోస్మితా"** (ఉస్మిత అనే పరబ్రహ్మయొక్క గొప్పతనంతో పాటు (దానికి కారణభూతమై) ఉంటున్నది కనుక "సోస్మితా" అని లక్ష్మి అనబడుతున్నది) అన్నది "సోస్మితా" అనే శబ్దంయొక్క వ్యుత్పత్తి. భగవానుని "అస్మిత" (పరబ్రహ్మగా ఉండే స్వభావం) ఏ విధంగా అతనికి అంతరంగనిరూపకమో, ఆ విధంగానే ఈ పిరాట్టి కూడా అతనికి అంతరంగనిరూపకభూతగా ఉంటూ, అతని 'అస్మిత' అనే పరబ్రహ్మత్వానికి కూడా కారణమై ఉంటుంది-అన్నది "సోస్మితా" అనే తిరునామంయొక్క పిండితార్థం. ఈ విధంగా భగవానునకు నిరూపకభూతగా ఉంటుంది కనుక అతనిని చెప్పినచోట అంతా ఈమెను కూడా చెప్పినట్లే అవుతుంది. అందుచేత, **"వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః"** (అన్నివేదాల చేత నేనే తెలియబడతగినవాడను) అని **"సర్వే వేదాః....కృష్ణః"** అని, **"మఱైయాయ నాల్ వేదత్తుళ్ నిన్ఱమలర్ చ్చుడరే"** (భగవద్విరోధులకు ఆ స్వామి తత్త్వాన్ని తెలియకుండా మఱుగుపఱచే నాల్గువేదాలలో నిగూఢం ఉండే ప్రకాశించే జ్యోతిస్స్వరూపా) అని, **"నాన్ మఱైకళ్ తేడి ఓడుమ్ శెల్వన్"** (నాల్గువేదాలు అన్వేషించి కనుగొనలేక పరుగుతీసే



అంతకంటె ఏమీ లేదు. స్వస్థానంలో ఏపుగా పెరిగిన, అందమైన తులసిచేత కూర్చబడ్డ మాలెలను కల కిరీటాన్ని ధరించిన స్వామీ! పద్మనివాసిని అయిన లక్ష్మి నిత్యనివాసం చేసే వక్షఃస్థలాన్ని కలవాడా!) అని శఠకోపసూరి ఈ అర్థాన్ని పలికారు.

**(దేవీ)-"దివు-మోద"** అనే ధాతువును బట్టి ఆనందమయుడైన భగవానుడు దేవుడు, ఆనందమయి అయిన ఈమె దేవి.

**(దేవీ)-"దివు-మద"** అనే ధాతువునుబట్టి, **"అవాకీ అనాదరః"** (ఏ మాట పలుకడు, ఎవరి విషయంలోను ఆదరం లేనివాడు) అని అన్నట్లు మదాన్ని పొందినవాడు భగవానుడు. **"త్వం నీచశశవత్ స్మృతః"** (నీచుడవైన రావణా! నీవు నీచమైన కుందేలువంటివాడవు) **"తృణమంతరతః కృత్వా"** (గడ్డిపోచను మధ్యలో పెట్టుకొని) అనేటట్లు మదాన్నిపొందినదై ఈమె ఉన్నది కనుక దేవి అనబడుతున్నది.

**(దేవీ)**-"దివు-కాంతి" అనే ధాతువునుబట్టి లోకానికి అంతటికీ ప్రియుడు భగవానుడు కనుక దేవుడు. ఆ స్వామికికూడా వల్లభ అయిన ఈమె దేవి అనబడుతున్నది. **"లోకాభిరామం రామమ్"** అనబడేవాడతడు. **"రామస్య చ మనః కాంతా"** అని అనబడేది ఈమె. **"శ్రియఃకాంతః"** అని, **"పురుషోత్తమస్తే కాంతః"** అని చెప్పబడేవాడు భగవానుడు. **"అరవిందలోచనమనఃకాంతా"** అనబడేది ఈమె.

**(దేవీ)-"దివు-గతి"** అనే ధాతువును బట్టి, **"శరణం గతిర్నారాయణః", "నారాయణం పరాయణమ్"** అని చెప్పినట్లు ప్రాప్యప్రాపకభూతుడై ఉండేవాడు భగవానుడు. ఆ రెండు దశలలోను స్వామితో అన్వయాన్ని కల లక్ష్మి "దేవీ" అనబడుతున్నది. **"తరుమవరుమ్ పయనాయతిరుమకళార్ తనికేళ్వన్"** (అరుదైన ఫలం అయిన లక్ష్మీవల్లభుడు) అని చెప్పిన రీతిలో పురుషకారభూతగాను, **"కోలమలర్ప్పావైక్కు అన్బాకియ ఎన్ అన్బేయో"** (అందమైన లక్ష్మీదేవికి ప్రియుడవైన నా ప్రేమ స్వరూపా!) అని అన్నట్లు భోగదశలో భోగాన్ని అభివృద్ధి చేసేదిగా ఈమె అన్వయిస్తుంది. అందువల్ల **"దివ్యో దేవ ఏకో నారాయణః " సాక్షాద్దేవః పురాణోఽసౌ"** (పురాతనుడైన ఇతడే నిరుపాధిక దేవుడు) అని అన్నట్లు అతనివలె ఈమె కూడా దేవి-అని పొగడతగినది-అని నిరూపింపబడింది. నిజానికి **"శ్రద్ధయా దేవో దేవత్వమశ్నుతే"** (శ్రద్ధాశబ్దవాచ్యురాలైన లక్ష్మిచేత దేవుడు దేవత్వాన్ని పొందుతున్నాడు) అనేటట్లు అతడు దేవుడు కావడం కూడా దేవి అయిన ఈమె వల్లనే కదా!

**(దేవీ)**-"దా" ధాతువు, "అవ-రక్షణే" అనే ధాతువు కలిసి "దేవీ" అనే పదం ఉత్పన్నమైనదని భావిస్తే, అన్ని కోరికలను అనుగ్రహించేది, అన్ని కర్మలను రక్షించేది అనే అర్థాన్ని చెప్పవచ్చు. ఈ అర్థం, ఈ మంత్రం యొక్క మహిమ.

**ప్రదాత్రీ సర్వకామానామవిత్రీ సర్వకర్మణామ్।**

**దేవస్య దయితా చాస్మి దేవీం మాం మునయో విదుః॥**
**పంచాక్షరో హ్యయం మంత్రో భుక్తిముక్తిఫలప్రదః॥** 50-90

(అన్ని కామాలను అనుగ్రహించేదానను, అన్ని కర్మలను రక్షించేదానను, సహజంగానే దేవుడై ఉండేవానికి పత్నిగా ఉండేదానను కాబట్టి నన్ను మునులు "దేవీ" అని తెలిసికొంటారు. **"ఓమ్ దేవ్యై నమః"** అనే అయిదు అక్షరాలనుకల ఈ మంత్రం భోగమోక్షరూపఫలాలను ఇస్తుంది) అని లక్ష్మీతంత్రంలో ప్రకటించబడింది.

**4. కాం సోస్మితాం హిరణ్యప్రాకారామార్ద్రాం జ్వలంతీం తృప్తాం తర్పయంతీమ్।**
**పద్మేస్థితాం పద్మవర్ణాం త్వామిహోపహ్వయే శ్రియమ్॥ 4**

**ప్రతిపదార్థము :** కామ్=శబ్దించేదానవుగాను, సోస్మితామ్=బ్రహ్మయొక్క గొప్పతనానికి కారణమై ఉండేదానవుగాను, హిరణ్యప్రాకారామ్=అందమైన స్వభావాన్ని కల్గినదానవుగాను, ఆర్ద్రామ్=ఆర్ద్రమైన అంటే, దయతో కూడిన మనస్సును కల్గినదానవుగాను, జ్వలంతీమ్=ప్రకాశించేదానవుగాను, తృప్తామ్=నిత్య తృప్తిని కల్గినదానవుగాను, పద్మేస్థితామ్=తామర పూవులో నిలచి ఉన్నదానవుగాను, పద్మవర్ణామ్= తామరవంటి వర్ణాన్ని కల్గినదానవుగాను ఉండే, శ్రియం త్వామ్=శ్రీదేవి అయిన నిన్ను, ఇహ= ఇక్కడకు, ఉపహ్వయే= ఆహ్వానిస్తున్నాను.

**భావము :** గతమంత్రంలో ఆహ్వానింపబడ్డ లక్ష్మి ఆవిర్భవించగా, తన సమీపంలోనే వేంచేసి ఉండాలని ఈ మంత్రంలో వేదపురుషుడు ఆమెను ప్రార్థిస్తున్నాడు.

**(కామ్)**– "కై-శబ్దే" అనే ధాతువునుండి పుట్టిన ఈ శబ్దానికి శబ్దించేది అని, అన్ని వేదాలచేత శబ్దింపబడేది చెప్పబడేది అని అర్థాన్ని గ్రహించవచ్చు. "క" అనే అక్షరం సుఖాన్ని సూచిస్తుంది కనుక జ్ఞానాన్ని స్వరూపంగా కల్గినది, జీవేశ్వరులకు సుఖాన్ని ఇచ్చేది అనే అర్థాలను గ్రహించవచ్చు.

**"ప్రియా తు సీతా రామస్య దారాః పితృకృతా ఇతి।**
**గుణాద్రూపగుణాచ్చాపి ప్రీతిర్భూయోఽభ్యవర్ధత॥**

(తండ్రిచేత పెండ్లి చేయించబడిన భార్య అనే కారణంచేతనే సీత రామునకు ప్రియమై ఉన్నది. సీతయొక్క ఆత్మగుణాలచేత, రూపగుణాలచేత ఆ ప్రేమ ఇంకా వృద్ధి అయినది) అని, **"నమామి భార్గవీం ఖ్యాతిం సుఖాం సౌమ్యాం సుఖప్రదామ్"** (భృగుపుత్రిక, ఖ్యాతి అనబడేది, సుఖరూపిణి, అందమైనది, సుఖాన్ని ప్రసాదించేది అయిన లక్ష్మికి నమస్కరిస్తున్నాను) అని ఉద్ఘోషింపబడింది కదా! అన్ని జీవరాసులచేత, "కా" (ఎవరు?) అని అన్వేషింపబడేది కనుక "కా" అని లక్ష్మి అనబడుతున్నది-అని గ్రహించవచ్చు. "కతమా కా యా సా సత్యా" (తై.ఉప.2-21) అని తైత్తిరీయోపనిషత్తులో కూడ ఈ లక్ష్మీదేవి కీర్తింపబడింది కదా! ఈ మూడు అర్థాలుకూడా–



**శబ్దాయే సర్వభూతానామంతస్థా చిన్మయీ సదా, కాయే చ నిఖిలైర్వేదైరన్విష్యే కేతి చాఖిలైః"** (జ్ఞానానందమయియై అన్ని భూతాలలోను ఉంటూ, ఎల్లప్పుడూ నేను శబ్దిస్తూ ఉంటాను. అన్ని వేదాలచేత శబ్దింపబడతాను "కా" అని అందఱిచేత అన్వేషింపబడతాను) అని లక్ష్మీతంత్రంలో ఆదరింపబడ్డాయి.

**(కామ్)– "క ఇతి బ్రహ్మణో నామ"** (హరివంశం) ('క' అనేది బ్రహ్మయొక్క నామం) అనే రీతిలో కకారవాచ్యుడైన బ్రహ్మలో ఉంటూ, వేదాలను శబ్దిస్తూ, పలువిధాలైన లోకాలను సృష్టిస్తుంది-అని కూడా చెప్పవచ్చు. శాంతాపశ్యాదిధ్వనిస్వరూపిణియై ఉండేది లక్ష్మీదేవియే అని పూర్వం నిరూపింపబడినందువల్ల, **"అర్థో విష్ణురియం వాణీ"** (భగవానుడు అర్థం, ఈమె శబ్దం) అని విష్ణుపురాణంలో కూడా లక్ష్మీదేవి శబ్దస్వరూపిణిగా చెప్పబడినందువల్ల, వేదశబ్దంగా కూడా ఉండేది లక్ష్మీదేవియే అని గ్రహించడంలో లోటు లేదు.

**నామరూపం చ భూతానాం కృత్యానాం చ ప్రపంచనమ్।**
**వేదశబ్దేభ్య ఏవాదౌ దేవాదీనాం చకార సః॥**

(ఆ ప్రజాపతి దేవాదిజీవరాసుల నామాలను, రూపాలను కర్మస్వరూప వివరణాన్ని వేదశబ్దాలను బట్టే చేశాడు) అని చెప్పబడినందువల్ల వేదశబ్దస్వరూపిణి అయిన లక్ష్మిచేతనే బ్రహ్మచేసే సృష్టి కార్యం నడుస్తున్నది అన్నది పొసగుతుంది. లేక, **"బ్రహ్మా నారాయణః"** అని వేదాలచేత,

**మద్రూపమాస్థాయ సృజత్యజో యః**
**స్థితౌ చ యోఽసౌ పురుషస్వరూపే।**
**రుద్రస్వరూపేణ చ యోత్తి విశ్వం**
**తత్తే తథానంతవపుస్సమస్తమ్॥**

(జన్మరహితుడైన ఎవడు బ్రహ్మ అయిన నా రూపాన్ని గ్రహించి లోకాన్ని సృష్టిస్తున్నాడో, పురుషుడనే తన రూపాన్ని గ్రహించి రక్షిస్తున్నాడో, రుద్రరూపంతో లయం చేస్తున్నాడో, అతడు అంతులేని రూపాలతో అన్నిటినీ ధరిస్తున్నాడు) అని విష్ణుపురాణంలోను,

**"అరన్ అయనెన ఉలకళిత్తు అమైత్తుళనే"** (రుద్రుడు, బ్రహ్మలరూపంలో లోకాలను నశింపజేసి, సృష్టిస్తాడు) (శఠకోపసహస్రం-1-1-8) అని ఆళ్వార్ల చేత కీర్తింపబడిన పరమాత్మయొక్క సంకల్పంచేత చెప్పబడుతున్నదని గ్రహించవచ్చు. పూర్వం తెలుపబడ్డ అర్థంతో ఈ అర్థం కూడా

**బ్రహ్మరూపధరా చాహం జటామండలధారిణీ। 50-92**
**సృజామి వివిధాన్ సర్వాన్ స్వాధ్యాయాధ్యాయతత్పరాన్॥**
**అతః కామితి మామ్ ప్రాహుః మునయో వేదపారగాః॥**
**పంచాక్షరో హ్యయం మంత్రః స్వాధ్యాయఫలదాయకః॥**

(హిరణ్యవర్ణ అయిన వనిత) అని శఠకోపసూరి తిరువిరుత్తమ్ అనే ప్రబంధంలో (40) లక్ష్మిని కీర్తించారు. ఈ రెండు అర్థాలు, ఈ మంత్ర ప్రభావం.

**హితా చ రమణీయా చ మదీయా ప్రకృతిః పరా।**
**తాం సత్త్వరూపామాలంబ్య తరంతి మునయస్తమః॥ (50-96)**
**అతో హిరణ్యప్రాకారామ్ ఋషయో మాముపాసతే।**
**దశాక్షరో హ్యయం మంత్రస్సర్వకామసమృద్ధిదః॥**

(ఉపాయోపేయంగా ఉండేది (బంగారంవలె ఉండేది). నా గొప్ప స్వభావం (విగ్రహం) (శుద్ధ) సత్త్వరూపం అయిన దానిని ధ్యానించి మునులు సంసారాన్ని దాటుతున్నారు. అందువల్ల నన్ను హిరణ్యప్రాకారగా ఋషులు ఉపాసిస్తున్నారు. పది అక్షరాలను కల **"ఓమ్ హిరణ్యప్రాకారాయై నమః"** అనే ఈ మంత్రం అన్ని మనోరథాలను వృద్ధిగా ఇస్తుంది.) అని లక్ష్మీతంత్రంలో ఆదరింపబడింది. మణులు, బంగారంతో నిర్మింపబడ్డ ప్రాకారాలచే పరివేష్టితం అయిన, ఆనందమయం అయిన దివ్యమండపంలో వేంచేసి ఉండేది" అనే అర్థాన్ని గోమఠరంగనాథులు ఆదరించారు. **"దేవానాం పూరయోధ్యా, తస్యాం హిరణ్మయః కోశః స్వర్గో లోకో జ్యోతిషావృతః"** (తైత్తి.ఆర. 1-27-116) (ఇతరులచే ముట్టడించడానికి సాధ్యంకానిది కనుక అయోధ్య అనేపేరును కల పరమపదం నిత్యసూరులు వేంచేసి ఉండేది. అందులో హిరణ్మయం అయిన గొప్పలోకం కాంతిమయం అయిన ప్రాకారాలతో చుట్టబడి వెలుగుతున్నది) అని వేదంలోను,

**మాహేంద్రమండపం హేమసాలగోపురలక్షణమ్।**
**చతుర్ద్వారం మహద్దీప్తం యత్ తత్ పుష్ణాతు మే శ్రియమ్॥**

(బంగారుతో నిర్మింపబడ్డ గోపురాన్ని కల్గినది, నాల్గుద్వారాలను కల్గినది, పెద్దది, కాంతి అతిశయించినది, పరమేశ్వరుడైన భగవానునకు చెందినది అయిన ఆ మండపము నాకు సంపదను ప్రసాదించుగాక!) అని మంకణసంహితలో చెప్పబడిన విషయం అనుసంధేయం.

**"హిరణ్యప్రాకారామ్"** అనే నామంద్వారా "అందమైన స్వభావాలను కల్గినది" అనే అర్థం తెలుపబడినది. ఆ స్వభావాలలో కొన్ని స్వభావాలు ఇకపై తెలుపబడుతున్నవి.

**(ఆర్ద్రామ్)- "దయార్ద్రహృదయామ్"** -దయతో మెత్తని మనస్సును కల్గినది-అని భావం. పరమపురుషునికంటె లక్ష్మికి గొప్పతనాన్ని ఇచ్చేది ఈ గుణమే కాబట్టి దీనిని ముందుగా వేదం పఠిస్తున్నది. కర్మానుగుణంగా ఫలాన్ని ఇచ్చేవాడు కనుక అతని దయ, క్షమ మొదలైన గుణాలు స్వాతంత్ర్యంమొదలైన గుణాలతో అభిభూతాలై, మఱుగుపడిపోతాయి. అజ్ఞాతనిగ్రహ అయిన ఈ లక్ష్మి కరుణ అయితే మహాప్రవాహంవలె పైపైకి ఇంకా ఇంకా వృద్ధి చెందుతూ ఉంటుంది. ఇందువల్లనే కదా **"దేవ్యా కారుణ్యరూపయా"** (కరుణారూపిణి



కల్యాణగుణనిధీ) అని చెప్పబడ్డరీతిలో భగవానుడు సర్వవేదప్రతిపాద్యుడైనట్లే, ఈ లక్ష్మికూడా సర్వవేదప్రతిపాద్య-అని చెప్పడంలో అడ్డులేదు అని భావం. ఘటాన్ని గూర్చి చెప్పినపుడు, దాన్ని నిరూపించే ఘటత్వం కూడా తనంతట తానే చెప్పబడినది అవుతుంది కదా! ఈ అర్థాన్నే పరమాచార్యులైన భట్టర్ కూడా

**స్వరూపం స్వాతంత్ర్యం భగవత ఇదం చంద్రవదనే**
**తదాశ్లేషోత్కర్షాత్ భవతి ఖలు నిష్కర్షసమయే।**
**త్వమాసీః మాతః శ్రీః కమితురిదమిత్థంత్వవిభవ-**
**స్తదంతర్భావాత్త్వాం న పృథగభిధత్తే శ్రుతిరపి॥ 18**

(చంద్రునివంటి ముఖాన్ని కల తల్లీ మహాలక్ష్మీ! పరత్వనిర్ణయసమయంలో భగవానుని ఈ స్వరూపం, స్వాతంత్ర్యంకూడా నీ ఆలింగనమహిమచేతనే నిర్ణయింపబడుతున్నది కదా! నీ భర్తస్వరూపాన్ని, స్వభావాన్ని ప్రకాశింపజేసే అంతరంగవిశేషణంగా నీవు ఉన్నావు. వేదం కూడా అతని స్వరూపనిరూపకభూతగా అతనితో నీవు కలసి ఉన్నందున నిన్ను ప్రత్యేకంగా చెప్పలేదు.) అని శ్రీగుణరత్నకోశంలో అనుగ్రహించారు. ప్రాసంగికంగా ఈ శ్లోకంలోని తాత్పర్యాన్నిగూర్చి కొంచెం విచారింపబడుతున్నది.

**"తదంతర్భావాత్"** అని ప్రారంభమయ్యే చివరిపాదానికి రెండు రీతులలో తాత్పర్యార్థాన్ని గ్రహించవచ్చు. మొదటి ప్రకారం ఏమంటే- వేదంలోని పలు వేల వాక్యాలలో పరమపురుషుని స్వరూపాదులు ప్రతిపాదింపబడుతున్నాయి. కొన్ని వాక్యాలు మాత్రమే లక్ష్మిని గూర్చి తెలుపుతున్నాయి. దీనికి ఏం కారణం? అనే సందేహం తలెత్తగా, ఈ శ్లోకంతో దానిని భట్టర్ పరిహరిస్తున్నారు. లక్ష్మి భగవానునకు స్వరూపనిరూపక కనుక పరమపురుషునిగూర్చి చెప్పే వాక్యాలు అన్నిటిలో స్వరూపనిరూపకభూత అయిన ఈమెకూడా సర్వవేదవాక్యప్రతిపాద్యయే అని పరిహారం. ఈ అర్థంలో పరమపురుషుని మాత్రం చెప్పే పలువేల వేదవాక్యాలు శ్లోకంలోని శ్రుతిశబ్దానికి అర్థం. ఇక, రెండవ ప్రకారం ఏమంటే, **"హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ", "అస్యేశానా జగతో విష్ణుపత్నీ", "ఈశానా దేవీ భువనస్యాధిపత్నీ", "శ్రీరసి ఇంద్రపత్నీ", "లక్ష్మీం జాతవేదో మ ఆవహ"** అనే పలు వాక్యాలలో లక్ష్మిని గూర్చి చెప్పినపుడు పరమపురుషునితో చేర్చే ఆమెను చెప్పడంలో ఏమి కారణం? అనే ప్రశ్న కలుగగా, లక్ష్మి అంతరంగ విశేషణంగా ఉన్నందున విశేష్యాన్ని విడచి విశేషణానికి సత్త లేనందువల్ల ఈ వాక్యాలు అన్నిటిలో లక్ష్మిని ప్రత్యేకంగా చెప్పకుండా పరమపురుషునితో చేర్చే పఠింపబడుతున్నది అనే సమాధానాన్ని ఈ శ్లోకం ఇస్తున్నది.

ఈ విధంగా మొదటి అర్థంలో ఘటాన్ని చెప్పేటపుడు ఘటత్వంకూడా చెప్పబడినట్లే, సర్వేశ్వరుని చెప్పే వాక్యాలు అన్నిటిలో ఈమెకూడా చెప్పబడినట్లేనని తెలుపబడినట్లయినది. రెండవ అర్థంలో, భగవానునకు ప్రకారభూతగానే ఉండడంవల్ల

ఈ లక్ష్మి పలువాక్యాలలో భగవానునితో కలిపే పఠింపబడుతున్నదని చెప్పినట్లయింది. కొందఱు **"తదంతర్భావాత్"** అనే ఈ పాదంలో భగవానునకు ఉన్న పరబ్రహ్మత్వం, జగత్కారణత్వం, మోక్షప్రదత్వం-మొదలైనవి అన్నీ లక్ష్మికి కూడా ఉన్నాయి. అయితే, లక్ష్మి భగవానునితో అంతర్భవించి ఉండడంవల్ల వేదం ఈ మహిమలను లక్ష్మికి ప్రత్యేకంగా పలుకలేదు-అనే అర్థం చెప్పబడినట్లుగా అంటారు. కాని ఇది సరికాదు. "తదంతర్భావాత్" అనే ప్రయోగానికి ముందుపాదంలో లక్ష్మి పరమాత్మకు **ఇదంత్వం**గాను, **ఇత్థంత్వం**గాను ఉన్నది అని ఘోషింపబడుతున్నది. అంటే-పరమాత్మకు అహంతగాను, అస్మితగాను ఉన్నది-అని భావం. భగవానునకు స్వరూపనిరూపకభూతగా ఉంటుంది అని పిండితార్థం. ఒక వస్తువును గూర్చి చెప్పే సందర్భాలు అన్నిటిలో ఆ వస్తువునకు చెందిన స్వరూపనిరూపక ధర్మాలన్నీ తమంతతామే చెప్పబడినట్లు అవుతాయి-అనే న్యాయం లోకప్రసిద్ధం. (ఘటవ్యక్తిని చెప్పినపుడు ఘటత్వజాతికూడా చెప్పబడినట్లే-ఇది కూడా). అయితే, ఈ న్యాయంలో నిరూప్యాన్ని చెప్పేచోట్ల అంతా నిరూపకధర్మాన్ని నిరూప్యధర్మిగానో, లేక, దానికి సమానమైనదిగానో చెప్పినట్లు కాదు. ధర్మిలో ఉండే ధర్మాలన్నీ ఆ ధర్మిని నిరూపించే నిరూపకంలోకూడా ఉంటాయి-అని చెప్పబడినట్లుగా కూడా కాదు. ఘటాన్ని చెబితే, ఘటత్వాన్ని చెప్పినట్లు అవుతుంది అన్నది సత్యం. అయితే ఘటంలో ఉండే నీలత్వం, మొదలైన ధర్మాలన్నీ ఘటత్వంలో కూడా ఉన్నాయి అని చెప్పినట్లు అర్థంకాదు. అందువల్ల పైన తెల్పిన రీతిలో ధర్మి అయిన పరమాత్మకు చెప్పబడ్డ మోక్షప్రదత్వాదులు ధర్మభూత అయిన లక్ష్మికి కూడా ఉన్నాయని అనడం సరికాదు. న్యాయవిరుద్ధమే అవుతుంది. **"స్వతః శ్రీస్త్వం విష్ణోః త్వమసి" అని, "కమితురిదమిత్థంత్వవిభవః"** అని పల్కిన భట్టర్‌సూక్తికి విరుద్ధం కూడా.

"సోస్మితా" అనే ఈ నామం భగవానుని "అస్మిత" అనే గొప్పతనానికి కారణంగాను, ఆ "అస్మిత" వలె అంతరంగవిశేషణంగాను ఉండేది ఈ లక్ష్మి అనే అర్థాన్ని కల్గినది అని నిర్ణయింపబడింది. **"శ్రద్ధయా దేవో దేవత్వమశ్నుతే"** (శ్రద్ధాశబ్దవాచ్య అయిన లక్ష్మివలననే దేవశబ్దవాచ్యుడైన పరమాత్మ దేవత్వాన్ని పొందుతున్నాడు) అని వేదంలోను ఈ అర్థం దృఢీకరించబడింది.

**అహంతా బ్రహ్మణస్తస్య సాఽహమస్మి సనాతనీ।**
**ఆత్మా స సర్వభూతానామహంభూతో హరిః స్మృతః॥**
**అహంతయా వినాఽహం హి నిరుపాఖ్యో న సిద్ధ్యతి।**
**అహమర్థం వినాఽహంతా నిరాధారో న సిద్ధ్యతి॥**

(సనాతని అయిన నేను "పరబ్రహ్మ"-అనే ఆ భగవానునకు అహంత (నేను అనే స్వభావం)గా ఉన్నాను. సర్వభూతాలకు ఆత్మ అయిన హరి అహంభూతుడై ఉన్నాడు. అహంతలేని అహమర్థం పేరు లేనిదియై సిద్ధించకుండా పోతుంది. అహమర్థాన్ని విడచి



అహంత ఆధారం లేనిదియై సిద్ధించదు) ఇత్యాది శ్రీ పాంచరాత్రవచనాలలో లక్ష్మి "అహంత"గాను, "అస్మిత"గాను చెప్పబడడానికి కారణం ఈమె ఈ విధంగా "సోస్మిత"గాను, "సో - హంత"గాను ఉండడమేనని తెలుస్తున్నది. రత్న-ప్రభా, పుష్ప-పరిమళన్యాయంతో భగవానుని గొప్పతనం లక్ష్మివల్లనే కలుగుతుంది అనే విషయాన్ని, దానివల్ల భగవానుని పరబ్రహ్మత్వానికి ఏ కొఱత రాదనే విషయాన్ని **"స్వతః శ్రీస్త్వమ్"** అనే శ్లోకంలో భట్టర్ తెలిపిన వైనం ఇంతకుముందే వివరింపబడింది. భగవానుని "అస్మిత"కు (గొప్పతనానికి) లక్ష్మి కారణభూతురాలు కనుక ఆమె "సోస్మిత" అవుతున్నది అనే ఈ అర్థం, ఈ మంత్రవైభవం

**ఉదితి బ్రహ్మణో నామ వికస్తిస్తస్య తు స్మితమ్।** **(50-94)**
**మయ్యాయత్తా వికస్తిస్సా సోస్మితాం మాం తతో విదుః॥**
**సప్తాక్షరో హ్యయం మంత్రో వికస్తిం భూయసీం వహేత్।**

('ఉత్' అని పరబ్రహ్మకు పేరు. 'అస్మిత' అంటే అతని గొప్పతనం. పరబ్రహ్మయొక్క ఆ గొప్పతనం నావల్ల ఏర్పడుతున్నది. అందువల్లనే నన్ను "సోస్మిత"గా తెలిసికొంటున్నారు. **"ఓమ్ సోస్మితాయై నమః"** అనే ఏడు అక్షరాలను కల ఈ మంత్రం గొప్ప మహిమను కల్గినది) అని లక్ష్మీతంత్రంలో ఉద్ఘోషింపబడింది. మిగిలిన పలుచోట్లవలె ఇక్కడకూడా లక్ష్మి ఆదరించిన ఈ అర్థాన్ని స్పృశించకుండా, "భగవత్సంశ్లేషంచే కల్గిన గొప్ప ఆనందంలో మగ్నమై ఉన్నందున ఎల్లప్పుడు చిఱునవ్వుతో (లేక, గర్వంతో) ఉన్నది" అనే అర్థాన్ని గోమఠరంగనాథులు తెలిపారు. **"సోస్మయామ్"** అని కొందఱు పఠిస్తారు. ఇది లక్ష్మి ఆదరించిన పాఠం కాదు. ఈ పాఠానికి గోమఠరంగనాథులభాష్యంలోని వివరణమే గ్రాహ్యం.

ఈ విధంగా భగవానునకు అంతరంగవిశేషణభూతగా లక్ష్మి ఉన్నట్లయితే కారుణ్యరూపగా శాస్త్రాలలో చెప్పబడే ఈమె అతని దయాదిగుణాలలో ఒకటిగా, ధర్మమాత్రంగా ఉంటుందా? ధర్మి కాదా? అనే సందేహం తలఎత్తగా, దానికి సమాధానంగా తరువాతి నామం పల్కుతున్నది.

**(హిరణ్యప్రాకారామ్)-** హితమైన-రమణీయమైన ప్రాకారాలను అంటే గుణాలను కల్గినది అని అర్థం. **"ప్రకార ఏవ ప్రాకారః".** జీవులను ఉజ్జీవింపజేసేవిగాను, అందమైనవిగాను ఉండే గుణాలను కల్గినది-అని భావం. ప్రాప్యాలుగాను, ప్రాపకాలుగాను ఉండే గుణాలను కల్గినది అని భావం. హితం అంటే ప్రాపకం, రమణీయం-అందంగా ఉండడంవల్ల ప్రాప్యం అని అర్థం. హిరణ్యం అనే బంగారం కూడా స్వయంప్రాప్యంగాను, ఇతర పురుషార్థాలకు ప్రాపకంగాను ఉంటుంది కదా!, లేక, ప్రాకారం అనే పదం లక్ష్మియొక్క దివ్యమంగళవిగ్రహాన్ని తెలుపుతున్నదనికూడా చెప్పవచ్చు. **"హిరణ్మయః పురుషః"** అనబడే అతనివలె హిరణ్మయమైన శుద్ధసత్త్వవిగ్రహాన్ని కల్గినదని భావం. ఇందువల్లనే **"పొన్‌మాదు"**

ప్రకాశాన్ని ఇస్తాయి) అని "ఆర్ద్రా", "జ్వలంతీ" అనే రెండు నామాల వైభవం లక్ష్మీతంత్రంలో తెలుపబడింది.

అగ్నివలె జ్వలిస్తున్నది అయితే "అనలమ్" (న విద్యతే అలమ్ యస్య) అని పేరుపొంది, ఎంత ఆహారాన్ని ఇచ్చినా ఆకలితీరని ఆ అగ్నివలె తృప్తిపడకుండా ఉంటుందా? అని అంటే, దానిని సమాధానాన్ని తరువాతి నామం తెల్పుతున్నది.

**(తృప్తామ్)**-ఎల్లప్పుడు తృప్తిని కల్గినదై ఉంటుంది-అని ఈ నామం తెలుపుతున్నది. విచ్ఛేదం లేని భగవత్ సంశ్లేషం వల్ల కల్గిన గొప్ప ఆనందంచేత ఎల్లప్పుడు తృప్తిని కల్గినదై ఉంటుంది-అని భావం. ప్రాకృత భోగాలు లేకుండానే అవాప్తసమస్తకామగా ఉంటుంది-అని భావం. **"పత్రం పుష్పం ఫలం తోయమ్"** అనే అతనివలె భక్తులు ప్రేమతో అర్పించే ఏ చిన్నవస్తువుతో అయినా చాలా తృప్తిని పొందుతుంది-అనికూడా భావం. **"ఐశ్వర్యమక్షరగతిమ్ పరమం పదం వా, కస్మైచిదంజలిభరం వహతే వితీర్య, అస్మై న కించిదుచితం కృతమిత్యథాంబ త్వం లజ్జసే కథయ కోఽయముదారభావః"** (కేవలం అంజలి భారాన్ని మాత్రం మోసే భక్తునకు అతడు కోరిన రీతిలో ఐశ్వర్యాన్నిగాని, కైవల్యాన్నిగాని, పరమపదాన్నిగాని అనుగ్రహించినా అంతటితో తృప్తిపడకుండా, అయ్యో! ఇతనికి తగినదానిని కొంచెం చేయలేకపోయానే! అని సిగ్గుపడతావే! తల్లీ! ఇదేమి ఔదార్యమమ్మా! చెప్పు?) అనే శ్లోకంలో పరాశరభట్టర్ ఈ లక్ష్మి అంజలి మాత్రంతోనే సంతుష్టిని పొందుతుంది-అనే అర్థాన్ని తెలియజేశారు కదా! **"తృప-తృప్తౌ"**-అని ఇచటి ధాతువు.

**(తృప్తామ్)-"తృప-ప్రీణనే"** అనే ఇంకొక ధాతువువల్ల పుట్టిన పదంగా దీనిని గ్రహిస్తే, పరమపురుషుని పట్ల ఎల్లప్పుడు ప్రీతిని కల్గినది అని అర్థం చెప్పవచ్చు. **"అకల కిల్లేన్ ఇఱైయుమ్"** (క్షణమైనా విడచి ఉండలేను) (శఠకోపసహస్రం-6-10-10) అని, "న చ సీతా త్వయా హీనా" (రామా-అయో. 53-31) (నిన్ను విడచి సీత లేదు) అని, **"యస్త్వయా సహ స స్వర్గో నిరయో। యస్త్వయా వినా, ఇతి జానన్ పరాం ప్రీతిం గచ్ఛ రామ మయా సహ॥** (రామా! నీతో కలసి ఉండడమే నాకు స్వర్గం. నిన్ను విడచి ఉండడమే నరకం-అనే రీతిలోని నా గొప్ప ప్రేమను తెలిసికొని నాతో కూడా వనానికి వెళ్ళు) అని ఇతరులతో, తనతో తేడా లేకుండా అందఱూ గొప్పగా చెప్పేరీతిలో కదా ఈమె ప్రీతి ఉంటుంది.

**"ఇన్ తుణైప్పదుమత్తలర్మకళ్ తనక్కుమ్ ఇన్బన్"** (పరకాలసూరిసూక్తం -2-3-5) (ప్రియసహచరి అయిన పద్మనివాసినికి వల్లభుడు), **"నమక్కుమ్ పూవిన్ మిశైనఙ్గైక్కుమ్ ఇన్బన్"** (శఠకోపసహస్రం-4-5-8) (మనకు పద్మనివాసిని అయిన లక్ష్మికి ప్రియుడు) అని, **"ఉనక్కు ఏఱ్కుమ్ కోలమలర్ ప్పావైక్కు అన్బాకియ ఎన్ అన్బేయో"** (శఠకోపసహస్రం-10-10-6) (నీకు తగిన అందమైన తామరపూవులో ఉండే లక్ష్మికి వల్లభుడవైన నా ప్రేమస్వరూపా) అని, **"వాళ్నెడుఙ్కణ్ణి మదుమలరాళ్ కణ్ణాళా!"**



అయిన దేవిచేత) అని లక్ష్మీతంత్రం (18)లోను, **"కరుణా భక్తవల్లభా"** అని శ్రీసహస్రనామంలోను, **"కరుణాం లోకమాతరమ్"** అని అష్టోత్తరశతనామంలోను కరుణయే మూర్తీభవించినదని కీర్తింపబడినది. దీనిని మనస్సులో ఉంచుకొని శ్రీ పరాశరభట్టర్-

**మాతర్మైథిలి! రాక్షసీస్త్వయి తథైవార్ద్రాపరాధాస్త్వయా**
**రక్షంత్యా పవనాత్మజాల్లఘుతరా రామస్య గోష్ఠీకృతా।**
**కాకం తం చ విభీషణం శరణమిత్యుక్తి క్షమౌ రక్షతః**
**సా నస్సాంద్రమహాగసస్సుఖయతు క్షాంతిస్తవాకస్మికీ॥**

(తల్లీ మైథిలీ! అపుడే అపరాధం చేసిన రాక్షసస్త్రీలను హనుమానుని బారినుండి రక్షించిన నీచే కాకాసురుని, విభీషణుని శరణు అనే పదాన్ని పల్కిన తర్వాతనే రక్షించిన శ్రీరాముని గోష్ఠీ అధఃకరింపబడింది. అటువంటి నీ నిర్హేతుకకృప పరమపాపులు అయిన మమ్ములను కూడా ఆనందింపజేయాలి) అని శ్రీగుణరత్నకోశం అనే స్తోత్రంలో (50) పలికారు.

**"దాసీనాం రావణస్యాహం మర్షయామీహ దుర్బలా"** (రామా. యుద్ధ.-116-41) (ఇతరుల కలతను చూచి సహించలేని మనోదౌర్బల్యాన్ని కల్గిన నేను రావణుని దాసీజనం అయిన వీరిని మన్నిస్తున్నాను) అని తానే స్వయంగా పల్కిన రీతిలో ఆర్ద్రాపరాధినులైన రాక్షస స్త్రీల వరకుకూడా ప్రవహించేటట్లుగా కదా ఆర్ద్ర అయిన ఈమె సుకుమార హృదయం నుండి వెలువడే దయ ఉంటుంది. నిజానికి ఈమె సాన్నిధ్యం వల్లనే కదా అతడు కూడా-**"అళి నన్గుడైయ తిరుమాల్"** (గోదాసూక్తం-14-8) అవుతున్నాడు. బ్రహ్మచారి నారాయణుడే అయితే అపరాధభూయిష్ఠులు అయిన చేతనులకు ఉజ్జీవనం అనేదే లేదు కదా!

**(ఆర్ద్రామ్)**- "పద్మిని" గా కీర్తింపబడే లక్ష్మి తామరపూవులో ఉంటుంది. ఈ తామరకు ఆసనపద్మం అని పేరు. శిరఃపద్మం అనబడే వేఱొక తామరపైన గొడుగుగా విస్తరించి వర్షాతపవారణంగా సాక్షాత్కరిస్తుంది. అప్రాకృతం అయిన ఆ తామరనుండి అమృతధార ఎల్లప్పుడు స్రవిస్తూ ఉంటుంది. ఆ అమృతధారా ప్రవాహంతో ఎల్లప్పుడు తడసి ఉండే మేనిని కల్గినది-అని ఈ నామానికి అర్థాన్ని గ్రహించవచ్చు. స్వాతంత్ర్యాగ్నిచే దహిస్తూ ఉండే సర్వేశ్వరుని తన మేని సంబంధంతో చల్లబఱచేది- అని భావం.

**(ఆర్ద్రామ్)- "ఆరాత్ ద్రావయతీతి ఆర్ద్రామ్"**-ఆశ్రితుల దోషాలను చాలాదూరం పరుగెత్తిపోయేటట్లు చేసేది కనుక ఆర్ద్ర అవుతున్నది) అనే వ్యుత్పత్తిని బట్టి భక్తుల పాపాలను, దోషాలను **"శుమ్మెనాదే కైవిట్టోడి తూఱుకళ్ పాయ్న్దనవే"** (భట్టనాథసూక్తం-5-4-3) (కిమ్మనకుండా చేతిని వీడిపోయి పొదలలో దూరాయి) అని, **"వానో మఱికడలో మారుతమో తీయకమో కానో ఒరుజ్గిత్తుఙ్కడిలమ్ ఆల్!)** (నా పాపాలు ఆకాశంలోనా! సముద్రంలోనా!

గాలిలోనా! నిప్పులోనా! అరణ్యంలోనా దూరిపోయాయి! ఎక్కడా వాటిని చూడము! ఆహా!) (భూతయోగి ప్రబంధం-54) అనే స్థితిని పొందించేది కనుక "ఆర్ద్రా" అనబడుతున్నది-అని కూడా చెప్పవచ్చు. ఈ మూడు అర్థాలు.

**ఆరాదశేషదోషాణాం ద్రావిణీ మాముపేయుషామ్।**
**అధోముఖాత్ శిరఃపద్మాత్ స్రుతయామృతధారయా॥** **50-98**
**అభిషిక్తా సదాఽర్ద్రాస్మి దయయార్ద్రాంతరాస్మి చ॥**

(నన్ను చేరినవారి దోషాలను చాలాదూరం పోయేటట్లు చేస్తాను. తలక్రిందుగా ఉండే శిరఃపద్మంనుండి స్రవించే అమృతధారచే అభిషేకం చేయబడి ఎల్లప్పుడు తడిసి ఉంటాను. దయతో తడసిన మనస్సును కల్గిన దానినై ఉంటాను) అని లక్ష్మీతంత్రంలో ఆదరింపబడ్డాయి.

**(ఆర్ద్రామ్)-"దిగ్గజేంద్రైః స్నాప్యమానాం కాంచనైః కలశోదకైః"** (హేమకుంభాల నీటితో దిగ్గజాల చేత స్నానం చేయింపబడే దానిని) అని ఈశ్వరసంహితలో చెప్పబడినందువల్ల తడసిన తిరుమేనిని కల్గినది-అని గోమఠరంగనాథులు వ్యాఖ్యానించారు. తడసి ఉన్నదైతే, తడసిన నిప్పువలె కాంతివిహీనంగా ఉంటుందా? అని అంటే- దానికి బదులును తరువాత నామం చెబుతున్నది.

**(జ్వలంతీమ్)-** జ్వలించే అగ్నివలె ఉండేది-అని భావం. అన్ని భూతాలలోను, పరమపదంలోను ఉంటూ ఉభయవిభూతులలోను ప్రకాశించేది-అని భావం. **"శ్రీమద్వైకుంఠైశ్వర్యాదిదివ్యలోకమ్ ఆత్మకాంత్యావిశ్వమాప్యాయ యంత్యా శ్రియాసహాసీనమ్"** (శ్రీవైకుంఠదివ్యలోకం మొత్తం తనకాంతితో నిండిస్తూ ఉండే శ్రీదేవితో కూడి వేంచేసి ఉండే స్వామిని) అని శ్రీవైకుంఠగద్యలో భగవద్రామానుజులు పలికారు. **"తమేవ భాంతమనుభాతి సర్వమ్ తస్య భాసా సర్వమిదం విభాతి"** (కఠోపనిషత్తు-2-5) (ప్రకాశించే అతనిని బట్టే అన్నీ ప్రకాశిస్తున్నాయి. అతని కాంతితోనే ఇవి అన్నీ ప్రకాశిస్తున్నాయి) అని కీర్తింపబడే అతనికి కూడా, నీలమేఘం మధ్యలో ఉండే మెఱుపుతీగవలె ఉండే ఈమె ప్రకాశికగాకదా ఉంటుంది. ఇందువల్లనేకదా

**తయా స రాజర్షిసుతాభిరామయా**
**సమేయివానుత్తమరాజకన్యయా।**
**అతీవరామః శుశుభేఽతికామయా**
**విభుః శ్రియా విష్ణురివామరేశ్వరః॥**

(అందమైనది, ఉత్తమరాజపుత్రి అయిన ఆ సీతతో కూడిన, రాజర్షిపుత్రుడైన శ్రీరాముడు, చాలా ఎక్కువ అభిలషించదగిన శ్రీదేవితో కూడిన, అమరులకు అధిపతి అయిన విష్ణువువలె, మిక్కిలి ప్రకాశించాడు) అని వాల్మీకిమహాముని,



"తికళ్కిన్ఱ తిరుమార్బిల్ తిరుమఙ్గైతన్నోడుమ్ తికళ్కిన్ఱతిరుమాలార్" (శఠకోపసహస్రం-10-6-9) (ప్రకాశించే వక్షఃస్థలంలో ఉండే లక్ష్మీదేవితో ప్రకాశించే శ్రియఃపతి) అని శ్రీశఠకోపసూరి పలికారు. ఉభయవిభూతికూడా ప్రకాశించేటట్లు వెల్గుతున్నది-అనే ఈ అర్థాన్ని

**జ్వలామి సర్వభూతాన్తర్గగనే పరమే సదా।**
**శ్రద్ధా నిరంజనా సత్యా భాసయంతీ జగత్ త్విషా॥**

(అన్ని భూతాలలోను, పరమపదంలోను ఉండేదానను, పరిశుద్ధను, దోషరహితం అయినదానను, వికారరహితం అయినదానను అయిన నేను ఉభయవిభూతులను నా కాంతితో ప్రకాశింపజేస్తున్నాను) అని లక్ష్మీతంత్రంలో లక్ష్మి ఆదరిస్తూ పలికింది.

**అశిఖా త్రిశిఖా చాహం పంచపంచశిఖావతీ।** **50-100**
**సప్తధా చ పునస్త్రేధా జ్వలామి వపుషి స్థితా॥**

(అకారవాచ్యుని శిఖగా కల్గినదానను, మూడు విభాగాలను కల్గిన జాఠరాగ్ని అనే మూడు శిఖలను కల్గినదానను గాను, ఇరవైఅయిదు తత్త్వాలను శిఖలుగా కల్గినదాననుగాను, సప్తధాతువులు అనే ఏడు శిఖలను కల్గినదాననుగాను, సత్త్వరజస్తమస్సులు అనే మూడు గుణాలు అనబడే మూడు శిఖలను కల్గినదిగాను, దేహంలో ఉంటూ అగ్నితో నేను జ్వలిస్తాను) అనే వేఱొక అర్థంకూడా లక్ష్మిచేతనే లక్ష్మీతంత్రంలో ఘోషింపబడింది. అగ్ని పలు శిఖలను-అనగా జ్వాలలను కల్గినదై ఉంటుంది కదా. ఆ రీతిలోనే దేహం నడుమ ఉండే తాను కూడా ఉంటుంది-అని తెలిపినట్లయింది.

**(అశిఖా)**-దేహం నడుమ **"వహ్నిశిఖా"** అని చెప్పబడే అకారవాచ్యుడైన భగవానుని మేనియొక్క నడుమ వేంచేసి ఉండేదిగాను, తాను హిరణ్యవర్ణ కనుక ఈ లక్ష్మీదేవి వహ్నిగాను, భగవానుడు ఈమెకు శిఖగాను నిరూపింపబడ్డారు.

**(త్రిశిఖా)-"అన్నమశితం త్రేధా విధీయతే"**-అనే రీతిలో అన్నాన్ని మూడు విధాలుగా విభాగించడానికి మూడు విధాలుగా ఉండే జఠరాగ్నిని శిఖగా కల్గినది.

**(పంచపంచశిఖావతీ)**-శరీరంలోపల వ్యాపించి ఉండే ప్రకృతి మహదాదులైన ఇరవై అయిదు తత్త్వాలు అనే శిఖను కల్గినది.

**(సప్తధా)**-శరీరంలో ఉండే ఏడు విధాలైన ధాతువులను శిఖగా కల్గినది.

**(పునస్త్రేధా)**-దేహంలో ఉండే సత్త్వరజస్తమస్సులు అనే త్రిగుణాలనబడే శిఖలను కల్గినది. ఇవి అన్నీ లక్ష్మీదేవికి విధేయంగా ఉంటాయని తాత్పర్యం.

**"షడక్షరావిమౌ మంత్రౌ నిర్వృతౌజ్జ్వల్యధాయకౌ"** (ఒక్కొక్కటి ఆఱు అక్షరాలను కల్గిన **"ఓమ్ ఆర్ద్రాయై నమః", ఓమ్ జ్వలంత్యై నమః,** అనే ఈ రెండుమంత్రాలు ఆనందాన్ని,

**(ఓమ్ పద్మేస్థితాయై నమః"**-అనే ఈ మంత్రంతో నన్ను స్తుతించేవాడు చేయవలసినదానిని అంతటిని చేసినవాడై, కాలాన్ని దాటినవాడవుతాడు) అని మంత్రంయొక్క మహిమ తెలుపబడింది.

**(పద్మవర్ణామ్)**-తామరవంటి వర్ణాన్ని కల్గినది. దీనివల్ల అతనే సుమవర్ణుడైన భగవానుని మేనికి పరభాగశోభను కల్గించేది-అని ఈ మంత్రం తెలుపుతున్నది. "పద్యమానమై (తెలియబడేదై) ఉన్నందున, కోశం, రేకలు-అనే ఈ రెండింటినీ చేర్చి పట్టుకొని ఉండే భాగం-ఈ విధంగా మూడు భాగాలున్న తామరవలె చిత్తు-అచిత్తులు, వాటిని చేర్చి ధరించి ఉండే ఈశ్వరుడు అనే మూడు తత్త్వాలు ఉండడంచేత, పద్మం అని అనదగిన ఈ మూడు తత్త్వాలను తామరను తన కాంతితో ప్రకాశించేటట్లు చేసే సూర్యునివలె తన తేజస్సుతో ప్రకాశింపజేస్తుంది. కనుక **"పద్మవర్ణా"** అని అనబడుతున్నది-అని కూడా చెప్పవచ్చు.

**పుంప్రధానేశ్వరాన్ నిత్యం వర్ణయామ్యాత్మతేజసా।**
**పద్మాకారైశ్చ వర్ణైర్మే భూషితా తనురుత్తమైః॥**
**పద్మవర్ణేతి మాం స్తుత్వా శాస్త్రవైశద్యమాప్నుయాత్।**

(చిదచిదీశ్వరులను ఎల్లప్పుడూ నా తేజస్సుతో రంజింపజేస్తాను. (లేక విస్తృతపఱుస్తున్నాను. నా మేని గొప్ప తామరపూవుకు చెందినట్లున్న గొప్ప వర్ణాలతో అలంకరింపబడింది. **"ఓమ్ పద్మవర్ణాయై నమః"** అని నన్ను స్తుతించినవాడు శాస్త్రాలలో వైశద్యాన్ని-విస్తృతిని పొందుతాడు) అని ఈ రెండు అర్థాలు, మంత్రమహిమ లక్ష్మీతంత్రంలో ఘోషింపబడింది. ఈ విధంగా పద్మేస్థితగా, పద్మవర్ణగా ఉండే లక్ష్మి తన మాధుర్యంచేతనే సర్వేశ్వరుని ఆసక్తుణ్ణిగా చేసి, తృప్తిని పొందిస్తున్నది -అనే ఈ మూడు నామాల సారార్థం **"పద్మేస్థితా పద్మవర్ణా పద్మనాభప్రియా శుభా, సదానుగ్రహసంపన్నా సా దేవీ మే ప్రసీదతు"** (తామరపూవులో ఉండేది, తామరపూవురంగువంటి రంగును కల్గినది, నాభిలో పద్మాన్ని కల పద్మనాభునకు ఇష్టమైనది, ఎల్లప్పుడు దయతో నిండినది అయిన ఆ దేవి నన్ను కరుణించాలి) అని మంఖణసంహితలో తెలుపబడింది.

**(తామ్ (శ్రియమ్)**- ఈ విధంగా సుప్రసిద్ధగా ఉండే ఆ శ్రీదేవిని

**(ఇహ ఉపహ్వయే)**-ఇక్కడకు ఆహ్వానిస్తున్నాను.

**5. చన్ద్రాం ప్రభాసాం యశసాం జ్వలన్తీం**
**శ్రియం లోకే దేవజుష్టాముదారామ్।**
**తాం పద్మనేమీం శరణమహం ప్రపద్యే**
**అలక్ష్మీర్మే నశ్యతాం త్వాం వృణే॥ 5**

**ప్రతిపదార్థము :** చంద్రామ్=చంద్రుని (అంశగా) కల్గినది, ప్రభాసామ్=మిక్కిలి గొప్పకాంతిని



(పరకాలసూక్తం-8-10-4) (బల్లెంవలె పదునైన, విశాలమైన నేత్రాలను కల, మధువును స్రవించే తామరపువ్వులో ఉండే లక్ష్మికిని నేత్రస్థానీయుడా!) అని, **"వడిక్కోలవాళ్ నెడుఙ్కణ్ మామలరాళ్, శెవ్వి పడిక్కోలమ్ కణ్డకలాళ్ పన్నాళ్"** (సారభూతసౌందర్యాన్ని, కాంతిని కల, అపరిచ్ఛిన్నం అయిన నేత్రాలను కల, గొప్పతామరపువ్వులో అవతరించిన లక్ష్మి స్వామి అందమైన మేని సౌందర్యాన్ని చూచి పలునాళ్ళు (శాశ్వతంగా) ఎడబాయదు) అని దివ్యసూరులు ఈ అర్థంలో అవగాహించి, పల్కారు.

**హరౌ ప్రీతిమతీ నిత్యం తృప్తా భక్తేషు నిత్యదా।**
**ప్రాకృతైశ్చ వినా భోగైః నిత్యతృప్తాస్మ్యహం స్వతః॥ 50-102**
**తాం మాం తృప్తామనుధ్యాయ మునయో వేదపారగాః।**
**జ్ఞానమూలాం పరాం తృప్తిం నిత్యాం ప్రాప్తాః సుధామయీమ్॥**
**షడక్షరో హ్యయం మంత్రస్తర్పయత్యఖిలం జగత్॥**

(భగవానునిపట్ల ఎల్లప్పుడు ప్రీతిని కల్గినదాననై ఉంటాను. భక్తుల పట్ల ఎల్లప్పుడూ తృప్తిని కల్గినదాననై ఉంటాను. ప్రాకృతభోగాలు లేకుండానే సహజంగానే నిత్యతృప్తిని కల్గినదాననై ఉంటాను. యోగంలో పారంగతులైన మునులు **"తృప్తా"** అని నన్ను ధ్యానించి, తత్త్వజ్ఞానమూలకం అయినది, నిత్యమైనది, అమృతమయమైనది అయిన గొప్ప తృప్తిని పొందుతారు. ఆఱు అక్షరాలను కల **"ఓమ్ తృప్తాయ నమః"** అనే ఈ మంత్రం అన్ని లోకాలను తృప్తిపఱుస్తుంది) అని ఈ అర్థాలు లక్ష్మీతంత్రంలో కూడా తెలుపబడ్డాయి. మంత్రం మహిమకూడా చెప్పబడింది.

తాను తృప్తిని పొందటంవరకేనా? అని అంటే, అంతమాత్రం కాదనే విషయాన్ని తరువాతి నామం తెలుపుతుంది.

**(తర్పయంతీమ్)**-చేతనులను అందఱినీ, పరమచేతనుడైన భగవానుని తృప్తిని పొందేటట్లు చేస్తుంది-అని భావం.

**(తర్పయంతీమ్)**-లక్ష్మీదేవి తన స్వరూపరూపగుణాలలో భగవానుని తృప్తుని చేస్తుంది కనుక **"తర్పయంతీ"** అనబడుతున్నది.

**(తర్పయంతీమ్)**-అమలుడైన, ఆది అయిన, స్వామి అయిన భగవానునియొక్క పాద పద్మాలచేత, పీతాంబరంచేత, ప్రకాశించే నాభిపద్మంచేత, అందమైన ఉదరబంధంచేత, హారాలను అలంకరింపబడ్డ వక్షస్థలంచేత, లోకాలను అన్నిటినీ గ్రసించిన కంబుకంఠంచేత, ఎఱ్ఱని బింబాధరంచేత, విశాలమైన, రక్తవర్ణాంచితాలైన నేత్రాలచేత, నీలవర్ణంచేత, మిగిలిన స్వరూపరూపగుణవిభూతులచేత తనను తృప్తిపఱచుకొంటుంది కనుక, **"తర్పయంతీ"** అని అనబడుతున్నది-అనికూడా చెప్పవచ్చు.

**(తర్పయంతీమ్)**-భగవానుని తృప్తిని పొందిస్తుంది. లేక, ప్రీతిని పొందిస్తుంది. ఇందువల్లనే

కదా **"అముదిల్ అరుమ్‌పెణ్ణముదు ఉణ్డపెరుమాన్"** (అమృతంకంటె అరుదైన లక్ష్మి అనే అమృతాన్ని అనుభవించిన స్వామి) అని, **"వణ్డార్ పూమలర్ మజ్గైమణనోక్కముణ్డానే"** (తుమ్మెదలు నిండి ఉండే తామర పూవులో ఉండే లక్ష్మీదేవి కటాక్షాలను అనుభవించినవాడు) అని పరకాలసూరి లక్ష్మీదేవిని కీర్తించారు. "తర్పయంతీ" అనే వర్తమానకాలిక ప్రయోగస్వారస్యంద్వారా తన స్వరూపరూపగుణవిభూత్యాదులతో కాలతత్త్వం అంతా అనుభవిస్తూ ఉన్నా, వాటివైభవంలో అత్యల్పాంశంకూడా పూర్తికానట్లుండేది, ఎప్పటికప్పుడు నిత్యనూతనంగా భాసించే అపర్యాప్తామృతంలో ఉండేది ఈ లక్ష్మీదేవి అని తెలుపబడుతున్నది. **"కలైయిలజ్గు మకలల్ కుల్‌కమలప్పావై కదిర్ ముత్తవెణ్ణకైయాళ్ కరుజ్గణాయ్‌చ్చి ములైయిలజ్గు మొళి మణిప్పూణ్ వడముమ్ తేయ్‌ప్ప మూవాదవరై నెడున్తోళ్ మూర్‌త్తికణ్డీర్"** (పరకాలసూరి సూక్తం-4-4-5) (మొలనూలు ప్రకాశించే విశాలమైన నితంబ ప్రదేశాన్ని కల్గినది, ప్రకాశం పొందికగా ఉండే, ముత్యాలవలె తెల్లని దంతాలు కల్గినది అయిన లక్ష్మీదేవి నల్లని నేత్రాలను కల నీళాదేవి స్తనాలలో వెలిగే అందమైన మణులు పొదిగి చేసిన కంఠిక, హారం, ఒకదానితో ఒకటి ఒరసికొంటుండగా, ఆ శోభవల్ల ఏనాడూ తరగని నిత్యయౌవనాన్ని కలవాడు, కొండలవంటి ఉన్నతాలైన భుజాలనుకలవాడైన స్వామిని దర్శించండి) అని కదా పరకాలసూరి పలికారు.

**(తర్పయంతీమ్)**-భగవత్స్వరూపాదులతో తనను తృప్తిపఱచుకొనేది-అని అర్థం. వర్తమానాల ప్రయోగంచేత **"భోగోపోద్ఘాతకేళీచుళకితభగవద్వైశ్వరూప్యానుభావా"** "శ్రీః" (భగవానుని విశ్వరూపస్వరూపాన్ని అనుభవించడం అనేది తనభోగంయొక్క ఆరంభలీలగా కల్గిన శ్రీదేవి) అని శ్రీగుణరత్నకోశం అనే స్తుతిలో పరాశరభట్టర్ పల్కిన రీతిలో భగవానుని స్వరూపరూపవిభూత్యాదులను కాలతత్త్వం అంతా అనుభవిస్తూ ఉన్నా తాను తృప్తిపొందకుండా ఉండేది-అని తెలుపబడుతున్నది. **"తర్పయామి గుణైః విష్ణుమాత్మానం తద్గుణైరపి"** (నా గుణాలతో విష్ణువును తృప్తిచెందేటట్లు చేస్తున్నాను. నన్ను అతని గుణాలతో తృప్తిపఱచుకొంటున్నాను) అని అంటూ ఈ రెండు అర్థాలు-

**"ద్విసప్తత్యా సహస్రేణ నాడీనాం దేహసాగరమ్।**
**తర్పయామి రసైర్నిత్యం ప్రాణానాం ప్రేరణావశాత్॥**
**సౌషుమ్నేనాధ్వనా నిత్యం పరం భావముపేయుషామ్।**
**బింబభావముపేతాహం విమలే యోగదర్పణే॥**
**ఆత్మబింబసముద్భూతైః పరమార్థైః సుధారసైః।**
**చిన్మయైస్తర్పయామ్యంతర్యోగినాం సత్త్వముత్తమమ్॥**
**ప్రకృత్యాది విశేషాంతం పరిణామోన్ముఖం సదా।**
**కార్యభావం సమాపన్నమక్షిణ్వంతీ నిజైర్బలైః॥**



**ఆపగాభిరివాంభోధిం ప్రాణాధానేన తర్పయే।**
**స్నేహేనేవ సదా దీపం ప్రాణినాం కరణాని చ॥**
**నిజసంవిద్రసేనైవ తర్పయామ్యక్షయాత్మనా।**
**తర్పయంతీతి మాం ప్రాహుః యోగినో యోగపారగాః॥** **50-110**

(పంచవృత్తి ప్రాణాలనే వాయువులను ప్రేరేపించడం ద్వారా 72000 నాడులు అనే నదులచేత, వాటిలో ప్రవహించే ఆనందం మొదలైన రసాలు అనే నీటితోను దేహం అనే సముద్రానికి ప్రతిదినం తృప్తిని (పూర్తిని) కల్గిస్తాను. సుషుమ్నానాడి ద్వారా పరమపదాన్ని చేరే యోగుల మాలిన్యాన్ని లేని యోగం అనే అద్దంలో ఎల్లప్పుడు బింబంగా నేను వెలుగుతున్నాను. నా స్వరూపాలనుండి ఉద్భవించే మిక్కిలి గొప్ప, జ్ఞానమయం అయిన అమృతరసాలతో యోగుల గొప్పమనస్సును తృప్తిపఱస్తున్నాను. ఎల్లప్పుడూ మార్పును పొందటం కోసం అనుకూలంగా ఉండే ప్రకృతి మొదలైన అచేతనాలను దేహాది కార్యవస్తువులుగా అయేటట్లు నా బలం ద్వారా ప్రేరేపించి వాటిని తృప్తి పఱుస్తున్నాను. ప్రాణుల ఇంద్రియాలను, స్నేహంతో దీపాన్నివలె, నదులతో సముద్రాన్నివలె ప్రాణాన్ని ఇచ్చి తృప్తిపఱుస్తున్నాను. నా స్వరూపంతోను, నా జ్ఞానరసంతోను ఇంద్రియాలకు తృప్తిని కల్గిస్తున్నాను. అందువల్ల యోగంలో పారంగతులైన యోగులు నన్ను **"తర్పయంతీ"** అని అంటున్నారు) అని మిగిలిన నాల్గు అర్థాలు లక్ష్మీదేవిద్వారానే ఉద్ఘోషింపబడ్డాయి.

**సప్తాక్షరో హ్యయం మంత్రః తర్పయంత్యఖిలం జగత్**

(ఏడు అక్షరాలను కల **"ఓమ్ తర్పయంత్యై నమః"** అనే ఈ మంత్రం అన్ని లోకాలను ఎల్లప్పుడూ తృప్తిని పొందిస్తుంది) అని ఈ మంత్రంయొక్క మహిమ చెప్పబడింది.

ఈ విధంగా అందఱినీ తృప్తిని పొందించే ఈమె మాధుర్యాన్నిగూర్చి తరువాతి రెండు నామాలు తెలుపుతున్నాయి.

**(పద్మే స్థితామ్)**-తామరపూవులో ఉండేది. తామరలో ఉండే అందం, సుగంధమే ఒక రూపు దిద్దుకొన్నదా! అన్నట్లు అందులో ఉండేది-అని భావం. ఇందువల్లనేకదా ఈ లక్ష్మి **"తామరైయాళ్"** అని, **"కమలప్పావై"** అని, **"వేరి మాఱాదపూమేల్ ఇరుప్పాళ్"** అని, "మలర్ మజ్గై" అని ఈ విధంగా కీర్తింపబడుతున్నది.

**(పద్మే స్థితామ్)-"పద్యమానం మినోతీతి కాలం పద్మం ప్రచక్షతే, కాలమప్యఖిలం శశ్వత్ కలయంతీ స్థితా సదా"** (తాను కదులుతూనే, మిగిలిన వస్తువులను పరిచ్ఛేదిస్తుంది అనే కారణం చేత కాలాన్ని పద్మ శబ్దంతో వ్యవహరిస్తారు. ఆ కాలం అంతటిని ఎల్లప్పుడూ నిర్వహిస్తూ నేను ఉంటాను) అని "కాలంలో (నిర్వాహికగా) ఉండేది అనే ఇంకొక అర్థం కూడా లక్ష్మీతంత్రంలో తెలుపబడింది.

**"స్తుత్వా త్వనేన నామ్నా మాం కాలాతీతః కృతీ భవేత్"**

పొందుతున్నవి అని అనడంలో అడ్డులేదు కదా! అందువల్ల అందటి కీర్తి తన అధీనంలో కల్గినది అనే అర్థం కూడా ఈ నామం ద్వారా స్ఫురిస్తుంది.

**యశో యదుజ్జ్వలం లోకే విద్యాదానాదిసంభవమ్।**
**యదీయం తద్యశస్తత్ర నానారూపం విభజ్యతే॥**
**మామేవ భాజనం విద్ధి యశసస్తేజసః శ్రియః।**
**అతో యశస్వినీం తాం మాం యశసేతి విదుర్బుధాః॥**
**సప్తాక్షరో హ్యయం మంత్రో యశోదో జపతో భవేత్।**

(విద్య, ఆనందం మొదలైన వాటిచేత పుట్టినదిగా లోకంలో పలు రీతులలో పలు వస్తువులలో ప్రత్యేకంగా కనుపించే కీర్తి అంతా నా కీర్తియే. కీర్తికి, కాంతికి, అందానికి నన్నే స్థానంగా గ్రహించు. అందువల్ల విజ్ఞులు కీర్తిని కల నన్ను **"యశసా"** అని తెలిసికొన్నారు. **"ఓమ్ యశసాయై నమః"** అని ఏడు అక్షరాలను కల ఈ మంత్రాన్ని జపించేవారికి ఇది కీర్తిని కల్గిస్తుంది) అని ఈ అర్థాన్ని మంత్రవైభవాన్ని లక్ష్మీదేవి లక్ష్మీతంత్రంలో తెలిపింది.

**(జ్వలంతీమ్)**–జ్వలిస్తూ ఉన్నదానిని, అగ్నియై ఉన్నదానిని–అని భావం. **"ప్రభాసామ్"**–అనే తిరునామానికి పంచాగ్నివిద్యలో తెల్పిన అయిదు అగ్నులలోను, లౌకికాగ్నిలోను–ఆఱువిధాలైన కాంతులను చేర్పించేది–అని ఒక అర్థం చెప్పబడింది కదా! ఆ ఆఱువిధాలైన అగ్నులను స్వరూపంగా కల్గినది ఈ లక్ష్మీదేవియే–అనే అర్థాన్ని ఈ నామం చెబుతున్నది. అందువల్లనే **"ఆర్ద్రాం జ్వలంతీమ్"** అనే చోట ఉండే **"జ్వలంతీ"** అనే నామంలో పునరుక్తి లేదు.

**స్వర్గపర్జన్యభూపుంస్త్రీవైశ్వానరవిభాగతః।**
**ఆదధానా హవిః ప్రాప్తం శ్రద్ధాసోమాదిసంజ్ఞితమ్॥ 50–124**
**షోఢాఽఽత్మానం విభజ్యాహమగ్నిభావముపాగతా।**
**జ్వలంతీ మునిభిర్గీతా భోక్తృశక్తిప్రభోజ్జ్వలా॥**
**అగ్నీషోమవిభాగేన విశ్వమేవం భవామ్యహమ్।**
**మంత్రేణానేన మాం స్తుత్వా సాధయేద్యదభీప్సితమ్॥ 50–126**

(పరిశుద్ధురాలను అయిన నేను స్వర్గం, పర్జన్యలోకం, భూమి, పురుషుడు, స్త్రీ, లౌకికాగ్ని అనే ఆఱు అగ్నులై ఉంటూ, 1) శ్రద్ధ, 2) సోముడు 3) జలం 4) అన్నం 5) వీర్యం 6) హవిస్సు–అనే హవిస్సులను స్వీకరిస్తున్నాను. భోక్తృశక్తులైన ప్రభలద్వారా ప్రకాశించే అగ్నులై ఉండడంచేత "జ్వలంతీ" అని మునులచేత కీర్తింపబడుతున్నాను. ఆఱువిధాలైన అగ్నులుగాను, వాటిలో హోమం చేయబడే సోమాది ప్రభలుగాను ఉంటూ, జ్వలిస్తున్నాను కనుక నేను లోకంగా అంతా అవుతున్నాను. **"ఓమ్ జ్వలంత్యై నమః"**



కల్గినది, యశసామ్=కీర్తిని కల్గినది, జ్వలంతీమ్=ఆఱువిధాలైన అగ్నులై ఉన్నది, దేవజుష్టామ్= దేవుడైన హరితో కూడి ఉన్నది, ఉదారామ్=చాలా ఔదార్యాన్ని కల్గినది, తామ్=(పంచకృత్యాలను) నిర్వహించే ఆ, పద్మనేమీమ్=కాలానికి అతీతమైనది అయిన, శ్రియమ్= శ్రీదేవిని, అహమ్=నేను, శరణం ప్రపద్యే=శరణుపొందుతున్నాను, మే=నాయొక్క అలక్ష్మీః=దారిద్ర్యం, నశ్యతామ్=నశించుగాక, (అందుకోసం), త్వామ్=నిన్ను, వృణే=(ఉపాయంగా) వరిస్తున్నాను.

**భావము :** గడచిన మంత్రంలో లక్ష్మి ఆహ్వానింపబడగా, సమీపంలో ఆవిర్భవించిన ఆ శ్రీదేవిని ఆశ్రయణానికి తగిన ఆమె గుణాలను పురస్కరించుకొని పురుషకారంగా వేదపురుషుడు ఇందులో ఆశ్రయిస్తున్నాడు.

**(చంద్రామ్)–"చది–ఆహ్లాదనే"** –అనే ధాతువునుండి పుట్టిన ఈ శబ్దానికి లోకానికి అంతటికీ ఆనందాన్ని కల్గించేది–అని అర్థం. **"తేనాకిప్పాలామ్ తిరుమాలే"** (తేనె, పాలు వలె మధురంగా ఉండే (శ్రియఃపతీ!) అని దివ్యసూరులు భగవానుని కీర్తించడానికి అతడు ఆనందకారిణి అయిన లక్ష్మీదేవితో నిత్యం కూడి ఉండడమే కారణం. (లేక) ఆనందమయం అయిన స్వరూపరూపగుణాలను కల్గినది అని కూడా భావం.

**(చంద్రామ్)**–చంద్రునకు సహోదరియై ఉన్నది–అని భావం. పాలకడలిని దేవాసురులు చిలికినపుడు చంద్రునకు పిమ్మట అవతరించిన దానిని, చంద్రుని తనకు అంశగాను, అంటే కిరణంగాను కల్గినది–అని కూడా భావం. సమస్తలోకానికి ఆనందాన్ని కల్గించే చంద్రుడుకూడా ఈమెయొక్క కిరణమాత్రుడుగా ఉంటాడని, అంటే, ఇక ఈమె ఆనందకరత్వాన్ని పరిచ్ఛేదించడానికి సాధ్యమా! **"చంద్రభాగా"** అని, **"చంద్రవదనా"** అని, **"చంద్రసహోదరీ"** అని, **"చంద్రా"** అని, **"చంద్రికా"** అని గల లక్ష్మీసహస్రనామంలోని నామాలు ఈ పదాన్ని పలు రీతుల్లో వ్యాఖ్యానించాయి.

**ఉద్గతః ప్రథమో యోఽంశుః క్షీరసాగరమంథనే।**
**చంద్రాఖ్యః స మదీయోఽంశురుద్గచ్ఛంత్యాః పురస్సరః॥**
**ఋషయో మన్త్రభావజ్ఞా మాం తు చంద్రాం ప్రచక్షతే।**
**యస్స చంద్రో మదంశూనాం కోటికోట్యంశకోటిజః।**
**షడక్షరో హ్యయం మంత్రో మనోవైమల్యదాయకః॥ 50–116**

(పాలసముద్రాన్ని చిలికినపుడు నేను ముందుగా నా ఏ కిరణం బయటకు పైకి ప్రసరించిందో, అదే చంద్రుడనబడే నా కిరణం. నా మహిమను తెలిసిన ఋషులు నన్ను "చంద్రా" అని పిలుస్తున్నారు. లోకంలో చంద్రుడనే పేరుతో కీర్తింపబడేవాడు నా కిరణంయొక్క పలు కోట్లభాగాలలో ఒకభాగం నుండి ఉద్భవించాడు. **"ఓమ్ చంద్రాయై నమః"** అనే ఆఱు అక్షరాలను కల ఈ మంత్రం మనస్సును పరిశుద్ధం చేస్తుంది) అని

లక్ష్మీతంత్రంలో లక్ష్మీదేవి చేతనే "చంద్రా" అనే నామంయొక్క అర్థగౌరవం తెలుపబడింది.

ఈమె "చంద్రామ్" అని ఈమె పిలువబడుతున్నపుడు, చంద్రునివరకు మాత్రమేనా ఈమె ప్రకాశం ఉంటుంది? అని అంటే, అందుకు సమాధానాన్ని తరువాతి నామం తెలుపుతున్నది.

**(ప్రభాసామ్)**–మిక్కిలి గొప్పకాంతిని కల్గిన దానిని. వేఱు ఏ కాంతిచేత నిర్జింపబడడానికి సాధ్యం కాని కాంతిని కల్గిన దానిని. **"న తత్ర సూర్యో భాతి"** అని కాంతి కల్గిన అన్ని వస్తువులకు కాంతిని కల్గించే అతడు సైతం **"శ్రద్ధయా దేవో దేవత్వమశ్నుతే"** (లక్ష్మీచేత పరమాత్మ పరంజ్యోతి అవుతున్నాడు) అని, **"అతీవరామః శుశుభే"** (రాముడు సీతచేత మిక్కిలి ప్రకాశించాడు) అని, **"తికళ్ కిన్తతిరుమార్బిల్ తిరుమఙ్గై తన్నోడుమ్ తికళ్ కిన్త తిరుమాలార్"** (శఠకోపసహస్రం 10-6-9) (అందమైన వక్షఃస్థలంలో ప్రకాశించే లక్ష్మీదేవితో ప్రకాశించే శ్రియఃపతి) అని అన్నట్లు ఈమెవల్ల కాంతిని పొందుతున్నాడు కాబట్టి ఈమె కాంతియే చాలా గొప్పకాంతి అని అనడంలో అడ్డులేదు కదా!

**ప్రకృష్యమాణా భాసో మే సర్వావస్థాసు సర్వదా।**
**యేనేచ్ఛతి తిరోధాతుం తన్మే భాసా తిరోహితమ్॥**
**యదా హి స్వశిరశ్ఛాయా స్వపదా నైవ లంఘ్యతే।**
**సా పదాదగ్రతో యాతి యేన లంఘనమిచ్ఛతి॥**
**నిత్యోదితచిదానందా మత్ప్రభాః సతతోజ్జ్వలాః॥**

(ఎల్లప్పుడు అన్ని స్థితులలోను నా కాంతులు చాలా ఉన్నతంగా ఉంటాయి. ఏ కాంతిచేత నా కాంతిని ఒకడు మఱుగుపఱచాలని ప్రయత్నిస్తాడో, ఆ కాంతి నా కాంతిచేత ఆచ్ఛాదింపబడుతున్నది. తన శిరస్సు నీడను తన కాలితో దాటటం సాధ్యం కానిపని కదా! ఏ కాలితో ఇతడు దాటాలని తలుస్తాడో, ఆ కాలికి ముందుగానే కదా ఆ శిరస్సునీడ వెడుతుంది. ఎల్లప్పుడూ ఉండే జ్ఞానానందమయం అయిన నా కాంతులు మిగిలిన కాంతులకంటే ఎల్లప్పుడూ చాలా గొప్పగా వెలుగుతాయి) అని లక్ష్మీదేవి చేతనే ఈ అర్థం లక్ష్మీతంత్రంలో చెప్పబడింది.

**(ప్రభాసామ్)–"ప్రభాః అస్యతీతి ప్రభాసా"** (కాంతులను అగ్నిలో చేరుస్తున్నది కనుక "ప్రభాసా" అనబడుతున్నది) అనే అర్థాన్ని చెప్పవచ్చు. జ్ఞానప్రకాశం నిండిన ఈ జీవుడు కర్మఫలానుభవం కోసం ఈ లోకంలో జన్మించే ప్రకారాన్ని పంచాగ్నివిద్య అనే పేరుతో వేదం వివరిస్తున్నది. అందులో చేతనుడనే ఈ కాంతి అయిదు నామాలతో అయిదు అగ్నులలో ప్రవేశించి, బయలుదేరి, దేహసంబంధాన్ని పొంది, జన్మిస్తున్నాడు–అని చెప్పబడుతున్నది. "శ్రద్ధ, సోముడు, జలం, అన్నం, వీర్యం" అనే పేర్లను పొంది, "స్వర్గం, మేఘం, భూమి, పురుషుడు, స్త్రీ" అనే అయిదు అగ్నులలో ఆహుతి చేయబడి, అయిదవ



అగ్ని అయిన స్త్రీ గర్భంలో నుండి వెలువడుతున్నది అని ఘోషింపబడుతున్నది. ఈ అయిదు అగ్నులలో ఉండే శ్రద్ధ మొదలైన అయిదు కాంతులు కాకుండా, లోకప్రసిద్ధాలైన అగ్నులలో ఆహుతిచేయబడే హవిస్సు అనే కాంతి ఒకటి ఉన్నది. ఈ ఆఱు కాంతులను ఆయా అగ్నులలో చేర్పిస్తున్నది కనుక లక్ష్మి "ప్రభాసా" అనబడుతున్నది.

**శ్రద్ధాం సోమమపోఽన్నం చ వీర్యం హవిరితి క్రమాత్।**
**భోగ్యశక్తి ప్రభా ఏతా అస్యంతీ షట్సు వహ్నిషు।**
**ప్రభాసా మునిభిః ప్రోచ్యే తంత్రవేదాంతపారగైః॥ 50-120**
సప్తాక్షరో హ్యయం మంత్రస్తేజస్సంతతిసాధకః॥

(శ్రద్ధ, సోముడు, జలం, అన్నం, పురుషుని వీర్యం, దేవతల హవిస్సు–అనే ఈ ఆఱు భోగ్యశక్తులై ఉండే కాంతులను స్వర్గం మొదలైన అగ్నులలో వరుసగా చేర్పిస్తున్నది కనుక, తంత్రవేదాంతాలపారం చూచిన మునులచే **"ప్రభాసా"** అని చెప్పబడుతున్నాను. **"ఓమ్ ప్రభాసాయై నమః"** అనే ఏడు అక్షరాలను కల ఈ మంత్రం కాంత్యతిశయాన్ని కల్గిస్తుంది) అని లక్ష్మీతంత్రంలో కూడా ఈ మంత్రవైభవం, ఈ వేదార్థం ప్రకటించబడ్డాయి.

**(యశసామ్)**–కీర్తిని కల్గినది–అని భావం. దేహకాంతితో మాత్రమే కాకుండా, ఆత్మకాంతి అనే కాంతిని కల్గినది–అని భావం. **"ఉలకమ్ నిఱైన్త పుకళాల్ తిరుమకళ్ పోల్ వళర్త్తేన్"** (పెరియాళ్వార్-3-8-4) (లోకం అంతా నిండిన కీర్తితో లక్ష్మీదేవివలె పెంచాను) అని అన్నట్లు కీర్తిని కలవారికి ఉపమానంగా చెప్పేటట్లు ఉంటుందికదా ఈ లక్ష్మీదేవి. **"మరుత్తార్ తొల్ పుకళ్ మాదవనై వరత్తిరుత్తాయ్ శెమ్బోత్తే"** (కలివైరిసూరిసూక్తం -10-10-1) (సువాసన నిండిన మాలికను అలంకరించుకొన్నవాడై, నిత్యసిద్ధం అయిన కీర్తిని కలవాడైన మాధవుని వచ్చేటట్లు పిలవాలి ఓ శెమ్బోత్తు పక్షీ) అని, **"అకల కిల్లేన్ ఇఱైయుమెన్ఱు అలర్ మేల్ మఙ్గై యుఱై మార్బా! నికరిల్ పుకళాయ్"** (క్షణం అయినా విశ్లేషించి ఉండేను అని అలర్మేల్మఙ్గై నిత్యవాసం చేసే వక్షఃస్థలాన్ని కలవాడా! సాటిలేని వాత్సల్యగుణాన్ని కలవాడా)(శఠకోపసహస్రం-6-10-10), **"మన్ను పెరుమ్పుకళ్ మాదవన్"** (నాచ్చి తిరు-5-1) (స్థిరంగా ఉండే, గొప్పకీర్తిని కల మాధవుడు) అనే రీతిలో అతడు కీర్తిని పొందటం కూడా అతని కీర్తి స్థిరంగా ఉండడంకూడా ఈమె వల్లనే! అతడు కీర్తిని పొందటంకూడా ఈమె వల్లనే అయినపుడు

**యద్యద్విభూతిమత్ సత్త్వం శ్రీమదూర్జితమేవ వా।**
**తత్తదేవావగచ్ఛత్వం మమ తేజోఽంశసంభవమ్॥** (గీత-10-41)

(ఐశ్వర్యం నిండినవి కాంతిని కల్గినవి, స్థిరమైనవి అయిన ఏయే వస్తువులు ఉన్నాయో, ఆయా వస్తువులు అన్నీ నా తేజస్సుయొక్క ఒకభాగం నుండి ఉద్భవించాయని తెలిసికో) అని ఇతనిని ఆశ్రయించి పేరును పొందేవి అన్నీ ఈమె వల్లనే ఆ పేరును

(ఓ దేవీ, కామోదకి అనే గదను ధరించినవాడు, దేవదేవుడు అయిన భగవానుని యొక్క, యోగులకు మాత్రమే భావించతగినది, సర్వయజ్ఞమయమైనది అయిన శరీరంలో నీవు తప్ప ఇంక వేఱెవ్వరు నిత్యం నిలచి ఉన్నారు!) అనే రీతిలో ఈ అతిశయం ఇంకొకరికి ఎవ్వరికీ లేదు. తన గుణాలతో, ఐశ్వర్యాలతో ఈశ్వరుని గుణాలను, ఐశ్వర్యాలను అనుభావ్యాలుగా, రస్యాలుగా చేస్తుంది కనుక ఈమె గుణవిభూతుల సంయోగం కూడా లోకవిలక్షణంగానే ఉంటుంది. ఈ కారణాలవల్లనే **"లోకే దేవజుష్టామ్"** (ఉభయవిభూతుల లోను అంటే ఇహలోక, పరమపదాలలోను భగవానునితో–అంటే దేవశబ్ద వాచ్యుడైన భగవానునితో ఎల్లప్పుడూ కలసి ఉండి, ఆనందిస్తుంది) అని ఈమె నిర్దేశింపబడుతున్నది.

**శాంతానందమహావిభూతిపరమం యద్బ్రహ్మరూపం హరేః**
**మూర్తం బ్రహ్మ తతోఽపి తత్ప్రియతరం రూపం యదత్యద్భుతమ్।**
**యాన్యన్యాని యథాసుఖం విహరతో రూపాణి సర్వాణి తా–**
**న్యాహుః స్వైరనురూపరూపవిభవైః గాఢోపగూఢాని తే॥**

(షడూర్మలను లేనిదై, ఆనందమయమైనదై, గొప్ప విభూతులను కల్గినదై, తనకంటే మించినది ఏదీ లేనిదై, గొప్పదై ఉండడం వల్లను, ఇతరులను పెద్దగా చేయడం వల్లను బ్రహ్మశబ్దం చేత వ్యవహరింపబడే హరియొక్క ఏ స్వరూపం ఉన్నదో) దానికంటే ఆ భగవానునకు మిక్కిలి ప్రియంగా ఉండేవి, కంటితో దర్శింపగలిగేది, బ్రహ్మశబ్దం చేత వ్యవహరింపబడేది, చాలా అద్భుతమైనదైన ఆ స్వామియొక్క ఏ రూపం ఉన్నదో, యథేచ్ఛంగా విహరించే భగవానునకు ఇంకా ఏయే కొన్ని రూపాలున్నాయో ఆ రూపాలన్నీ నీకు అసాధారణాలై, అనురూపాలై ఉండే దివ్యరూపాలచేత చక్కగా, గాఢంగా సంశ్లేషింపబడినవై ఉంటాయి అని ప్రమాణాలు తెలుపుతున్నాయి) అని భగవద్యామునులు చతుఃశ్లోకి అనే స్తోత్రంలోను, **"భగవన్నారాయణాభిమతానురూపస్వరూపరూపగుణ"**) (భగవానుడైన నారాయణునకు ఇష్టంగాను, తగినవిగాను ఉండే స్వరూపరూపగుణాలను కల లక్ష్మి) అని భగవ- ద్రామానుజులు, **"ఆత్మన్యాత్మా వపుషి చ వపుః వైభవైర్వైభవం చేత్యాకారైస్తైరనుగుణతయా సర్వభావానుయాతా, ఇచ్ఛారూపాణ్యపి భగవతః స్వాదయంత్యాత్తరూపా"** (భగవానుని స్వరూపంలో తన స్వరూపం, అతని దేహంలో తనదేహం, అతని విభూతులలో తన వైభవం పొందికగా ఉండేటట్లు ఇష్టమైన ఆకారాలతో అతనికి తగినదై, అతని అన్ని అవస్థలలోను అనుసరించేదై, అతని ఇచ్ఛచేత పరిగ్రహింపబడ్డ అవతారరూపాలను, వాటితో పొందికగా ఉండే రూపాలను ఎత్తడం ద్వారా ఆనందింపజేసే లక్ష్మీదేవి) అని అభియుక్తులు ఈ అర్థాన్ని తెలిపారు.

**(శ్రియం లోకే దేవజుష్టాముదారామ్) –"దేవజుష్టామ్"** అని **"శ్రీయతే"** (అందఱిచేత ఆశ్రయింపబడేది) అని, **"శ్రయతే"** (భగవానుని ఆశ్రయించి ఉండేది) అనే రెండు వ్యుత్పత్తుల చేత సిద్ధం అయిన అర్థాన్ని పల్కి, ఆ అర్థాలను చూపే నామాన్ని "శ్రియమ్" అని అంటూ



అని ఆఱు అక్షరాలను కల్గిన ఈ మంత్రంద్వారా నన్ను స్తుతించి, కోరిన దానిని దేనినైనా పొందవచ్చు) అని ఈ అర్థాలు మంత్రమహిమ లక్ష్మీతంత్రంలో తెలుపబడ్డాయి.

**(యశసా జ్వలంతీమ్)**– యశస్వినిగాను, అగ్నిస్వరూపిణిగాను ఉన్నది–అనే రెండు తిరునామాలుగా లక్ష్మీదేవి కల్గి ఉన్నది–అని భావం. భగవానుని ధర్మపత్ని అని మొదలైన యశస్సులతో ప్రకాశించేది" అని ఒకే తిరునామంగా గోమఠరంగనాథ వ్యాఖ్యానంలో స్వీకరింపబడి, అర్థం చెప్పబడింది.

**(దేవజుష్టామ్)–"జుష–ప్రీతిసేవనయోః"** అనే ధాతువునుండి పుట్టినది కావటంవల్ల, దేవుడైన హరితో కలసి ఉండి, ప్రీతిని పొందుతున్నది అనే అర్థాన్ని ఈ నామం ఇస్తున్నది. పర–వ్యూహ–విభవ–అంతర్యామి–అర్చలు అనబడే అయిదు స్థితులలోను భగవానునితో **"అకల కిల్లేన్ ఇఱైయుమ్"** అని అన్నట్లు కలసి ఉండి, ఆనందాన్ని పొందేది.

**"కుళఱ్కోవలర్ కుడప్పావైయుమ్ మణ్మకళుమ్ తిరువుమ్ నిళఱ్పోల్వనర్"** (పిల్లనగ్రోవిని నిరూపకంగా కల్గిన నీళాదేవి, భూదేవి, లక్ష్మీదేవికి ఛాయలవంటివారు) (తిరువిరుత్తమ్–    ), **"తిరుమాల్వైకున్దమ్"** (శ్రియఃపతియొక్క వైకుంఠం), **"మాదవన్ వైకున్దమ్"** (మాధవుని వైకుంఠము), **"వడివుడై మాదవన్ వైకున్దమ్"** (గొప్పసుందర రూపాన్నికల మాధవుని వైకుంఠం), **"వానుడై మాదవా"** (వైకుంఠాన్ని కల మాధవా!) అని పరస్వరూపంలోను, **"తిరుమాల్ తిరుప్పాఱ్కడలే"** (శ్రియఃపతియొక్క క్షీరాబ్ధి), **"అరవత్త మళియనోడుమ్ అళకియపాఱ్కడలోడుమ్ అరవిన్దప్పావైయుమ్ తానుమ్"** (ఆదిశేషుడనే శయ్యతో, అందమైన క్షీరాబ్ధితోపాటు అరవిందనివాసిని, తాను) అని వ్యూహరూపంలోను, **"మైదిలియిన్ మణవాళా"** (మైథిలికి పెనిమిటి అయినవాడా!), **"ఆయల్కులముదలే మాదవా మరామరజ్గళ్ ఎళుమెయ్దాయ్"** (గోపాలకులనాయకా! మాధవా! ఏడు సాలవృక్షాలను భంజించినవాడా), **"వామనన్ మాదవన్"** (వామనుడైన మాధవుడు) అని వామన రామకృష్ణాద్యవతారాలలోని అన్ని విభవరూపాలలో, **"అరవిన్దప్పావైయుమ్ తానుమ్ అకమ్బడి వన్దు పుకున్దు"** (అరవిందనివాసిని, తాను మనస్సులోపలకు వచ్చి ప్రవేశించి), **"మార్వమెన్బదోర్కోయిల్ అమైత్తు మాదవన్ ఎన్నుమ్ దెయ్వత్తై నాట్టి"** (హృదయం అనే ఒక కోవెలను నిర్మించి, అందులో మాధవుడనే దైవాన్ని ప్రతిష్ఠించి), **"తిరుమాలై, పిరియాదువన్దుఎనదు మనత్తిరున్ద వడమలైయై"** (శ్రియఃపతిని, విడువకుండా వచ్చి నా మనస్సులో ఉన్న వేంకటాచలాధీశుని) అని అంతర్యామి స్థితిలోను, **"తిరువుడైయాళ్ మణవాళా! తిరువరజ్గత్తేకిడన్దాయ్"** (లక్ష్మీవల్లభా! శ్రీరంగంలో శయనించినవాడా!), **"వేజ్గడత్తెన్ తిరుమాల్"** (వేంకటాద్రిలోని నా శ్రియఃపతి) **"తిరువిళైయాడు తిణ్దోళ్ తిరుమాలిరుమ్ శోలైనమ్బీ!"** (లక్ష్మీదేవితో క్రీడించే బలిష్ఠమైన బాహువులనుకల వనగిరిలోని గుణపూర్ణా!) ఇత్యాదిగా అర్చారూపాల సన్నివేశంలోను భగవానుడు లక్ష్మీదేవితో కలిసే వేంచేసి ఉన్నాడు–అనే పరమార్థాన్ని దివ్యసూరులనబడే ఆళ్వార్లు తెలియజేశారు.

**(దేవజుష్టామ్)**–బ్రహ్మ, శివుడు మొదలైన దేవతలచేత, అనంతగరుడాది నిత్యసూరులచేత సేవింపబడేది–అనే అర్థాన్ని గ్రహించవచ్చు. **"జుష–ప్రీతిసేవనయోః"** అని కదా ధాతువు. **"తిరుమాఱ్కరవుశెన్నాల్ కుడైయామ్"** (సరోయోగి ప్రబంధం) (శ్రియఃపతి వేంచేసేటపుడు ఆదిశేషుడు గొడుగుగా అవుతాడు) **"అణైవదు అరవణైమేల్ పూమ్పావైయాకమ్ పుణర్వదు"** (పరుండేది ఆదిశేషుడనేశయ్యపై, సంశ్లేషించడం లక్ష్మీదేవి వక్షస్సును), **"నాకణైయిల్ తుయిల్వానే! తిరుమాలే"** (ఆదిశేషుడనే పడుకపై నిద్రించేవాడా! (శ్రియఃపతీ) **"పుళ్ ఉవన్దేఱుమ్ పూమకళార్తనిక్కేళ్వన్"** (గరుడుణ్ణి సంతోషంగా అధిరోహించే లక్ష్మీవల్లభుడు) అని కీర్తించిన రీతిలో అనంతగరుడాది నిత్యసూరుల చేత, **"నీరేఱు శెఞ్జడై నీలకణ్టనుమ్ నాన్ముకనుమ్ ముఱైయాల్ శీరేఱువాశకమ్ శెయ్యనిన్ఱతిరుమాల్"** (భస్మధారి, ఎఱ్ఱని జటలను కల నీలకంఠుడు, చతుర్ముఖుడు విధి ప్రకారం గొప్ప పురుషసూక్తంతో అర్చిస్తుండగా వేంచేసి ఉండే శ్రియఃపతి), **"ఎణ్మర్ పదినొరువర్ ఈరఱువర్ ఓరిరువర్ వణ్ణమలరేన్దివైకలుమ్, నణ్ణి ఒరుమాలైయాల్ పరవి ఓవాదు ఎప్పొళుదుమ్ తిరుమాలైక్కై తొళువర్ శెన్ఱు"** (అష్టవసువులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, అశ్వినీదేవతలు రంగురంగుల పూలనుగైకొని నిత్యం సమీపించి, అద్వితీయమైన పురుషసూక్తాది వాఙ్మాలతో స్తుతించి, ఎల్లప్పుడు ఎడతెగక లక్ష్మీసమేతుడైన స్వామిని చేరి నమస్కరిస్తారు) అని బ్రహ్మరుద్రాదిదేవతలుకూడా లక్ష్మీదేవిని సేవిస్తారు–అనే అర్థాన్ని దివ్యసూరులు కూడా పలికారు కదా!

**(దేవజుష్టామ్)–"దివు–క్రీడా"** –అని ధాతువు కాబట్టి జీవునకు విషయానుభవం అనే లీలలకు ఉపకరణంగా ఉండే ఇంద్రియాలను దేవశబ్దంతో వేదంలో వ్యవహరించే పరిపాటి ఉన్నది. ఆ ఇంద్రియాలతో పొందే విషయానుభవాన్నిగూర్చి ఆశ్రయింపబడేది అనే అర్థాన్ని చెప్పవచ్చు. హృషీకాలనే ఇంద్రియాలను నియమించడంవల్ల హృషీకేశుడు అనే పేరు పొందినవాని పత్ని కాబట్టి ఇంద్రియాలను నియమించగల ఈశ్వరిగా ఉంటుంది–అన్నది సారభూతమైన అర్థం. ఇందువల్లనే కదా **"కోవాయైవరెన్ మెయ్కుడి యేఱి క్కుఱై శోఱివైతావెన్ఱు కుమైత్తు ప్పోకార్ నానవరైప్పెఱుక్కకిలేన్, పునితా! పుళ్కొడియాయ్! నెడుమాలే! తీవాయ్ నాకణైయిల్ తుయిల్ వానే! తిరుమాలే! ఇనిచ్చెయ్ వదొన్ఱఱియేన్"** (పరకాలసూరిసూక్తం7–7–9) (పావన స్వరూపా! గరుడధ్వజా! సర్వాధికా! పగవారిపై నిప్పును కక్కే సర్పాధిపుడైన ఆదిశేషునిపై శయనించి ఉన్నవాడా! శ్రియఃపతీ! పంచేంద్రియాలు నన్ను శాసించేవై, నా శరీరంలో నివాసాన్ని ఏర్పరచుకొని "మాకు కూడూ, గుడ్డ ఇవ్వాలి" అని నిర్బంధిస్తూ, భయపెడుతూ నన్ను విడచిపోవడం లేదు. నేను వాటిని సహించలేకుండా ఉన్నాను. నిన్ను రక్షకునిగా ఆశ్రయించిన తరువాత నా హితం కోసం నేను చేయవలసినదానిని దేనినీ తెలియలేను సుమా!) అని అంటూ తమ ఇంద్రియాలను నియమించాలని భగవానుని ఆశ్రయించేటపుడు లక్ష్మీదేవి పురస్సరంగా



ఈ ఆశ్రయణాన్ని చేశారు కదా!

**(దేవజుష్టామ్)**–దేవుడనే హరిచేత ప్రీతివిషయీకృత అయినదని భావం. భగవానుని ప్రీతిపాత్రురాలు–అని సారం.

**దేవేన హరిణా జుష్టా సదా దేవైశ్చ సేవితా।**
**దేవాశ్చ మాముపాశ్రిత్య విషయాన్ ప్రత్యవస్థితా॥**
**పరిణామవిశేషత్వాత్ ప్రకృతేస్తే హ్యచేతనాః।**
**అతో మచ్ఛక్తిమాదాయ శుద్ధసంవిత్క్రియామయీమ్।**
**విషయేషు ప్రవర్తంతే శ్రోత్రవాఙ్మనఆధయః**
**వృత్త్యర్థే సేవితామక్షైర్దేవజుష్టాం తు మాం విదుః।**
**సర్వశక్తిప్రదామంతర్దేవజుష్టామవస్థితామ్।**
**శశ్వన్మామనుసంచిత్య దేవాన్ విజయతేఽఖిలాన్॥ 50–130**

(దేవుడైన హరితో కలిసి ఉండి ఆనందాన్ని పొందుతున్నది, దేవతలచే ఎల్లప్పుడు సేవింపబడేది. త్వక్కు, వాక్కు, కన్ను, ముక్కు, చెవి అనే అయిదు ఇంద్రియాలనే నన్ను ఆశ్రయించే విషయాలను అనుభవిస్తున్నారు. ఆ ఇంద్రియాలు ప్రకృతివికారాలు కనుక జ్ఞానహీనాలే. అందువల్ల శుద్ధమైన జ్ఞానక్రియారూపంగా ఉండే నా శక్తిని గ్రహించి అవి విషయాలలో అభినివిష్టాలవుతున్నాయి. ఇంద్రియాలచేత విషయానుభవంకోసం సేవింపబడేదానను కనుక నన్ను "దేవజుష్టా" అని తెలిసికొంటున్నారు. అన్ని శక్తులను ఇస్తూ లోపల ఉండే నన్ను ఎల్లప్పుడూ **"ఓమ్ దేవజుష్టాయై నమః"** అని ధ్యానించేవాడు నిత్యసూరులు, బ్రహ్మాదులు, ఇంద్రియాలు–అనే అందఱు దేవతలను జయిస్తున్నాడు) అని ఈ మూడు అర్థాలు, మంత్రంయొక్క మహిమ లక్ష్మీదేవిచేత చెప్పబడింది.

**(లోకే దేవజుష్టామ్)**–ఇతర చేతనులకంటే భగవానునితో కూడి ఉండేది–అనే గొప్పతనాన్ని తాను ఒక్కతే మాత్రమే పొందింది. మిగిలినవారికి ఈ గొప్పతనం లేదా? అని అంటే, సకలచేతనాచేతనాలు భగవానునితో విడదీయడానికి వీలులేనట్లు కూడినవై ఉన్నా, లక్ష్మీదేవికి స్వామితో ఉండే సంబంధం అత్యంతం విలక్షణంగా ఉంటుంది. లక్ష్మీదేవి స్వరూపరూపగుణ విభూతులు అన్నీ సర్వేశ్వరుని స్వరూపాదులతో చాలా సన్నిహితమైన, అవిభాజ్యమైన చేరికను కల్గి ఉండేవి–అనే విషయం సకల శాస్త్రసిద్ధమైన అర్థం. అతని స్వరూపం ఉన్నచోట అంతటా, వ్యక్తిని ఆశ్రయించి ఉండే జాతివలె, లక్ష్మీదేవి తాను కూడా అతనిని ఆశ్రయించి ఉంటుంది. ఈ అతిశయం ఇంకొకరికి లేదు. అతని పరత్వవ్యూహాది అయిదు అవస్థలలోని రూపాలను **"అకలకిల్లేన్ ఇఱైయుమ్"** (క్షణకాలం అయినా విడచి ఉండలేను) అని నిత్యం లక్ష్మీదేవి ఆశ్రయించి ఉంటుంది.

**కా త్వన్యా త్వామృతే దేవి! సర్వయజ్ఞమయం వపుః।**
**అధ్యాస్తే దేవదేవస్య యోగిచింత్యం గదాభృతః॥**

మేఘాలతో నిండిన ఆకాశంలో మెఱుపువలె ప్రకాశించే, అందమైన తామర పూలవంటి కన్నులు కల, తేనెతో నిండిన పద్మంలో నివసించే మహాలక్ష్మి మనకు సదా ప్రాప్యురాలు) (సరోయోగి ప్రబంధం-100) ఇత్యాదిగా ఆళ్వార్లు అనబడే దివ్యసూరులు లక్ష్మీదేవి ఔదార్యంతోనే ఐశ్వర్యకైవల్యపరమపదాలు మూడు చేతనులకు సిద్ధిస్తున్నవి- అని కీర్తించారు.

**సర్వకామప్రదాం రమ్యాం సంసారార్ణవతారిణీమ్।**
**క్షిప్రప్రసాదినీం దేవీం శరణ్యాం చింతయేదితి॥**

(అన్ని అభీష్టాలను అనుగ్రహించేది, అందమైనది, సంసారసాగరాన్ని దాటింపజేసేది, శీఘ్రంగా అనుగ్రహించేది అయిన లక్ష్మీదేవిని శరణు పొందదగినదిగా భావించదగినది) అని స్వాయంభువంలోను, **"ఆత్మవిద్యా చ దేవి! త్వం విముక్తిఫలదాయినీ"** (దేవీ! నీవే ఆత్మజ్ఞాన ప్రదాయినిగాను, ముక్తిఫలాన్ని ఇవ్వడమే స్వభావంగా కల్గినదానివిగాను ఉన్నావు) అని శ్రీవిష్ణుపురాణంలోను (1-9-20), **"సకృద్విభాతా సర్వార్తిసముద్రపరిశోషిణీ, భవభంగాపహారిణీ పరనిర్వాణదాయినీ"** (శీఘ్రంగా సాక్షాత్కరించేది, సమస్తదుఃఖాలనే సముద్రాన్ని పూర్తిగా ఇంకింపజేసేది, సంసారం అనే భంగాన్ని (నైచ్యాన్ని) అపహరించేది, గొప్పదైన మోక్షాన్ని అనుగ్రహించేది) అని శ్రీసహస్రనామంలోను, **"పద్మయోనిరిదం ప్రాప్య పఠన్ స్తోత్రం తతఃపరమ్, దివ్యం చాష్టగుణైశ్వర్యం తత్ప్రసాదాచ్చ లబ్ధవాన్"** (భగవానుని నాభీకమలంనుండి పుట్టిన చతుర్ముఖుడు ఈ స్తోత్రాన్ని పొంది, పఠించి, దానికి పిమ్మట దివ్యమైన, ఎనిమిది విధాలైన ఐశ్వర్యాన్ని ఆ లక్ష్మీదేవి అనుగ్రహంచేత పొందాడు) అని, **"బ్రహ్మాదీనాం యదాయత్తం వైభవం యస్య సా స్వయమ్, తస్య కైముత్యనిర్ధార్యమీశ్వరత్వం శ్రియఃపతేః"** (బ్రహ్మాదుల వైభవం ఎవరివల్ల కల్గుతుందో, ఆ లక్ష్మీదేవి ఎవరికి శేషభూతయై ఉన్నదో, ఆ శ్రియఃపతి యొక్క ఈశ్వరత్వం కిం పునఃన్యాయసిద్ధం) అని బ్రహ్మపురాణంలోను లక్ష్మీదేవియొక్క సకలఫలప్రదత్వం అనే ఔదార్యం ఉద్ఘోషింపబడింది.

ఈ విధంగా ఈమె సకలఫలాలను ఇచ్చేది అయితే, **"మోక్షప్రదత్వే సతి చేతనత్వమ్"** (మోక్షాన్ని అనుగ్రహించేదిగా ఉంటూ చైతన్యాన్ని కల్గిన తత్త్వమై ఉండడం) అనే బ్రహ్మలక్షణం ఈమెకు కూడా వర్తిస్తుంది కనుక-"నారాయణుడు ఒక్కడే పరతత్త్వం"- అనేది ఏ విధంగా పొసగుతుంది?-అని అంటే, పరబ్రహ్మ లక్షణానికి ఈమె వద్ద ఏ రీతిలోను అతివ్యాప్తి రాదు కనుక, నారాయణుడొక్కడే పరతత్త్వం అన్నది శిలాశాసనం. అయితే, లక్ష్మీదేవి ఇతరులకు మోక్షాన్ని ఇవ్వడం ఏ రీతిలో? అని విచారిస్తే-

**ఆకించన్యైకశరణాః కేచిద్భాగ్యాధికాః పునః।**
**మత్పదాంభోరుహద్వంద్వం ప్రపద్య ప్రీతిమానసాః॥**
**లక్ష్మీం పురుషకారేణ వృతవంతో వరాననే।**
**మత్ క్షమాం ప్రాప్య సేనేశ! ప్రాప్యం ప్రాపకమేవ మామ్॥**
**లబ్ధ్వా కృతార్థాః ప్రాప్స్యంతే మామేవానన్యమానసాః॥**



శ్రీసూక్తం పఠిస్తున్నది.

**(శ్రియమ్)** -పురుషకారత్వాన్ని సుస్పష్టం చేసే ఈ నామంలో ఉండే పలు అర్థాలు ఇంతకు ముందే వివరింపబడ్డాయి.

**(ఉదారామ్)**-గొప్ప ఐశ్వర్యాన్ని కల్గిన దానిని. భక్తులకు అన్నిటినీ ఇచ్చినా దేనినీ ఇవ్వలేకపోయానే! అనే ఔదార్యానికి అంకురక్షేత్రంగా ఉన్నదానిని-అని భావం.

**ఐశ్వర్యమక్షరగతిం పరమం పదం వా**
**కస్మైచిదంజలిభరం వహతే వితీర్య।**
**అస్మై న కించిదుచితం కృతమిత్యథాంబ!**
**త్వం లజ్జసే కథయ కోఽయముదారభావః॥**

(తల్లీ! ఐశ్వర్యం, కైవల్యం, పరమపదం మొదలైన వీనిని కేవలం అంజలి అనే భారాన్ని మోసేవానికి అనుగ్రహించి, "ఇతనికి తగినదానిని ఏదీ ఇవ్వలేకపోయానే!" అని నీవు లజ్జిస్తావు. ఇదేమి ఔదార్యమమ్మా! చెప్పు) అని అంటూ శ్రీపరాశరభట్టర్ శ్రీగుణరత్నకోశం అనే లక్ష్మీస్తుతిలో ఈ నామంయొక్క భావాన్ని వ్యాఖ్యానించారు. దీని వివరం కొంచెం తెలుపబడుతున్నది.

**(ఐశ్వర్యం అక్షరగతిమ్)**-సకలఫలాలను ఇచ్చేవాడైనా మోక్షాన్ని తప్ప మిగిలిన ఫలాలను సులభంగా ఇవ్వని హితపరుడైన, **"అవ్యయః పితా"** అయిన సర్వేశ్వరునివలె కాకుండా, ప్రియపరురాలై, అఖిలజగత్తుకు తల్లి కాబట్టి ఒక అంజలిని మాత్రం చేస్తే ఐశ్వర్యకైవల్యాలను కూడా అనుగ్రహిస్తుంది. **(పరమం పదం వా)-"సిద్ధిర్భవతి వా నేతి సంశయోఽచ్యుతసేవినామ్, న సంశయోఽస్తి తద్భక్తపరిచర్యారతాత్మనామ్"** (అచ్యుతుని భక్తులకు మోక్షసిద్ధి కలుగుతుందా? లేదా? అనే సందేహం కలుగవచ్చు. కాని, ఆ అచ్యుతభక్తులను సేవించే వారికి మాత్రం ఈ సందేహం లేనే లేదు) అనే న్యాయాన్నిబట్టి స్వతంత్రుడైన అతనిని ఆశ్రయించినవారికి పరమపదప్రాప్తి కల్గుతుందనే నిశ్చయం లేదు. కాని, ఈమెను ఆశ్రయిస్తే అది కల్గడం నిశ్చయం. **(కస్మైచిత్)**-ఆశ్రయించినవాడు ఎటువంటివాడైనా సరే! ఆర్ద్రాపరాధినులైన రాక్షస స్త్రీలుకూడా కావచ్చు. వారు **"శరణమ్"** అనే మాట కూడా చెప్పనక్కఱలేదు.

**(అంజలిభరమ్)**-అంజలి చేయడం-రెండు చేతులను జోడించి కలిపి పట్టుకోవడం-అనే బరువును ఆ భక్తుడు ఒక అంజలిని చేయడం ఒక్కటే ఆలస్యం. అది లక్ష్మీదేవి సుకుమారమైన చిత్తానికి గొప్ప భారమే అవుతుంది. **(అంజలిభరం వహతే)**-అంజలి భారాన్ని మోసేవానికి అతడు తాను అతి సులభంగా ఆ అంజలిని ఏ విధంగా మోస్తున్నాడు? ఏదో సహించరాని, మోయలేని ఒక పెద్ద బరువును తన తలపై పెట్టుకొని ఉన్నట్లు ఇతనికి (జీవునకు) తోస్తుంది. ఎందుకంటే ప్రాప్తవిషయంలో సుఖరూపం అయిన ఈ

సేవను చేయడంలో అలవాటుపడినవాడు కాదు కదా! ఇది భక్తుని అభిప్రాయానుగుణంగా చేసిన వివరణం. లేక, భక్తుడు చేసే అంజలిని చూచి ఈమె అతడేదో పెద్ద మోయలేని భారాన్ని మోస్తున్నట్లు తలుస్తుంది–అని లక్ష్మీదేవి అభిప్రాయానుసారంగా కూడా చెప్పవచ్చు. **(వితీర్య)**–బిడ్డ మనస్సు రాయి అయినా, తల్లి మనస్సు పిచ్చిది, వ్యామోహం కల్గినది కదా! అందువల్ల ఆ కఠినాత్మునికూడా తల్లి కరుణిస్తుంది. **(అస్మై న కించిదుచితం కృతమ్)**–అయ్యో! ఇతడు ఎంత శ్రమపడ్డాడు! ప్రతిగా నేను ఏమి చేయగలిగాను! **"ఋణం ప్రవృద్ధమివ మే హృదయాన్నాపసర్పతి"** (ద్రౌపది ఆక్రందన వడ్డీతో పెరిగిన అప్పువలె నా మనస్సునుండి తొలగిపోవడం లేదు) అని అన్నట్లు అయినదే–అని చాలా బాధ పడుతుంది లక్ష్మీదేవి. ఇంతమాత్రమేనా, **(త్వం లజ్జసే)**–తల్లి ముఖాన్ని చూడడానికి సిగ్గుపడే రీతిలో పలువేల పాపాలను చేసిన ఆ పాపిని సైతం చూడడానికి లక్ష్మీదేవి సిగ్గుపడుతుంది–"ఇతడు పశ్చాత్తాపంతో చేసిన దానికి తగిన ప్రత్యుపకారాన్ని ఏమీ చేయలేకపోయానే!" అనే లజ్జతో. **(కథయ కోఽయముదారభావః)**–తల్లీ! ఇటువంటి గుణం ఉభయవిభూతులలో (ఈలోకంలో, వైకుంఠంలో) ఇతరులు ఎవరిదగ్గర కనుపించని అద్వితీయగుణం. దీనిని కీర్తించడం నాకు సాధ్యమేనా! నీవే చెప్పాలి!–అని పరమరసికులైన భట్టర్ అంటున్నారు.

**"ఉదారా"** అనే నామాన్ని చేర్చడం ద్వారా, ఈ నామాన్ని పురస్కరించుకొనే నిరూపించవలసినట్లు ఔదార్యగుణంయొక్క ఆధిక్యాన్ని కల్గినది ఈ తల్లి–అనే విషయాన్ని వేదం ప్రస్ఫుటం చేస్తున్నది. ఈ అర్థాన్ని శ్రీయామునులు–**"ఈషత్ త్వత్ కరుణానిరీక్షణ సుధాసంధుక్షణాద్రక్ష్యతే నష్టం ప్రాక్ తదలాభతస్త్రిభువనం సంప్రత్యనంతోయమ్, శ్రేయో న హ్యరవిందలోచనమనః కాంతాప్రసాదాదృతే సంసృత్యక్షర వైష్ణవాధ్వసు నృణాం సంభావ్యతే కర్హిచిత్"** (ఆ కటాక్షం లేనందువల్ల పూర్వం నశించి పోయిన ముల్లోకాలు ఇపుడు కొంచెంగా నీ కరుణాకటాక్షాలనే అమృతవర్షంచేత అంతులేని గొప్పతనాన్ని కల్గి ఉన్నట్లుగా కాపాడబడుతున్నవి. మానవులకు ఐశ్వర్యం, కైవల్యం, పరమపదం–అనే వీటిలో శ్రేయస్సు అరవిందలోచనుని మనఃకాంత అయిన శ్రీదేవియొక్క అనుగ్రహం లేకపోతే ఏర్పడదు కదా!) అని అంటూ అన్వయవ్యతిరేకాలతో స్థిరీకరించారు. కూరేశులు కూడా–**"ఐశ్వర్యం మహదేవ వాల్పమథవా దృశ్యేత పుంసాం హి యత్ తల్లక్ష్మ్యా స్సముదీక్షణాత్తవ యతస్సార్వత్రికం వర్తతే, తేనైతేన స విస్మయేమహి జగన్నాథోఽపి నారాయణః ధన్యం మన్యత ఈక్షణాత్తవ యత స్స్వాత్మానమాత్మేశ్వరః"** (లోకంలోని పురుషులలో గొప్పది అయినా, లేక, అల్పమైనది అయినా ఏ ఐశ్వర్యం కనబడుతున్నదో, అది లక్ష్మి అనబడే నీ కటాక్షం వల్లనే అంతటా ఏర్పడుతున్నది. దీనికి నేనేమీ ఆశ్చర్యపడడం లేదు. ఎందువల్ల అంటే–సాక్షాత్తు జగన్నాథుడైన, ఆత్మేశ్వరుడైన నారాయణుడుసైతం తనను నీ కటాక్షం వల్ల ధన్యుడైనట్లు తలుస్తున్నాడు) అని, **"ఐశ్వర్యం యదశేషపుంసి**



**విదితం సౌందర్యలావణ్యయోః రూపం యచ్చ హి మంగళం కిమపి యల్లోకే సదిత్యుచ్యతే, తత్సర్వం త్వదధీనమేవ యదతః శ్రీరిత్యభేదేన వా యద్వా శ్రీమదితీదృశేన వచసా! దేవి ప్రథామశ్నుతే"** (దేవీ! లోకంలోని పురుషులందఱిలో ప్రసిద్ధంగా ఏ ఐశ్వర్యం కన్పిస్తున్నదో అది, సౌందర్యం, లావణ్యం అనే వీని రూపం, ఇక మంగళకరంగా చెప్పబడేది ఏ కొంచెం అయినా మంచిదని అనబడేది–ఇది అంతా నీ అధీనంలో ఉన్నదే. ఎందువల్ల అంటే, అది అంతా శ్రీ అని అభేదంగా కాని, శ్రీమత్ అని గాని ప్రసిద్ధిని పొందుతున్నది కదా!) అని, **"లోకే వనస్పతి బృహస్పతితారతమ్యం యస్యాః ప్రసాదపరిణామముదాహరంతి, సా భారతీ భగవతీ తు యదీయదాసీ తాం దేవదేవ మహిషీం శ్రియమాశ్రయామః"** (లోకంలో వనస్పతి–బృహస్పతులమధ్య అంటే జ్ఞానహీనం అయిన చెట్టుకు–చాలాగొప్ప బుద్ధిమంతుడని కీర్తింపబడే బృహస్పతికి మధ్యగల తారతమ్యం ఎవరి అనుగ్రహఫలమని అంటున్నారో, లోకంలో, పూజ్యురాలైన ఆ సరస్వతి కూడా ఎవరికి దాసియో, అటువంటి, దేవదేవుని పట్టమహిషివి, లక్ష్మీదేవివి అయిన నిన్ను ఆశ్రయిస్తున్నాను) అని, **"యస్యాః కటాక్షవీక్షాక్షణలక్ష్యం లక్షితా మహేశాః స్యుః, శ్రీరంగరాజమహిషీ సా మామపి వీక్షతాం లక్ష్మీః"** (ఎవరి కటాక్షవీక్షణాలకు క్షణకాలం లక్ష్యం అయినవారు గొప్ప ఐశ్వర్యవంతులు అవుతున్నారో, ఆ, శ్రీరంగనాథుని మహిషి, లక్ష్మీదేవి అయిన నీవు నన్ను కటాక్షించాలి) అని ఈ అర్థాన్ని అనుసంధించారు. వీటికి అన్నిటికీ మూలంగా –**"తిరుమామకళ్ తన్ అరుళాల్ ఉలకిల్ తేర్మన్నరాయ్ ఒలికడల్ శూళ్ శెఱనీరులకాణ్డు తికళ్వర్కళే"** (లక్ష్మీదేవియొక్క అనుగ్రహంచేత లోకంలో రథాలను నడిపే ప్రభువులై, శబ్దించే గొప్ప సముద్రంచేత పరివేష్టితం అయిన నిబిడమైన భూలోకాన్ని పాలిస్తూ ప్రకాశిస్తారు") (పరకాలసూరి ప్రబంధం–2–9–10) అని, **"శెడియారాక్కై యడియారై చ్చేర్ దల్ తీర్క్కుమ్ తిరుమాలే"** (సంసారమరుకాంతారసంసృష్టం అయిన శరీరసంబంధాన్ని ఆశ్రితులు పొందకుండా ఉండేటట్లు రక్షించే లక్ష్మీవల్లభుడు (శఠకోపసహస్రం–1–5–7), **"పూ వళరుమ్ తిరుమకళాల్ అరుళ్ పెత్తుప్పొన్నులకిల్ పొలివర్ తామే"** (తామరపూవులో పెరిగే లక్ష్మీదేవి చేత అనుగ్రహింపబడి బంగారులోకం అయిన పరమపదంలో పరిఢవిల్లుతారు) (పరకాలసూరి ప్రబంధం–11–6–10) అని, **"వేరి మాఱాదపూమేల్ ఇరుప్పాళ్ వినై తీర్క్కుమే"** (పరిమళం తగ్గని తామరపూవుపై ఉండే లక్ష్మీదేవి కర్మలను తీరుస్తుంది) (శఠకోపసహస్రం–4–5–11) అని, **"తరుమ్ అవ్వరుమ్ పయనాయ తిరుమకళార్"** (శాస్త్రాలలో పొందడానికి అరుదైనవిగా చెప్పబడ్డ ప్రయోజనాలను లక్ష్మీదేవి అనుగ్రహిస్తుంది) (శఠకోపసహస్రం–1–6–9) అని, **"శార్వునమక్కెన్డుమ్ శక్కరత్తాన్ తణ్డుళాయ్ తార్ వాళ్ వరైమార్బన్ తాన్ ముయఙ్గుమ్, కారార్న్దవానమరుమిన్ని మైక్కుమ్ వణ్తామరై నెడుఙ్గణ్ తే నమరుమ్ పూమేల్తిరు"** (చక్రాన్ని కలవాడు, చల్లని తులసీమాలచేత ప్రకాశించే పర్వతంవంటి వక్షఃస్థలాన్ని కలవాడు అయిన సర్వేశ్వరుడు తానుగా సంశ్లేషించే,

పొందేటట్లు చేస్తుందని భావం. **"పద్మాన్ ప్రకృతిపురుషాన్ నయతీతి పద్మనేమిః"** (ప్రకృతి పురుషులనే పద్మాలను వికసింపజేసేది) అని వ్యుత్పత్తి.

**యస్యాః కటాక్షమృదువీక్షణదీక్షణేన**
**సద్యః సముల్లసితపల్లవముల్లలాస।**
**విశ్వం విపర్యయసముత్థవిపర్యయం ప్రాక్**
**తాం దేవదేవ మహిషీం శ్రియమాశ్రయామః॥**

(ఏ లక్ష్మీదేవియొక్క కడగంటి చూపులవల్ల ప్రళయకాలంలో అవి ప్రసరించనందువల్ల లేకుండాపోయిన లోకం వెంటనే చిగురించినట్లుగా వికాసాన్ని పొందిందో, దేవదేవుని మహిషి అయిన ఆ లక్ష్మీదేవిని ఆశ్రయిస్తున్నాము) అని కూరేశులు కూడా ఈ అర్థాన్ని తెలిపారు.

**(పద్మనేమిమ్)–"పద్యమానం మినోతీతి కాలం పద్మం ప్రచక్షతే"** (తాను కదులుతూ మిగిలిన వానిని పరిచ్ఛేదిస్తున్నది కనుక కాలం పద్మమనబడుతున్నది) అని ఇంతకుముందే లక్ష్మీతంత్రంలో చూపబడ్డ వ్యుత్పత్తి చేత పద్మశబ్దం కాలాన్ని సూచిస్తుంది. చక్రం నడుమ ఉండే నాభికి చుట్టూ ఉన్న గుండ్రని నేమివలె కాలానికి బహిర్భూతురాలు ఈమె–అని పద్మనేమి శబ్దానికి అర్థాన్ని గ్రహించవచ్చు. **"కాలం స పచతే తత్ర న కాలస్తత్ర వై ప్రభుః"** (విష్ణుపురాణం) (ఆ పరమపదంలో అతడు కాలాన్ని నియమిస్తున్నాడు. అక్కడ కాలం సామ్రాజ్యం చేయడంలేదు) అని అన్నట్లు కాలానికి కట్టుబడనిది–అని భావం. ఈ రెండు అర్థాలు, మంత్రంయొక్క అర్థం.

**ప్రకృతిం పురుషం చైవ నయామి స్వేన తేజసా।**
**కాలాచ్చాపి బహిర్భూతా పద్మనేమిం తతో విదుః॥**
**సప్తాక్షరో హ్యయం మంత్రః సర్వసంపత్ సమృద్ధిదః॥ 50–135**

(ప్రకృతిపురుషులను నా ప్రకాశంతో వికసింపజేస్తాను. కాలానికి బహిర్భూతురాలై ఉన్నాను. అందువల్లనే నేను పద్మనేమి అని అనబడుతున్నాను. **"ఓమ్ పద్మనేమ్యై నమః"** అనే ఏడు అక్షరాలను కల ఈ మంత్రం అని సంపదల సమృద్ధిని ఇస్తుంది) అని లక్ష్మీతంత్రంలోను ఉద్ఘోషింపబడింది.

**(శరణమహం ప్రపద్యే)**–ఉపాయంగా ఆశ్రయిస్తున్నాను–అని భావం. **"ఉపాయే గృహరక్షిత్రోః శబ్దః శరణమిత్యయమ్, వర్తతే సాంప్రతం చైష ఉపాయార్థైకవాచకః"** (ఉపాయం, గృహం, రక్షకుడు అనే మూడు అర్థాలలో "శరణమ్" అనే ఈ పదం ప్రయోగింపబడుతున్నది. ఇపుడు అది ఉపాయం అనే అర్థాన్నే చెబుతున్నది) అని అహిర్బుధ్న్యసంహితలో శరణశబ్దార్థం తెలుపబడింది కదా!

**(ప్రపద్యే)**–"పద్–గతౌ" అని ధాతువు కనుక ఆశ్రయిస్తున్నాను అని భావం. **"గత్యర్థాః**



(అందమైన ముఖాన్ని కల సేనేశా! ఆకించన్యాన్నే (దేనినీ రక్షకంగా కల్గి ఉండని స్థితినే) ఆలంబనంగా చేసికొన్న కొందఱు భాగ్యాధికులు నా పాదపద్మద్వయిని భక్తిని కల మనస్సుతో శరణుపొంది, లక్ష్మీదేవిని పురుషకారంగా గ్రహించి, నా క్షమాగుణానికి లక్ష్యభూతులై, నన్నే ప్రాప్యంగాను, ప్రాపకంగాను పొంది, కృతార్థులై, వేఱు ఏ విషయంలోను మనస్సును లగ్నం చేయనివారై నన్నే పొందుతారు) అని విష్వక్సేనసంహితలో, **"అహం మత్ప్రాప్త్యుపాయో వై సాక్షాల్లక్ష్మీపతిః స్వయమ్, లక్ష్మీః పురుషకారేణ వల్లభా ప్రాప్తియోగినీ, ఏతస్యాశ్చ విశేషోఽయం నిగమాంతేషు శబ్ద్యతే"** (లక్ష్మీపతి అయిన నేనే నన్ను పొందడంలో ఉపాయం అవుతున్నాను. నాకు అత్యంతం ప్రియ అయిన లక్ష్మీదేవి పురుషకారం ద్వారా నన్ను పొందడంలో సహాయపడుతున్నది. పురుషకారత్వం అనే ఈ మహిమ ఈ మహిమ వేదాంతాలలో చెప్పబడుతున్నది) అని,

**మత్ప్రాప్తిం ప్రతి జంతూనాం సంసారే పతతామధః।**
**లక్ష్మీః పురుషకారత్వే నిర్దిష్టా పరమర్షిభిః॥**
**మమాపి చ మతం హ్యేతత్ నాన్యథా లక్షణం భవేత్।**

(సంసారంలో అధఃపతనం చెందే ప్రాణులకు నన్ను చేరే విషయంలో లక్ష్మీదేవి పురుషకారం చేసేదిగా మహర్షులచేత నిర్దేశింపబడింది. నాకు కూడా ఈ లక్ష్మీదేవి పురుషకారభూతురాలు అనే విషయం సమ్మతమే. ఈమెకు ఇంతకంటే వేఱయిన, ఉపాయత్వం అనే ఆకారం లేదు) అని ఈ విధంగా ఇంకా పలు పాంచరాత్రశాస్త్ర ప్రమాణాలవల్ల పురుషకారభూతగా ఉంటూ ఈమె మోక్షప్రదాత అవుతున్నది–అని తెలుస్తున్నది. ఇక, లక్ష్మి పురుషకారం చేయడం అంటే ఏమి?–అని అంటే సర్వతంత్ర స్వతంత్రుడైన ఈశ్వరుని తన మధురమైన రూపంతో, వాక్కుతో, గుణాలతో వశం చేసికొని, ముగ్ధుణ్ణిగా చేసి, జీవుని దోషాలను అతడు గమనించకుండా ఉండేటట్లు మఱుగుపఱచి, 'నీకు మోక్షమిస్తున్నాను' అని అతడు సంకల్పించేటట్లుగా చేయడం. తానే మోక్షప్రదానసంకల్పాన్ని చేయగల్గినది అయితే, ఈమె పురుషకారం చేయడం ఎందుకు? ఆ ఆవశ్యకత లేనేలేదే! "మోక్షాన్ని ఇస్తున్నాను" అనే సంకల్పాన్ని ఈశ్వరుడే చేస్తున్నాడు కనుక సాక్షాన్మోక్షప్రదత్వం ఉన్నది ముకుందునకే! ఇక, శ్రీదేవి అయిన ఈమెకు అయితే, పరంపరయామోక్షప్రదత్వం అనే మోక్షప్రదాపయితృత్వమనబడే (మోక్షాన్ని ఇప్పించడం–అనే) పురుషకారత్వమే ఉన్నది. అందువల్ల భగవత్ పారతంత్ర్యమహాసంపదను కల ఈ లక్ష్మికి పరబ్రహ్మత్వం–అనే నైచ్యం ఏనాడూ సంక్రమించదు.

ఈ విషయంలో శ్రీవేదాంతదేశికులు, మఱికొందరు ఆచార్యులు కొంత అభిప్రాయభేదాన్ని ప్రదర్శించారు. ఇక్కడ ఒక విషయం మాత్రం గమనించదగినది ఉన్నది. భగవానునకు ఎటువంటి ఉపాయత్వాన్ని అంగీకరిస్తున్నామో, అటువంటిదే లక్ష్మీదేవియొక్క ఉపాయత్వం కూడా–అని దేశికులు అభిప్రాయపడలేదనే విషయం

న్యాయసిద్ధాంజనంలోని –**"జ్ఞానానందాదత్యంతసామ్యాత్ జగజ్జనకత్వ–శేషిత్వ–శరణ్యత్వ ...సామ్యాచ్చ"** (జ్ఞానం, ఆనందం మొదలైన అన్ని విషయాలలో చాలా సామ్యం ఉన్నందున, జగత్కారణత్వం, శేషిత్వం, ఉపాయత్వం–మొదలైన విషయాలలో సామ్యాన్ని కల్గినది కనుక) అనే సూక్తివల్ల బోధపడుతుంది. అందువల్ల వారి అభిప్రాయానుసారంకూడా లక్ష్మికి పరబ్రహ్మత్వం లేదు–అనేది నిష్పక్షపాతంగా ఆలోచించేవారికి స్పష్టం కాగలదు–అని శ్రీకృష్ణస్వామి అయ్యంగార్ అభిప్రాయపడ్డారు.

"లక్ష్మీదేవికి సాక్షాన్మోక్షప్రదత్వం లేదు, పురుషకారత్వమే ఉన్నది"–అని చెప్పడం చేత ఆమె ఔదార్యానికి ఏ కొఱత రాదు. ఇచ్చేవారికంటే కూడా, ఇప్పించేవారినే కదా లోకంలో చాలా ఉదారులుగా ప్రకాశిస్తున్నారు, కీర్తింపబడుతున్నారనే విషయం లోకసిద్ధం. **"మాం నయేద్యది కాకుత్థ్సః తత్తస్య సదృశం భవేత్"** (నన్ను కాకుత్థ్సుడు తీసికొని వెళ్ళినట్లయితే, అది అతనికి తగినది అవుతుంది) అనే రీతిలో పారతంత్ర్యపరాకాష్ఠలో ఉండే లక్ష్మీదేవి "నేను మోక్షాన్ని ఇస్తాను" అనే స్వాతంత్ర్యకార్యం అయిన సంకల్పాన్ని ఆమె చేసినా, ఆమె స్వరూపాన్ని చూచినపుడు, అది భగవదభిప్రాయాన్నే అనుసరించి ఉంటుంది తప్ప స్వతంత్రుల సంకల్పంగా ఉండబోదు. అందువల్ల ఏ రీతిలో చూచినా ఆమెకు పరబ్రహ్మత్వం సిద్ధించే అవకాశమే లేదు అన్నది వజ్రలేపాయితం. ఏతావతా, పరమపురుషార్థం అయిన మోక్షాన్ని ఇప్పించడంద్వారా, ఐశ్వర్యాన్ని తానే ఇవ్వడం ద్వారా పరమోదారగా లక్ష్మీదేవి భాసిస్తున్నది –అనే విషయం కరతలామలకంగా చూపబడింది. ఈ **"ఉదారా"** అనే నామంయొక్క అర్థం, ఈ మంత్రవైభవం కూడా–

**"మత్త ఏవోద్గతానీహ విజ్ఞానాని మహర్షిణామ్।**
**శక్తయశ్చ క్రియాశ్చైవ యాస్తా ఉచ్చావచా నృణామ్॥ 50–131**
**విశృంఖలేష్టదాం చాపి మాముదారాం విదుర్బుధాః।**
**సప్తాక్షరో హ్యయం మంత్రస్సర్వమిష్టం ప్రయచ్ఛతి॥**

(మహర్షులకు కలిగే గొప్పజ్ఞానాలు నా వల్లనే కల్గుతాయి, ఉన్నతమైనవి, న్యూనమైనవి అయిన మానవశక్తులు, కార్యాలు–నావల్ల సంభవిస్తాయి. అడ్డు లేకుండా మనోరథాలను గొప్పగా తీర్చడంవల్లకూడా జ్ఞానులు నన్ను ''ఉదారా'' అని తెలిసికొంటున్నారు. ఏడు అక్షరాలను కల **"ఓమ్ ఉదారాయై నమః"** అనే ఈ మంత్రం అన్ని మనోరథాలను అనుగ్రహిస్తుంది) అని లక్ష్మీతంత్రంలో ఉద్ఘోషింపబడింది.

**(తామ్)**–"తను–విస్తారే"–అనే ధాతువునుండి పుట్టిన ఈ నామం, పంచకాలపరాయణులైన భాగవతులు ప్రతిదినం దినభాగాన్ని అయిదు విభాగాలుగా విభజించుకొని చేసే పంచకృత్యాలు–అనబడే అభిగమనం, ఉపాదానం, ఇజ్య, స్వాధ్యాయం, యోగం–అనే అయిదు కార్యాలను విస్తరింపజేసేది అనే అర్థాన్ని ఇస్తుంది. భగవదారాధనం అయిన పంచమహాయజ్ఞాలు మొదలైనవానిని విస్తరింపజేసేది–అని కూడా చెప్పవచ్చు. **"శిద్దనయై**



**త్తవనెతియై త్తిరుమాల్"**–(మనోరథానికి విషయమైనవాడు. ఉపాయమార్గమై ఉన్నవాడు, శ్రియఃపతి) అని తిరుమజ్గైఆళ్వార్లు (కలివైరిసూరి) అన్నారు కదా! అంటే–

(తామ్)–**"తాయ్రృ–సంతానపాలనయోః"** అని ధాతువు కాబట్టి జగదాకారంగా పరిణమిస్తున్నది–అనే అర్థాన్ని గ్రహించవచ్చు. ఈ లక్ష్మీదేవి మూలప్రకృతికి అభిమానినిగా ఉంటుంది–అనే విషయం **"మూలప్రకృతిరీశానీ"** అనే సహస్రనామంవల్ల, మిగిలిన పలుప్రమాణాల వల్ల తెలియబడుతున్నందున, ప్రకృతికార్యం అయిన జగత్తుగా పరిణమిస్తున్నది ఈమె–అని అనడంలో అడ్డులేదు. ఈ అర్థాన్నే **"తిరువాళ్ మార్చన్ష్నై త్తిశై, మణ్ నీర్ ఎరి ముదలా ఉరువాయ్ నిన్ఱవనై ఒలిశేరుమ్ మారుతత్తై"** (కలివైరిసూరి సూక్తం–7–6–7) (లక్ష్మీదేవి నివసించే వక్షస్సును కలవాడు, దిక్కులు, మన్ను, జలం, అగ్ని మొదలైన పదార్థాలై, శబ్దాన్ని గుణంగా కల మారుతానికి నిర్వాహకుడై), అని, **"కరుమా ముకిలురువా కనలురువా పునలురువా పెరుమాల్ వరైయురువా పిఱవురువా నినదురువా తిరుమామకళ్ మరువుమ్ అరుమాకడలముదే"** (కలివైరిసూరిసూక్తం–7–9–9) (నల్లని, పెద్ద మేఘం వంటి రూపాన్ని కలవాడా!, భక్తిలేని వారికి సమీపించడానికి సాధ్యంకానట్లు నిప్పువంటి రూపాన్ని కలవాడా! నీరువంటి చల్లని రూపాన్ని కలవాడా! చాలా పెద్దపర్వతం వంటి రూపాన్ని కలవాడా! ఇంకా మిగిలిన వస్తువులను నీ రూపంగా కలవాడా! లక్ష్మీదేవి స్థిరంగా నివసించే, పొందటానికి వీలుకాని గొప్ప అమృత సముద్రం వంటివాడా!) అని, **"వానాకిత్తీయాయ్ మఱికడలాయ్ మారుతమాయ్ తేనాకిప్పాలామ్ తిరుమాలే"** (సరోయోగి ప్రబంధం–92) (ఆకాశమై, అగ్నియై, సముద్రమై, వాయువై, తేనె, పాలువంటి భోగ్యపదార్థాలై ఉండే శ్రియఃపతీ) ఇత్యాదిగా దివ్యసూరులు పలు సందర్భాల్లో అనుసంధించారు. ఈ రెండు అర్థాలు, ఈ మంత్రవైభవం–

**తనోమి పంచకృత్యాని తాయే చ జగదాత్మనా।**
**తాం మాం తామితి తత్త్వజ్ఞాః ప్రాహుర్వేదాంతపారగాః।**
**పంచాక్షరో హ్యయం మంత్రః తనోతి శుభవిస్తృతిమ్॥**

(అయిదు విధాలైన కృత్యాలను విస్తరింపజేస్తున్నాను. జగద్రూపంగా పరిణమిస్తున్నాను. అటువంటి నన్ను వేదాంతాల ఒడ్డున చేరిన జ్ఞానులు "తామ్" అని నన్ను అంటున్నారు. "ఓమ్ తాయై నమః" అని అయిదు అక్షరాలను కల ఈ మంత్రం శుభాన్ని విస్తరింపజేస్తుంది) అని లక్ష్మీతంత్రంలో తెలుపబడింది. "తామ్" అనే పదాన్ని ఒక తిరునామంగా లక్ష్మీదేవి ఆదరిస్తుండగా, దీనిని తచ్ఛబ్దంయొక్క ద్వితీయావిభక్త్యంత రూపంగా గ్రహించి "అటువంటి లక్ష్మీదేవిని" అనే అర్థాన్ని గోమఠరంగనాథులు వివరించారు.

**(పద్మనేమీమ్)**–సూర్యునివల్ల వికసించే తామరవలె, లక్ష్మీదేవి సాన్నిధ్యంవల్ల సృష్ట్యాది వికాసాన్ని పొందే పద్మాలు అయిన ప్రకృతి పురుషులను తన కాంతితో వికాసాన్ని

**ఆదిత్యస్థా చ వర్ణాత్మా భూత్వా దివ్యా త్రయీమయా।**
**ప్రకాశయంతీ సర్వార్థాన్ అతీతానాగతానపి॥**
**పితృదేవమనుష్యాణాం చక్షురస్మి సనాతనమ్। 50-137**

(ఆదిత్యునివద్ద ఉండే ఋగ్యజుస్సామవేదాలలోని వర్ణాలుగా ఉంటూ, త్రికాలాలలోను ఉండే అర్థాలను ప్రకాశింపజేస్తూ, పితృదేవ మానవులకు సనాతనం అయిన నేత్రంగా ఉంటున్నాను) అని సాక్షాత్తు లక్ష్మీదేవి చేతనే ఈ అర్థం ఆదరింపబడింది.

**(ఆదిత్యవర్ణే)**–ఆదిభూతవర్ణా!–ఆదివర్ణం అయిన ఓంకారానికి అర్థమై ఉన్నదానా!–అని భావం.

**ఓంకారశ్చాథశబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా।**
**కంఠం భిత్త్వా ప్రనిర్యాతౌ తస్మాన్మాంగలికా వుభౌ॥**

(ఓంకారం, అథ అనే శబ్దం ఆదికాలంలో బ్రహ్మకంఠంనుండి వెలువడ్డాయి. అందువల్ల ఇవి రెండు మంగళాత్మకాలు) అని శాస్త్రాలలో చెప్పబడింది కనుక ఓంకారం ఆదివర్ణం. **"ఓంకారో భగవాన్ విష్ణుః"** (తేజోబిందూపనిషత్తు) అని, **"తస్య వాచకః ప్రణవః"** (పాతంజలసూత్రం) (అతని వాచకం ఓంకారం) అని, **"తస్య ప్రకృతిలీనస్య యః పరః స మహేశ్వరః"** (తైత్తి–నారా–10) (తనకు కారణం అయిన అకారంలో అణగి ఉండే ఓంకారానికి అర్థంగా ఉన్నవాడు సర్వేశ్వరుడు) అని, **"ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్"** (గీత) (ఓమ్ అనే ఒక అక్షరాన్ని ఉచ్చరిస్తూ నన్ను స్మరిస్తూ ఎవడు మరణిస్తాడో) అని చెప్పబడ్డ రీతిలో ఓంకారానికి అర్థభూతుడై ఉన్నవాడు భగవానుడు. ఘటశబ్దం ఘటత్వవిశిష్టం అయిన ఘటానికి వాచకం అయినట్లే, ఓంకారం కూడా భగవానుని స్వరూపనిరూపకభూత అయిన ఈ లక్ష్మీదేవితో కూడి ఉండే భగవానునకు వాచకం అవుతున్నది కనుక, ఈ పిరాట్టి కూడా ఓంకారవాచ్య–అని అనడంలో అడ్డులేదు. "ఆదౌ త్యః–స్థితః–ఆదిత్యః".

**ఆదిభూతశ్చ వర్ణో మే తారః ప్రథమవాచకః।**
**తత్ర శాంతోదితానందా నందామ్యాత్మానమాత్మనా॥**
**తైలధారావదచ్ఛిన్నా దీర్ఘఘంటానినాదినీ।**
**ప్రణవస్య శిఖా సూక్ష్మా సా మే శబ్దమయీ తనుః॥**
**తత్ర బ్రహ్మణి నిష్ణాతో మాం ద్రాగధిగమిష్యతి।**
**ఆదిత్యవర్ణజాతం మే శబ్దమయ్యా ఉపస్థితమ్॥**
**శాంతాపశ్యాదిరూపేణ వైఖరీ వర్ణవాదినీ।**
**దుహానా సకలానర్థాన్ ధేనుః కామదుఘా స్థితా॥ 50-141**
**ఏతానాదిత్యవర్ణేతి మయ్యర్థాన్ ఋషయో విదుః।**



**బుద్ధ్యర్థః"** అనే న్యాయంతో మనస్సులో ఉపాయంగా నిర్ధారణ చేసికొన్నాను–అని ఇక్కడి హృదయం. ఎందుకోసం? అని అంటే–

**(అలక్ష్మీర్మే నశ్యతామ్)**–భగవానుని నిగ్రహం అనే నా దారిద్ర్యం నశించాలి.

**(త్వాం వృణే)**–అందుకోసం పురుషకారభూత అయిన నిన్ను వరిస్తున్నాను.

**(అలక్ష్మీర్మే నశ్యతామ్)**–**"సా హి శ్రీరమృతా సతామ్"** (తైత్తి.బ్రా. 3–7) (బ్రహ్మవిద్యయే సత్పురుషులకు నశించని సంపద) అని కీర్తింపబడే బ్రహ్మవిద్యా దారిద్ర్యం నశించాలి అని కూడా భావం.

**(అలక్ష్మీర్మే నశ్యతామ్)**–**"లక్ష్మణో లక్ష్మిసంపన్నః"**–(భగవచ్ఛేషత్వం అనే సంపద నిండినవాడు లక్ష్మణుడు) అని చెప్పబడ్డ అనన్యార్హశేషత్వమనే సంపద, **"స తు నాగవరః శ్రీమాన్"** (అనన్యోపాయత్వసంపదనిండిన గజేంద్రుడు)అని చెప్పబడ్డ అనన్యోపాయత్వమనే సంపద, **"అంతరిక్షగతః శ్రీమాన్"** (భార్యాబిడ్డలను, సంపదను విడిచి అనన్యభోగత్వ సంపదను కలవాడై ఆకాశం చేరిన విభీషణుడు) అని చెప్పబడ్డ అనన్యభోగత్వసంపద అనే ఈ మూడు సంపదలేమి అనే దారిద్ర్యం నశించాలి–అని కూడా భావం. అందువల్ల ఈ అర్థాలద్వారా, భగవానుని కోపాన్ని పోగొట్టడంకోసం, అతనికి సంబంధించిన జ్ఞానాన్ని పొందటంకోసం, అతడే శేషి, ఉపాయం, ఉపేయం–అనే భావనను పొందడంకోసం నేను శ్రీదేవి అనే నిన్ను ఉపాయంగా వరిస్తున్నాను–అని అన్నట్లయినది. ఇవే కదా పురుషకారభూత అయిన లక్ష్మీదేవి చేసే కార్యాలు.

ఈ మంత్రంలో పఠింపబడ్డ ఒక్కొక్క నామం ఈమె పురుషకారత్వాన్ని సుస్పష్టం చేస్తున్నవి.

**(చంద్రాం శరణమహం ప్రపద్యే)**–**"అభితః పావకోపమః"**(రామా–అయో–99–26) (నాలుగువైపుల సమీపించడానికి సాధ్యంకాని నిప్పువలె ఉన్నవానిని) అని చెప్పబడే భగవానుని వలె కాకుండా, అందఱు దరిచేరి పాదాలను సేవించడానికి వీలుండేటట్లు చల్లని స్వభావాన్ని నిండుగా గల నిన్ను ఆశ్రయిస్తున్నాను.

**(ప్రభాసామ్ జ్వలంతీం శరణమహం ప్రపద్యే)**–పంచాగ్ని విద్యలో చెప్పబడ్డ రీతిలో నన్ను జన్మింపజేసే తల్లి అయిన నిన్ను శరణుపొందుతున్నాను.

**(యశసామ్ శరణమహం ప్రపద్యే)** అతని (పరమాత్మయొక్క) రూపాన్ని, గుణాలను లఘూకరించేటట్లున్న రూపాన్ని, కరుణ, క్షమ, మార్దవం, ఔదార్యం మొదలైన గుణాలను కల్గినది–అనే గొప్పకీర్తిని కల్గినదానవైన నిన్ను శరణు పొందుతున్నాను.

**(శ్రియం శరణమహం ప్రపద్యే)**–పురుషకారత్వాన్ని బలపఱచే ప్రత్యేకమైన అతిశయాన్ని కల నిన్ను శరణు పొందుతున్నాను.

**(లోకే దేవజుష్టాం శరణమహం ప్రపద్యే)**–భగవానుని క్షణమయినా విశ్లేషించకుండా కలిసి

ఉండే నిత్యయోగాన్నికల నిన్ను శరణు పొందుతున్నాను. నా ఇంద్రియాలను నియమించగల నిన్ను శరణుపొందుతున్నాను.

**(ఉదారాం శరణమహం ప్రపద్యే)**–భగవానుని ఔదార్యం కంటే మించిన ఔదార్యాన్ని కల నిన్ను శరణు పొందుతున్నాను.

**(పద్మనేమిం శరణమహం ప్రపద్యే)**–సృష్టికాలంనుండి నన్ను కటాక్షించి, ఉండే నిన్ను శరణు పొందుతున్నాను. ఈ విధంగా పురుషకారభూతగా ఉండే లక్ష్మీదేవి సకలజీవులకు శరణు పొందదగినదిగా ఉంటుందనే ఈ అపూర్వమైన, వేదసిద్ధమైన అర్థాన్ని– **"శార్వ నమక్కెళ్ళుమ్ శక్కరత్తాన్ తణ్డుళాయ్ త్తార్‌వాళ్‌వరైమార్భన్ తాన్‌ముయఙ్గుమ్, కారార్‌న్ద వానమరుమిన్నిమైక్కుమ్ వణ్‌తామరైనెడుఙ్కణ్ తేనమరుమ్ పూమేల్‌తిరు"**–(చక్రధారి, చల్లని తులసీమాలతో ప్రకాశించే పర్వతం వంటి వక్షఃస్థలాన్ని కలవాడు అయిన సర్వేశ్వరుడు తానుగా సంశ్లేషించేది, మేఘాలు నిండిన ఆకాశంలో స్థిరంగా ఉన్న మెఱుపువలె ప్రకాశించేది, అందమైన తామరపూవువలె, విశాలమైన నేత్రాలను కల్గినది, తేనెతో నిండిన తామరపూవులో నివాసం చేసేది అయిన లక్ష్మీదేవి మనకు ఎల్లప్పుడు ప్రాప్యురాలు) (మహాయోగిసూక్తం–100) అని, **"అకలకిల్లేన్ ఇఱైయుమెన్ఱు అలర్‌మేల్‌మఙ్గైయుఱైమార్బా ....పుకలొన్ఱిల్లా అడియేన్ ఉన్నడిక్కీళ్ అమర్‌న్దుపుకున్దేనే"** (శఠకోపసహస్రం–6–10–10) (క్షణంకూడా విశ్లేషించి ఉండలేను అనే పద్మనివాసిని నిత్యవాసం చేసే వక్షఃస్థలాన్ని కలవాడా.........నీవు తప్ప ఇంకొకగతి లేని నేను నీ పాదమూలం చెంత స్థిరంగా ఉండి, శరణుపొందాను) అని, **"తిరుమాల్ నమక్కోరరణే"** (శ్రియఃపతి మనకు సాటిలేని రక్షకుడు) (కలివైరిసూరిసూక్తం–11–4–2) అని, **"పరనే! మాదవనే! మదుశూదా! మత్తోర్ నల్‌తుణై నిన్తలాలిలేన్‌కాణ్"** (కలివైరిసూరిసూక్తం–7–7–4) (సర్వశ్రేష్ఠుడా! మాధవా! మధుసూదనా! నీవు తప్ప ఇంకొక గొప్ప రక్షకుని ఎవరినీ కల్గినవాడనుకాను సుమా!) అని దివ్యసూరులు (ఆళ్వార్లు), **"దాస ఇతి ప్రపన్న ఇతి చ"** (దాసుడను అని, ప్రసన్నుడను అని) (చతుః శ్లోకి–2) అని శ్రీయామునులు, **"భగవన్నారాయణ"** ఇత్యాదిగా శరణాగతిగద్యలో భగవద్రామానుజులును దృఢీకరించారు.

**సర్వకామప్రదాం రమ్యాం సంసారార్ణవతారిణీమ్।**
**క్షిప్రప్రసాదినీం దేవీం శరణ్యామనుచింతయేత్॥**
**అనేనైవ ప్రపన్నస్య శ్రియం దేవీం సనాతనీమ్।**
**పాపానుషంగ స్సకలస్తత్ క్షణాదేవ నశ్యతి॥**

(అన్ని కోరికలను ప్రసాదించేది, అందమైనది, సంసారం అనే సముద్రాన్ని దాటించేది, శీఘ్రంగా అనుగ్రహించేది, శరణు పొందతగినది అయిన లక్ష్మిని భావించాలి. ఈ మంత్రంలో సనాతనురాలైన లక్ష్మీదేవిని శరణు పొందిన వానికి పాపసంబంధం తత్క్షణం నశిస్తుంది) అని స్వాయంభువంలోను, ఇతఃపూర్వమే ఉట్టంకింపబడ్డ అనేక



లక్ష్మీతంత్ర సూక్తులవల్ల ఈ అర్థం ఉద్ఘోషింపబడుతున్నది. ఇక, తరువాతి మంత్రం.

| | |
|---|---|
| **6.** | **ఆదిత్యవర్ణే తపసోఽధిజాతో** |
| | **వనస్పతిస్తవ వృక్షోఽథ బిల్వః।** |
| | **తస్య ఫలాని తపసా నుదంతు** |
| | **మాయాంతరాయాశ్చ బాహ్యా అలక్ష్మీః॥ 6** |

**ప్రతిపదార్థము :** ఆదిత్యవర్ణే=సూర్యునివద్ద ఉండే వేదమయం అయిన శబ్దస్వరూపిణిగా ఉన్నదానా!, తవ=నీయొక్క, తపసః=సంకల్పంవల్ల, అధిజాతః=అన్ని మంగళాలకోసం అవతరించిన, వనస్పతిః=గొప్పవృక్షం అయిన (ఏ), బిల్వవృక్షః=బిల్వవృక్షం ఉన్నదో, తస్య ఫలాని=దాని ఫలాలు, తపసా=హోమం మొదలైన (నా) తపస్సులతో, మాయా=నా అజ్ఞానాన్ని, అంతరాయాశ్చ=విరోధులను, బాహ్యా అలక్ష్మీఃచ=(శ్రీ సంబంధానికి) బాహ్యాలు అయిన దారిద్ర్యాలను, నుదంతు=పోగొట్టుగాక.

**భావము :** పూర్వమంత్రంలో దారిద్ర్యనాశనంకోసం లక్ష్మిని వేదపురుషుడు ఆమెను శరణు పొందాడు. ఇపుడు ఈ మంత్రంలో ఆ లక్ష్మీదేవి కూడా కావాలా! ఆమె సంబంధాన్ని పొందిన బిల్వవృక్షమే చాలదా–సకలవిరోధినివర్తనం నిర్వహించడానికి" అని అంటున్నాడు.

**(ఆదిత్యవర్ణే)–"వర్ణ–ప్రేరణే"** అని, **"వర్ణ–వర్ణక్రియాయామ్"** అని ధాతువు కనుక, ఆదిత్యుని ప్రేరేపించేది–అని, ఆదిత్యుని ప్రకాశింపజేసేది–అని ప్రకృతంలో భావం. ఆదిత్య మండలంలో నారాయణునితో వేంచేసి ఉంటుంది కనుక సూర్యుని లక్ష్మీదేవి రంజింపజేస్తుంది.

**"ఆదిత్యం వర్ణయామ్యేకా తేజసా యశసా శ్రియా"** (నేను ఒక్కతెనే సూర్యుని నా తేజస్సుతోను, కీర్తితోను, అందంతోను రంజింపజేస్తున్నాను) అని లక్ష్మీతంత్రంలో ఈ అర్థం ఆదరింపబడింది.

**(ఆదిత్యవర్ణే)**–సూర్యునివర్ణం వంటి వర్ణాన్ని కల్గినది–అని కూడా చెప్పవచ్చు. **"ఆదిత్యవర్ణమ్"** అని పురుషసూక్తంలో కీర్తంపబడే భగవానునకు తగినది ఈమె–అని తాత్పర్యం. నిజానికి నీలమేఘం వలె ఉండే భగవానుడు ఆదిత్యవర్ణుడు కావడంకూడా ఈమె నిత్యసాన్నిధ్యంవల్లనే కదా!

**(ఆదిత్యవర్ణే)**–ఆదిత్యునిగా ఉండేది, వర్ణంగా ఉండేది, ఆదిత్యుని వర్ణంగా ఉండేది–అని కూడా భావం. ఆదిత్యమండలంలో ఉన్నదిగా కీర్తిపంబడే ఋగ్యజుస్సామవేదాలనే అక్షరరాశిగా ఉంటూ, అన్ని కాలాలలో ఉండే అర్థాలను (సూర్యునివలె) ప్రకాశింపజేస్తూ, అందటికీ (ఆ సూర్యునివలె) నేత్రస్థానీయురాలై ఉంటూ, వేదశబ్దస్వరూపిణిగా ఉంటుంది కనుక "వర్ణ" శబ్దంచేత, "ఆదిత్య" శబ్దంచేత, "ఆదిత్యవర్ణ" శబ్దంచేత నిర్దేశింపబడుతున్నది–అని భావం.

లక్ష్మీతంత్రంలో లక్ష్మీదేవి చేత వ్యక్తం చేయబడ్డాయి.

**(ప్రాదుర్భూతోఽస్మి రాష్ట్రేఽస్మిన్)**–భక్తియోగం మొదలైన వానిని అనుష్ఠించదగిన కర్మభూమిలో నేను జన్మించాను. **"దేశోఽయం సర్వకామధుక్"** (ఈ దేశం అన్ని అభీష్టాలను ఇస్తుంది) అనే రీతిలో భగవత్సంబంధాన్ని కల దేశంలో పుట్టాను.

**(కీర్తిమృద్ధిం దదాతు మే)**–స్వరూపరూపగుణవిభూతులతో సమృద్ధిని పొందినందువల్ల **"ఋద్ధి"** అని అనబడే లక్ష్మీదేవి నాకు భగవద్భక్తిచేత కలిగే గొప్పకీర్తిని అనుగ్రహించాలి.

**(ఋద్ధిః)–"భగవన్నారాయణాభిమతానురూప స్వరూపరూపగుణవిభవైశ్వర్యశీలాద్యనవధికాసంఖ్యేయకల్యాణగుణగణామ్"** (భగవానుడైన నారాయణునకు ప్రియమైనది, తగినవి అయిన స్వరూపం, రూపం, రూపగుణాలు, విభావాలు, ఐశ్వర్యం, శీలం మొదలైన, అంతులేని అతిశయాలను కలిగిన, లెక్కలేనన్ని కల్యాణగుణాల సమూహాలు–అని మొదలైన వీనిని కల్గినదైన లక్ష్మీదేవిని)–అని శరణాగతి గద్యప్రారంభంలో భగవద్రామానుజులు పల్కిన రీతిలో స్వరూపరూపగుణవిభూతిసమృద్ధిని కల్గినది–అని భావం. **"యథా సర్వగతో విష్ణుః తథైవేయం ద్విజోత్తమ"** (విష్ణుపు.-1-8-17) (బ్రాహ్మణోత్తమా! ఏ విధంగా భగవానుడు సర్వవ్యాపిగా ఉన్నాడో, ఆ విధంగానే ఈ లక్ష్మీదేవి కూడా సర్వవ్యాపినిగా ఉన్నది) అని, **"త్వయైతత్ విష్ణునా చాంబ జగద్వ్యాప్తం చరాచరమ్"** (విష్ణు.పు.-1-9-126) (తల్లీ! నీచేత, విష్ణువుచేత, స్థావరజంగమాత్మకం అయిన ఈ లోకం వ్యాపింపబడింది) అని, **"యుక్తా రామస్య భవతీ"** (రామా-యుద్ధ.-116-47) (సీతా! నీవు రామునకు తగినదానవు) అని, **"సదా తవైవోచితయా"** (స్తోత్రరత్నం-38) (అన్ని దశలలో ఎల్లప్పుడు నీకే తగినది అయిన లక్ష్మీదేవితో) అని చెప్పేరీతిలో ఈమె స్వరూపం కూడా అతనికి తగినదని చెప్పదగినట్లు సమృద్ధమై ఉంటుంది. "అసితేక్షణా" (రామా-సుందర-16-5) (నల్లని కంటి అందంతో అతనిని కూడా మించి ఉన్నది) అని, **'మెల్లియల్ తోళ్ తోయ్న్దాయ్"** (మృదువైన భుజాలను కల లక్ష్మీదేవిని పరిగ్రహించినవాడా") (తిరునెడున్దాణ్డకమ్-13) అని, **"వణ్డార్ పూమామలర్ మజ్జై మణనోక్కముణ్డానే"** (తుమ్మెదలు నిండుగా ఉండే, అందమైన గొప్పతామరపూవులు పుట్టిన లక్ష్మీదేవియొక్క ఆనందంతో కూడిన కటాక్షాలను ధారకంగా కలవాడా) (కలివైరిసూరిసూక్తం 8-10-1) అని, **"న జీవేయం క్షణమపి వినా తామసితేక్షణామ్"** (రామా-సుందర-66-10) (నల్లని నేత్రాలను కల సీతాదేవిని విశ్లేషించి క్షణం అయినా జీవించలేను) అని ఈమెయొక్క రూపం అతని రూపంకంటే మించిన అందాన్ని కల్గినదిగా, అతనికికూడా ధారకంగా, పోషకంగా ఉన్నందున సుసమృద్ధంగా ఉంటుంది. ఈమె గుణాలు కూడా అతని గుణాలను లఘూకరించేటట్లు ఉండడంచేత, అతిసమృద్ధంగా ఉంటాయి. ఈమె విభవాలు అతని విభవాలను మించి ఉంటాయి **"సర్వాన్ భోగాన్ పరిత్యజ్య"** (రామా-సుందర-16-19) (సమస్త భోగాలను విడచిపెట్టి) అని, **"ముత్తిలుమ్ పైజ్కిళియుమ్ పన్దుమూశలుమ్ పేశుకిన్ఱ శిత్తిల్**



**నవాక్షరో హ్యయం మంత్రః సర్వకామప్రపూరకః॥**

(ఆదివర్ణం అయిన ప్రణవం నాకు మొదటి నామం. ఆ ప్రణవంలో శాంతోదితదశలో ఆనందాన్ని కల నేను నన్ను పురస్కరించుకొనే నన్ను నినదింపజేస్తున్నాను. తైలధారవలె అవిచ్ఛిన్నమై, ఘంటవలె దీర్ఘంగా (అనురణనతో) శబ్దించేదై, ప్రణవానికి శిఖగా అగ్రభాగంగా ఉండేది అయిన చతుర్థ్యర్థమాత్ర నాకు శబ్దమయం అయిన శరీరం. వేదసారం అయిన దానిలో అభినివేశాన్ని కలవాడు (నిష్ణాతుడు) నన్ను శీఘ్రంగా పొందుతున్నాడు. ఆదిత్యునివద్ద ఉన్న (లేక, ఆదిత్యవర్ణుడైన ఓంకారంనుండి పుట్టిన) వేదాక్షరాలు శబ్దస్వరూపిణి అయిన నావద్ద శాంతా, పశ్యా మొదలైన రూపాలలో వర్ణాలను చెప్పే రీతిగా నన్ను పొందుతున్నవి. శబ్దస్వరూపిణి అయిన నేను అడిగినదంతా ఇచ్చే కామధేనువువలె అన్ని అర్థాలను అనుగ్రహిస్తాను. ఆదిత్యవర్ణ అయిన నా దగ్గఱ ఈ అర్థాలను గ్రహిస్తున్నారు. తొమ్మిది అక్షరాలను కల **"ఓమ్ ఆదిత్యవర్ణాయై నమః"** అనే ఈ మంత్రం అన్ని కామితాలను పూర్తి చేయిస్తుంది) అనే ఈ అర్థాలు, ఈ మంత్రవైభవం లక్ష్మీతంత్రంలో ఉద్ఘోషింపబడింది.

**(తపసోఽధిజాతః)**–నీ సంకల్పంతో ఉత్పన్నమైనది–అని అర్థం. **"తప ఆలోచనే"** అని ధాతువు కనుక, **"యస్య జ్ఞానమయం తపః"** (శ్వేతా) (ఏ పరమపురుషుని తపస్సు సంకల్పాత్మకజ్ఞానంగా ఉన్నదో) అనే ప్రమాణం ఉన్నందున, **"స తపో తప్యత"** (నారాయణోపనిషత్తు) (ఆ నారాయణుడు సంకల్పరూపం అయిన తపస్సును చేశాడు) అనే సందర్భంలోవలె ఇక్కడకూడా తపశ్శబ్దం సంకల్పాన్ని తెలుపుతున్నది.

**(అధిజాతః)**– సర్వమంగళాలను పురస్కరించుకొని పుట్టినది.

**(వనస్పతిః)**– వనానికి ఆధిపత్యాన్ని వహించే బిల్వవృక్షం.

**(తవ వృక్షోఽథ బిల్వః)**– నీ వృక్షమైన బిల్వం–అని అర్థం. అథశబ్దం పూర్వం చూపిన ప్రమాణానుసారంగా మంగళవాచకం. బిల్వవృక్షం మిక్కిలి మంగళకరమైనదని తెలుపబడినట్లయింది.

**(తవ వృక్షోఽథ బిల్వః)**–ఆదిత్యవర్ణ అయిన నీ లీలకోసం నీ నాథునిచే ఆదిత్యునితోపాటు సృష్టింపబడ్డ వృక్షం. **"బైల్వో యూపో భవత్యసౌ వా ఆదిత్యో యతో జాయత తతో బిల్వ ఉదతిష్ఠత్"** (తైత్తి.సంహిత-21-1-81) (బిల్వవృక్షంతో నిర్మింపబడిన యూపం ఉండాలి. ఈ ఆదిత్యుడు ఏ పరమపురుషునివల్ల ఉద్భవించాడో, ఆ పరమపురుషునివల్లనే బిల్వవృక్షం పుట్టింది) అని వేదంలో చెప్పబడింది కదా!

**(తస్య ఫలాని తపసా నుదంతు)**– దాని ఫలాలతో నేను చేసే హోమం, దానిని దర్శించడం, స్పృశించడం, పలుకడం, తలవడం మొదలైన తపస్సులతో ఆ ఫలాలు నా పాపాలను పోగొట్టాలి.

**“శ్రీ కామో జుహుయాదగ్నౌ పద్మైర్బిల్వైస్తథా ఫలైః”** (సంపదను కోరేవాడు తామరపూలతో, బిల్వఫలాలతో అగ్నిలో హోమాన్ని చేయాలి) అని బోధాయనునిచే కూడా చెప్పబడింది. దేనిని పోగొట్టడంకోసం? అని అంటే,

**(మాయా)**–అజ్ఞానాన్ని. **“మాయావయునం జ్ఞానమ్”** అని మాయాశబ్దం జ్ఞానాన్ని తెలుపుతున్నది కనుక, సరి అయిన జ్ఞానం కాని అజ్ఞానాన్ని ఇక్కడ తెలుపుతుంది.

**(అంతరాయాః బాహ్యాః)**–లక్ష్మీసంబంధానికి బాహ్యాలైన ప్రకృతి సంబంధాలు, కర్మం మొదలైన విరోధులను,

**(అలక్ష్మీః)**–జ్యేష్ఠ అనబడే దరిద్రదేవతను

**అలక్ష్మీశ్చ మయా ప్రోక్తా పత్నీయా దుస్సహస్య చ।**
**నారాయణపదం ధ్యాత్వా నశ్యత్యేవ న సంశయః॥**

(దుస్సహపత్ని అయిన జ్యేష్ఠాదేవి అనే అలక్ష్మి నారాయణుని పాదాలను ధ్యానించడంవల్ల నశిస్తుంది అనడంలో సందేహం లేదు) అని లింగపురాణంలో కూడా చెప్పబడింది.

**7. ఉపైతు మాం దేవసఖః కీర్తిశ్చ మణినా సహ।**
**ప్రాదుర్భూతోఽస్మి రాష్ట్రేఽస్మిన్ కీర్తిమృద్ధిం దదాతు మే॥ 7**

**ప్రతిపదార్థము :** కీర్తిః=లక్ష్మీదేవి, దేవసఖః=(అగ్ని)దేవునకు స్నేహితుడైన వాయువు, మణినా సహ=ఆధారవహ్నితోపాటు, మామ్=నన్ను, ఉపైతు=పొందుగాక, అస్మిన్ రాష్ట్రే=కర్మభూమి అయిన ఈ దేశంలో, ప్రాదుర్భూతః అస్మి=నేను ప్రాదుర్భవించాను, ఋద్ధిః=(స్వరూపరూప గుణవిభూతి) సమృద్ధిని పొందిన లక్ష్మీదేవి, కీర్తిమ్=కీర్తిని, మే=నాకు, దదాతు=ఇచ్చుగాక!

**భావము :** ఈ మంత్రంలో భక్తియోగంతో లక్ష్మీదేవిని వేదపురుషుడు ధ్యానిస్తున్నాడు.

**(ఉపైతు మాం దేవసఖః కీర్తిశ్చ మణినా సహ)**–దేహంలో ఉండే మూలాధారవహ్ని అనే అగ్ని ఒకటి ఉన్నదని, దానిలో యోగపద్మాలు అనబడే పన్నెండు తామరలు ఉన్నవని, అగ్నిని ఎల్లప్పుడు విడువకుండా ఉండేవాడు, అగ్నిని పోషించేవాడు అయిన వాయుదేవుని చేత కించిత్కరింపబడి, తామరనివాసిని అయిన లక్ష్మిదేవి ఆ యోగపద్మాలలో ఒక్కొక్కటిలో ఉండి ఉండి, అలసి సొలసి పన్నెండవ పద్మం అయిన హృదయకమలాన్ని చేరి స్థిరంగా నిలచి ఉంటుందని, అక్కడనే యోగులు లక్ష్మీదేవిని ధ్యానించి, మహానందాన్ని పొందుతారని యోగశాస్త్రంలో చెప్పబడ్డ విషయం. ఆ రీతి ఇక్కడ తెలుపబడింది. **(ఉపైతు మాం దేవసఖః)** అగ్నిదేవునకు స్నేహితుడైన వాయువు నన్ను పొందాలి. పిరాట్టికి కించిత్కారాన్ని చేయగల్గిన భాగ్యాన్ని కలవాడు కదా ఇతడు. అందువల్ల ఇతనిని కూడా పొందాలని కోరుతున్నాడు.

**(మణినా సహ దేవసఖః)**–మూలాధారవహ్నితోపాటు, ఆ అగ్నికి సఖుడైన వాయువు.



ఇక్కడ “మణి” అనే పదం అగ్నిని నిర్దేశిస్తుంది. ప్రస్తుతం యోగప్రకరణం కనుక మూలాధారవహ్నిని చెబుతున్నది.

**(కీర్తిశ్చ)**–లక్ష్మీదేవి కూడా నన్ను పొందుగాక! అని భావం. చకారం ఈమెయొక్క ప్రాధాన్యాన్ని చూపుతున్నది. ఈమెకు కింకరులై ఉండడంవల్ల వాయువు, అగ్ని ప్రాప్యులు అవుతున్నారు–అని తాత్పర్యం.

**(కీర్తిః)**–యశస్సే మూర్తీభవించినదిగా ఉన్నందున “కీర్తి” అనే చెప్పబడేది. “యశసా“ అనేచోట చూపబడ్డ ప్రమాణాలను అనుసంధించాలి.

**(కీర్తిః)**–“కౄ–విక్షేపే” అని ధాతువు కాబట్టి కిరణాలను విక్షేపించేది–నాల్గు దిశలలో ప్రసరింపజేసేది–అని దీని భావం. (వాయువుతో పద్మాలలో) సంచరించేటట్లు చేయబడేది–అని కూడా భావం. ఈ రెండుభావాలు కీర్తి అనే నామానికి ఉన్నాయి. యోగపద్మాలలో మందమారుతం వీచగా లక్ష్మీదేవి సంచరించేటపుడు **“ఆత్మకాంత్యా విశ్వమాప్యాయ యంత్యా” (వైకుంఠగద్యమ్)** (తన కాంతితో అన్నిటినీ నిండిస్తూ ఉండేది) అనే రీతిలో యోగుల దేహాలలో అంతటా తన కాంతిని నిండిస్తూ వెంచేసి ఉంటుంది కనుక కీర్తి అని అనబడుతున్నది–అని మొదటి అర్థం. వాక్కుకు, మనస్సుకు అందని సౌకుమార్యాన్ని కల్గిన ఈ లక్ష్మీదేవి ఒక తామరపూవునుండి వేఱొక తామరపూవుకు వేంచేయడాన్ని చూస్తే, గాలిచేత ప్రేరేపించ (ఎగురగొట్ట)బడే పూవువలె, ఈ మందమారుతం చేత ఈ లక్ష్మీదేవి ఒకపూవునుండి ఇంకొక పూవుకు సంచరించేటట్లు చేయబడుతున్నది అని అనేటట్లున్నది కాబట్టి కూడా కీర్తి అని అనబడుతున్నది–అని రెండవ అర్థం. ఈ రెండు అర్థాలు, ఈ మంత్రంయొక్క అర్థం.

**కిరంతీ కిరణాన్ లోకే కిరన్తీ చోత్తరోత్తరమ్।**
**వాయునా దేవమిత్రేణ మణినాఽఽధారవహ్నినా॥**
**శనైర్విశ్రమ్య విశ్రమ్య పద్మేషు జలజన్మనామ్।**
**ద్వాదశానాం తతశ్చోర్ధ్వం భజామి ద్వాదశాంతిమమ్॥**
**కీర్తయంతి తతఃకీర్తిం మునయో మాం మనీషిణః।**
**పంచాక్షరో హ్యయం మంత్రో యోగవైమల్యదాయకః॥ 50–145**

(దేహం అంతా కిరణాలను ప్రసరింపజేసేదాననై, అగ్నిదేవుని సఖుడైన వాయువుచేత, మణి అనబడే మూలాధారవహ్నిచేత ఉత్తరోత్తరంగా పన్నెండు తామరపూవులలోను మెల్లమెల్లగా సంచరిస్తున్నదాననై, ఆ విధంగా సంచరించి అన్నిటికీ పైన ఉండే పన్నెండవ తామరను నేను చేరుతాను. గొప్ప మనస్సును కలవారైన మునులు ఈ కారణాలవల్లనే నన్ను “కీర్తి” అని అంటున్నారు. అయిదు అక్షరాలనుకల **“ఓమ్ కీర్త్యై నమః”** అనే ఈ మంత్రం యోగదశలోని మాలిన్యాలను తొలగిస్తుంది) అని

ఈ రీతిలో ఈ మంత్రంలోను, పూర్వమంత్రంలోను ఇష్టప్రాప్తి, అనిష్టనివృత్తి ప్రార్థింపబడ్డాయి.

| | |
|---|---|
| **9.** | **గంధాద్వారాం ధురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్।** |
| | **ఈశ్వరీం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియమ్॥ 9** |

**ప్రతిపదార్థము :** గంధద్వారామ్=(అన్ని) సుగంధాలకు హేతుభూతురాలై ఉన్నది, ధురాధర్షామ్=(ఎవరివల్ల) జయించడానికి సాధ్యం కానిది, నిత్యపుష్టామ్=ఎల్లప్పుడూ గుణపూర్తిని కల్గినది, కరీషిణీమ్=గజాలకు ఈశ్వరియై, వాటిని అధిరోహించి సంచరించేది, సర్వభూతానామ్ ఈశ్వరీమ్=అన్ని జీవరాశులకు ఈశ్వరి, శ్రియమ్ త్వామ్=శ్రీదేవి అయిన నిన్ను, ఇహ=ఇక్కడకు, ఉపహ్వయే=ఆహ్వానిస్తున్నాను.

**భావము : "సర్వాన్ నిర్ణుద మే గృహాత్"** అని ప్రార్థించి, లక్ష్మీదేవి అనుగ్రహంచేత అన్ని అమంగళాలను తన ఇంటిలో లేకుండా చేసికొన్నందున సర్వమంగళాకార అయిన లక్ష్మీదేవి యొక్క వాసానికి యోగ్యంగా ఉండే తన ఇంటిలో ఆమె నిత్యవాసం చేసేటట్లు సర్వేశ్వరి అయిన లక్ష్మిని వేదపురుషుడు ఈ మంత్రంలో ఆహ్వానిస్తున్నాడు.

**(గంధద్వారామ్)–"ద్వారమ్"** –అంటే కారణం. "గంధ" శబ్దం శబ్దస్పర్శరూపరసాలనే నాల్గు గుణాలకు ఉపలక్షకమై, భూమిలో ఉండే శబ్దాదులు అయిదు గుణాలను, వాటికి ఆశ్రయాలైన భూమ్యాదిభూతపంచకాన్ని నిర్దేశిస్తుంది. "గంధద్వారా" అనే తిరునామం ఈ అయిదు భూతాలను, వాటి గుణాలను తనను తెలిసికొనే విషయంలో కారణంగా కల్గినది–అనే అర్థాన్ని ఇస్తుంది. **"నిత్కిన్ఱదెల్లామ్ నెడుమాల్"** (భక్తిసారసూక్తం–54) (సమస్త జీవరాశులు శ్రియఃపతి అంతర్యామిగా కల్గినవి) అనే రీతిలో భగవానుని దర్శించడం కూడా అతనిని తెలియడానికే కారణం అవుతున్నది కనుక లక్ష్మీదేవి "గంధద్వారా" (గంధాదులను తనను తెలిసే విషయంలో కారణంగా కల్గినది) అనే నామాన్ని పొందుతున్నది.

**(గంధద్వారామ్)**–పుణ్యగంధాలన్నిటికీ కారణభూత–అనే అర్థాన్నికూడా గ్రహించవచ్చు. "సర్వగంధః" (అన్ని సుగంధాలను కల్గినవాడు) అని చెప్పబడే భగవానుని ఆశ్రయించి ఉన్నది కనుక, తామరపూవులో సువాసనను ఉపాదానంగా కల్గి రూపొందినది–ఈ లక్ష్మీదేవి అనే రీతిలో ఉన్నందున అన్ని సుగంధాలకు ఉత్పత్తి స్థానమై ఉన్నది –అని భావం. ఈ రెండు అర్థాలు

> **గంధాదయః పృథివ్యాద్యా ద్వారాణి మమ వేదనే।**
> **సర్వేషాం పుణ్యగంధానాం ద్వారభూతాస్మి శాశ్వతీ॥**
> **గంధద్వారేతి మాం ప్రాహుః విప్రా వేదాంతపారగాః।**

(గంధం మొదలైనవి, భూమి మొదలైనవి నన్ను తెలిసికోవడంలో కారణాలుగా



**మెన్పూవైయుమ్ విట్టకన్ఱ శెఱుజోద్దై"** (కలివైరిసూరిసూక్తం–3–7–8) (లీలాసాధనం అయిన చిన్నచేట, పచ్చని చిలుక, బంతి, ఊయల, చిన్నగూడులో ఉండి కూసే మృదువైన నాకణవాయ్పక్షి–అనే వీటిని విడిచి బయటకు వచ్చినది, అందమైన పూలవంటిది) అని, **"పూవై పైజ్కిళికళ్ పన్దుతూదై పూమ్పుట్టిల్కళ్"** (శఠకోపసహస్రం–6–7–3) (గోరువంకలు, పచ్చని చిలుకలు, బంతి, చిన్నపాత్ర, పూవుల పుటికెలు) అని చెప్పే రీతిలో అతని విభూతి కంటే మించినదై, **"శేషిత్వే పరమః పుమాన్"** (శ్రీగుణరత్నకోశం–22) (నీకు యజమానిగా ఉండే పదవిలో నియమింపబడి, పరమపురుషుడుకూడా నీ విభూతి–అవుతున్నాడు) అనే రీతిలో అతనినికూడా అంతర్భవించుకొన్నది కనుక ఈమె విభూతి చాలా సమృద్ధంగా ఉంటుంది. **"అర్ధయామి ఇతి బుద్ధిః"** (విష్ణువును ఆనందింపజేస్తున్నాను కనుక బుద్ధి అని అనబడుతున్నాను) అని బుద్ధి శబ్దానికి అర్థాన్ని గ్రహించవచ్చు. ఈ హేతువులచేత లక్ష్మి "బుద్ధి" అని అనబడుతున్నది. యోగులదేహాలలో ఉండే పన్నెండు యోగపద్మాలలోను సంచరించేటపుడు ఒక్కొక్క పద్మంలోను ముందు పద్మంలో ఉన్నదాని కంటె రూపగుణాలతో అతిశయించి ఉంటుంది కనుక "బుద్ధి" అని అనబడుతున్నది అని కూడా చెప్పవచ్చు. **"కీర్తిమృద్ధిమ్"** అని, **"కీర్తివృద్ధిమ్"** అని, మొదటి అర్థంలో **'మనునా సహ"** అని, **"దేవి సహ"** అని పలు రీతులలో పాఠాలు కనబడుతున్నాయి. ఆ పాఠాలు లక్ష్మీతంత్రంలో లక్ష్మి అనుగ్రహించిన అర్థానికి విరుద్ధం కనుక అనాదరించదగినవి. **"బుద్ధి"** అనే నామానికి గల ఈ అర్థాలు

> **బుద్ధాఽస్మ్యహం గుణైర్విష్ణోరర్ధయామి చ యోగినః।**
> **పత్రేషు యోగపద్మానామధారాంతరచారిణామ్॥**
> **ఉత్తరోత్తరమ్ బుధ్యంతీ భజంతీ విస్తృతిం పరామ్।**
> **బుద్ధిమ్ రుద్ధాం తతః ప్రాహుర్యోగినో యోగదీపినీమ్॥ 50–147**

(ఆత్మగుణాలతోను, దేహగుణాలతోను నేను విష్ణువుకంటే సమృద్ధిని పొందాను. ఆ విష్ణువును ఆనందింపజేస్తున్నాను. యోగుల మూలాధారంలో ఉండే యోగపద్మాల రేకులలో ఉత్తరోత్తరంగా చలించేటపుడు గొప్పదైన విస్తృతినిపొంది, వృద్ధిని పొందిన దానవై, ప్రకాశంతో అతిశయించి ఉంటాను. ఈ రీతిలో సమృద్ధిని పొంది ఉన్నందున యోగాన్ని ప్రకాశింపజేసే నన్ను బుద్ధి అని యోగులు నిర్దేశిస్తున్నారు)–అని లక్ష్మీతంత్రంలో తెలుపబడ్డాయి.

**(కీర్తిః ఉపైతు కీర్తిం దదాతు)**–"కీర్తిః" అనే పేరును పొందినందున, కీర్తియే మూర్తీభవించినది కాబట్టి ఈమె కీర్తిని కల్గించగల్గినది–అని భావం. ఈ మంత్రానికి ఫలం ప్రత్యేకంగా చెప్పబడలేదు కనుక మధ్యమణిన్యాయంలో **"పంచాక్షరో హ్యయం మంత్రో యోగవైమల్యదాయకః"** (అయిదు అక్షరాలను కల **"ఓమ్ బుద్ధ్యై నమః"** అనే ఈ మంత్రం యోగదశలోని మాలిన్యాలను తొలగిస్తుంది) అని గత మంత్రంలో చెప్పబడ్డ ఫలమే దీనికి

కూడా ఫలంగా చెప్పవచ్చు.

| | | |
|---|---|---|
| **8.** | **క్షుత్పిపాసాం మలాం జ్యేష్ఠామలక్ష్మీం నాశయామ్యహమ్।** | |
| | **అభూతిమసమృద్ధిఇ్చ సర్వాన్ నిర్ణుద మే గృహాత్॥** | **8** |

**ప్రతిపదార్థము :** క్షుత్=ఆకలిని, పిపాసామ్=దాహాన్ని, మలామ్=దోషాలకు కారణమైన వానిని, జ్యేష్ఠామ్=(శ్రీదేవికంటే) పెద్దది అయిన, అలక్ష్మీమ్=జ్యేష్ఠాదేవిని, అహమ్=నేను, నాశయామి=నశింపజేస్తున్నాను, (ఓ లక్ష్మీదేవీ!), అభూతిమ్=దారిద్ర్యం, అసమృద్ధిమ్= ఆత్మగుణాలలేమి మొదలైన, సర్వాన్=అన్నిటినీ, మే=నాయొక్క, గృహాత్=ఇంటినుండి, నిర్ణుద=పారద్రోలు.

**భావము :** "నాకు కీర్తిని లక్ష్మీదేవి అనుగ్రహించాలి" అని గడచిన మంత్రంలో వేదపురుషుడు ఇష్టప్రాప్తిని ప్రార్థించాడు. అనిష్టనివృత్తిని కూడా ఆమే అనుగ్రహించాలి అని ఈ మంత్రంలో ప్రార్థిస్తున్నాడు.

**(క్షుత్)**–ఆకలి అని అర్థం. ఈ లోకంలో జీవుని బాధించేవాటిలో చాలా ముఖ్యమైనది ఆకలి కదా! **"క్షుత్ ఖలు వై మనుష్యస్య భాతృవ్యః"** (తైత్తి.సంహి.6-1-21) (ఆకలి అన్నది మానవునకు విరోధి) అని వేదంకూడా పలికింది. అందువల్ల లేకుండా చేసికోవలసిన వానిలో మొట్టమొదటిదిగా ఆకలిని ఉద్దేశించి వేదపురుషుడు అంటున్నాడు.

**(పిపాసామ్)**–దాహాన్ని–అని అర్థం. ఇది మిగిలిన ఇంద్రియాల కోరికలను అన్నిటిని ఉపలక్షిస్తుంది.

**(క్షుత్పిపాసాం నాశయామి)**–**"విజిఘత్సః అపిపాసః"** (ఛాందో-8-7-1) (ఆకలి లేనివాడు, దాహం లేనివాడు) అనే స్థితిని పొందాలని నేను కోరుకుంటున్నాను. ఈ రెండిటిని– అంటే –క్షుత్తు, పిపాసలను ప్రస్తావించడం **"అపహతపాప్మా విజరో విమృత్యుః విశోకః"** (ఛాందో-8-7-1) అని దీనికి ముందు చెప్పబడ్డ పాపం, ముసలితనం, మరణం, దుః ఖం–అనే వీనికి, **"తోత్తమ్ వాన్ పిణి మూప్పు"** (శఠకోపసూరిసూక్తం-8-7-1) (జన్మ, గొప్పవ్యాధి, ముసలితనం) అని, **"పిణి మూప్పు త్తున్బమ్"** (వ్యాధి, ముసలితనం, దుః ఖం) (భక్తాంఘ్రిరేణుసూక్తం-3) అని చెప్పబడ్డవానికి ఉపలక్షణం. వీటికి కారణం అయిన జ్యేష్ఠాదేవిని నశింపజేస్తాను–అని భావం.

**(మలామ్)**–దోషమే మూర్తీభవించిన దానిని–అని భావం.

**(జ్యేష్ఠామ్)**–జ్యేష్ఠాదేవిని–అని భావం. పాలసముద్రాన్ని చిలికినపుడు పుట్టిన పలు వస్తువులలో ఈమె కూడా ఒకతె–అని పలువురు పురాణవేత్తలంటున్నారు.

**(కులాం జ్యేష్ఠామ్)**–గుణాలు అన్నీ రూపుదిద్దుకొన్నట్లుండే శ్రీదేవికి ముందుగా దోషాలు అన్నీ మూర్తీభవించిన ఈమె జన్మించడంచేత, **"జ్యేష్ఠా"** అని, **"దరిద్రదేవత"** అని చెప్పబడుతున్నదని అంటారు. **"కెరుడవాకనుమ్ నిఱ్క శ్కేట్టైతన్ మడియకత్తు చ్చెల్వమ్ పార్త్తిరుక్కిన్టీరే"** (భక్తాంఘ్రిరేణుసూక్తం-10) (గరుడవాహనుడు ఉండగా జ్యేష్ఠాదేవి ఒడిలో ఉండే సంపదను అంటే–దారిద్ర్యాన్ని అపేక్షిస్తున్నారే) అని అంటూ భక్తాంఘ్రిరేణుసూరి కూడా పలికారు.



**(జ్యేష్ఠాం లక్ష్మీం నాశయామ్యహమ్)–**

**అలక్ష్మీశ్చ మయా ప్రోక్తా పత్నీ యా దుస్సహస్య చ।**
**నారాయణపదం త్యక్త్వా నశ్యత్యేవ న సంశయః॥**

(దుస్సహుని పత్ని అని నాచే చెప్పబడ్డ అలక్ష్మి నారాయణుని శ్రీపాదాలను తలిస్తే నశిస్తుంది అని అనడంలో సందేహం లేదు) అని లింగపురాణంలో చెప్పబడ్డ రీతిలోనే లక్ష్మీదేవికి వ్యతిరేకం అయిన అలక్ష్మిని శ్రీమన్నారాయణుని కృప అనే దండంతో కొట్టి నశింపజేస్తాను–అని భావం.

**"అహం నాశయామి"** (నేను నాశనం చేస్తాను) అని అంటున్నావే! నీ ప్రయత్నంతో నీవు చేయబోయే కార్యమా! ఇది–అని ప్రశ్నింపగా, "తల్లీ! వీటిని అన్నిటినీ నీవే నశింపజేయాలి–అని అంటున్నారు. అతిబలహీనుడనైన నావల్ల సాధ్యం అయినది ఏదయినా ఉన్నదా! అని లక్ష్మిని వేదపురుషుడు తరువాతి భాగంలో ప్రార్థిస్తున్నాడు.

**(అభూతిమ్)**–దేహసంబంధులైన పశుపత్నిపుత్రబంధుగృహ–ఆరామ–ధనాదిసంపదలు లేకపోవడం అనే దారిద్ర్యాన్ని –అని భావం.

**(అసమృద్ధిమ్ చ)**–ముందుచెప్పిన వానివలె అస్థిరాలు కాకుండా, స్థిరమైన సంపద అయిన శమదమాది ఆత్మగుణసంపదయొక్క లేమిని–అని భావం. నిజానికి ఆత్మగుణాలే ఈ చేతనునకు స్థిరమైన సంపద కనుక "సమృద్ధి" అని అనబడుతున్నది.

**(సర్వాన్)**–వీటిని కూడా పూర్వం చెప్పిన ఆకలి, దాహం మొదలైనవాటిని అన్నిటినీ **"సర్వాన్ నాశయామి"** అని పూర్వం చేయబడ్డ ప్రయోగంతో అన్వయించి అర్థం చెప్పేవారు కూడా ఉన్నారు.

**(నిర్ణుద మే గృహాత్)**–వీటిని అన్నిటినీ నా ఇంటినుండి లేకుండా తరిమి వేయాలి.

**(క్షుత్పిపాసాం నాశయామి)**–తల్లి ఉండగా ఆకలి దప్పులు బాధిస్తాయా!

**(మలాం నాశయామి)**–మంగళస్వరూపిణి ఉండగా మలస్వరూపిణి నిలచి ఉండగలదా?

**(జ్యేష్ఠాం నాశయామి)**–లక్ష్మీదేవి ఉండగా జ్యేష్ఠాదేవి ఊపిరి అయినా పీల్చుకొనగలదా?

**(అలక్ష్మీం నాశయామి)**–లక్ష్మి వేంచేసి ఉండేచోట అలక్ష్మి నశించకుండా ఉండగలదా!

**(అభూతిమసమృద్ధిం నిర్ణుద)**–**"ఋద్ధి"** అని అనబడే సంపద ఉన్నతావున దారిద్ర్యం నివసించగలదా?

సంచరిస్తున్నది లక్ష్మీదేవి-అనే అర్థాన్ని చూపుతున్నది. ఈ విధంగా గజాలకు ఈశ్వరియై, వాటిపై ఎక్కి సంచరించేది **"కరీషిణీ"** -అని భావం.

**ఆగ్నేయాది దౌస్త్యాస్తే గుల్గులుశ్చ కురణ్డకః।**
**దమకః శలిలశ్చేతి ఖ్యాతాః పుష్ణంతు మే శ్రియమ్॥**

(ఒక్కొక్క దిక్కులోను ఉండే తామరరేకులలోగల గుల్గులు, కురణ్డక, దమక, శలిల అనే ప్రసిద్ధిని పొందిన ఏనుగులు నా సంపదను వృద్ధి చేయాలి) అని మంకణసంహితలోను,

**ఐరావతాదిభిః సమ్యక్ సమాజై రావృతాం శుభామ్।** (ఐరావతం మొదలైన గజాల సమూహాలతో పరివేష్టింపబడి ఉన్నది, మంగళకరమైనది-అయిన లక్ష్మీదేవిని) అని కాశ్యపీయంలోను ఈ లక్ష్మీదేవి గజబృందాలకు నాయకిగా ఉంటుందనే అర్థం తెలుపబడింది కదా!

**(కరీషిణీమ్)**-లేక, **"కరి"** అనే పదం-సృష్టి మొదలైన కార్యాలను లక్ష్మి నిర్వహిస్తున్నది అని, **"ఇష్-గతౌ", "ఇణ్-గతౌ"** అనే ధాతువులు, ఈమె అన్నిటిని పొందుతున్నది-అని, అన్నీ ఈమెను పొందుతున్నది-అనే అర్థాలను ఇస్తున్నది-అని చెప్పవచ్చు. సృష్టిని నిర్వహింపజేసేది-కనుక సృష్టిని చేసేదిగా చెప్పబడుతున్నదని గ్రహించాలి. అన్నిటినీ తాను పొంది, అన్నిటిచేత పొందబడేవాడు కనుక, "వాసుదేవు"డని, "నారాయణు"డని చెప్పబడే స్వామికి స్వరూపనిరూపకభూతయై, అతడు ఉండేచోటు అంతా ఈమెకూడా వ్యాపించి ఉన్నందున ఈమె అన్ని వస్తువులను పొంది, అన్ని వస్తువులచేత పొందబడుతున్నది-అని అనడంలో అడ్డులేదు. ఈ విధంగా, సృష్టి మొదలైనవానిని చేయించేదై, అన్ని వస్తువులను పొంది, వాటిచేత పొందబడేది కనుక వాటిని తనలో అంతర్భవించుకొన్నది కనుక **"కరీషిణీ"** అని అనబడుతున్నది-అని తాత్పర్యం.

**కరిణో నామ కర్తారస్త్రిశుద్ధాః త్రిక్రియాపరాః।**
**తానిచ్ఛామి సదా ద్రష్టుం మనసా యామి తాన్ సదా॥**
**హిమశైలేంద్రసంకాశా గజేంద్రా మమ వాహనాః।**
**తైరీశ్వరా సదా యామి కర్త్రీ చాంతవతీ సదా॥**
**కరీషిణీతి మాం తేన తత్త్వజ్ఞా సంప్రచక్షతే।**
**సప్తాక్షరో హ్యయం మంత్రః సర్వకామసమృద్ధిదః॥**

(త్రివిధకరణాలలో పరిశుద్ధులై, ప్రవృత్తి, నివృత్తి, ప్రవృత్తినివృత్తి అనే మూడు విధాలైన కార్యాలను చేసేవారు "కరిన్" శబ్దంతో చెప్పబడుతున్నారు. వారిని సదా చూడగోరుతాను. నా మనస్సులో వారిని ఎల్లప్పుడు పొందుతాను. హిమవత్ పర్వతం వంటి గజాలు నాకు వాహనాలుగా ఉన్నాయి. వాటికి ఈశ్వరినై, వాటిపై అధిరోహించి,



ఉన్నవి. సుగంధాలకు అన్నిటికీ నిత్యమైన కారణంగా ఉన్నాను నేను. (ఈ కారణాలవల్ల) వేదాంతపారగులైన బ్రాహ్మణులు **"గంధద్వారా"** అని నన్ను అంటున్నారు) అని లక్ష్మీతంత్రంలో ఘోషింపబడింది.

**(దురాధర్షామ్)**-అసురరాక్షసులచేత పరాభవించడానికి సాధ్యంకానిది.

**కథం త్వం తస్య వైదేహీం రక్షితాం స్వేన తేజసా।**
**ఇచ్ఛసి ప్రసభం హర్తుం ప్రభామివ వివస్వతః॥**
**న సా ధర్షయితుం శక్యా మైథిల్యోజస్వినః ప్రియా।**
**దీప్తస్యేవ హుతాశస్య శిఖా సీతా సుమధ్యమా॥ (రామా.అర. 37)**

(తన తేజస్సుతో రక్షింపబడే రామపత్ని అయిన వైదేహిని, సూర్యుని దగ్గరనుండి కాంతిని అపహరించాలని అనుకున్నట్లు, ఏ విధంగా దొంగిలించాలని అనుకుంటున్నావు? బలశాలి అయిన రాముని భార్యయై, అందమైన నడుమును కల్గినదై, మిథిలా రాజపుత్రి అయిన సీత జ్వలించే అగ్నియొక్క శిఖవలె భరించ సాధ్యం కానిది) అని మారీచుడు అన్నాడు కదా!

**(దురాధర్షామ్)**-ఎవరిచేత అపహరించడానికి వీలుకాని జ్ఞానక్రియలను కల్గినది-అని కూడా భావం. లోకంలో కన్పించే జ్ఞానక్రియలన్నీ

**దేవతిర్యఙ్మనుష్యేషు పున్నామా భగవాన్ హరిః।**
**స్త్రీనామ్నీ లక్ష్మీ ర్మైత్రేయ! నానయోర్విద్యతే పరమ్॥ (విష్ణు.పు.1-8-35)**

(మైత్రేయా! దేవతలు, తిర్యక్కులు, మానవులు మొదలైన జీవరాశులలో మగజీవరాశులు భగవానుడైన హరి అంశాన్ని కలవారు. స్త్రీ జీవరాశులు లక్ష్మియొక్క అంశాన్ని కల్గినవి. ఈ ఇద్దరికంటే అన్యం ఏదీ లేదు) అని,

**యో యో జగతి పుంభావః స విష్ణురితి నిశ్చయః।**
**యో యస్తు నారీభావః స్యాత్ తత్ర లక్ష్మీః వ్యవస్థితా॥**
**ప్రకృతేః పురుషాచ్చాన్యస్తృతీయో నైవ విద్యతే।**
**అథ కిం బహునోక్తేన నరనారీమయో హరిః॥ (సనత్కుమారసంహిత)**

(లోకంలో పుంస్త్వం కనబడే చోట అంతా హరి ఉన్నాడన్నది నిశ్చయం. స్త్రీత్వం ఉన్నచోట అంతా లక్ష్మీదేవి ఉన్నది. ప్రకృతికి అభిమానినిగా ఉండే పిరాట్టిని, పురుషాభిమానిగా ఉండే భగవానుని తప్ప మూడవది ఏదీ లేదు. పలు మాటలు పల్కడం ఎందుకు? స్త్రీ పురుషులు అందఱూ శ్రీమన్నారాయణుడే) అని చెప్పే రీతిలో శ్రీమన్నారాయణుని జ్ఞానక్రియల అంశాలే కనుక లక్ష్మీదేవి జ్ఞానక్రియలను అడ్డేవాడు లేడు అని తెలియడం, బాధించడం అనే కార్యాన్ని చేయడం, దివ్యదంపతుల జ్ఞానక్రియలను సాధించడంలోనే పర్యవసిస్తుంది. కనుక బంధించడానికి సాధ్యంకాని జ్ఞానాన్ని, కార్యాన్ని

కల్గినది–అనే అర్థాన్ని గ్రహించవచ్చు. ఈ రెండు అర్థాలు, ఈ మంత్రవైభవం–

**దురాధర్షాస్మి సర్వేషాం దైత్యదానవరక్షసామ్।**
**శుద్ధా సంవిత్క్రియా చాహం నార్వా కైరపి బాధితుమ్॥**
**సర్వేషామాత్మభూతాయా మమ సంవిత్క్రియాత్మనః।**
**జ్ఞాతృత్వమపి కర్తృత్వం యో నామాపనినీషతి॥**
**జ్ఞాతా కర్తా నిషేధన్య స నిర్వక్ష్యతి తత్ కథమ్।**
**శక్తో ధర్షయితుం కశ్చిన్నైవ సంవిద్గతిం మమ॥**
**ధురాధర్షేతి మాం ప్రాహుః సాంఖ్యజ్ఞానవిచక్షణాః।**
**అష్టాక్షరో హ్యయం మంత్రః తమోగతివినాశనః॥ 50–153**

(అసురులచేత, రాక్షసులచేత అవమానించడానికి సాధ్యంకాని దానను. పరిశుద్ధం అయిన జ్ఞానక్రియారూపిణి అయిన నేను ఎవరికీ బాధించడానికి సాధ్యంకాని దానను. జ్ఞానక్రియారూపిణియై సర్వాత్మభూతగా ఉండే నా జ్ఞాతృత్వాన్ని (జ్ఞానాన్ని కల్గినదాననై ఉండే స్వభావాన్ని), కర్తృత్వాన్ని, (కర్తగా ఉండే స్వభావాన్ని) ఎవడు బాధిస్తున్నాడో, అతడు–బాధించే జ్ఞానాన్ని కల్గినవాడు కావడంవల్ల, బాధించడం అనే కార్యాన్ని చేసేవాడు కావడం వల్ల, నా జ్ఞాతృత్వ–కర్తృత్వాలను స్థాపించినవాడే అవుతున్నాడు తప్ప ఏ విధంగా వాటిని బాధించగల్గుతున్నాడు? నా జ్ఞానక్రియలను లేకుండా చేయడం ఎవరివల్ల వీలుకాదు. అందువల్ల నన్ను తత్త్వజ్ఞానాన్ని కలవారు **"దురాధర్షా"** అని వ్యవహరిస్తున్నారు. **"ఓమ్ దురాధర్షాయై నమః"** అనే ఎనిమిది అక్షరాలను కల ఈ మంత్రం అజ్ఞానాన్ని పోగొడుతుంది) అని లక్ష్మీతంత్రంలో ఘోషింపబడింది.

ఈ విధంగా అసుర–రాక్షసులకు సమీపించడానికి సాధ్యం కాకుండా ఉండడంలో ఏమి కారణం? అని అంటే,

**(నిత్యపుష్టామ్)–"నిత్యాయ పరమాత్మనే విష్ణవే"** (విష్ణు.పు.1–2–1) అనే రీతిలో నిత్యుడనే పేరునుకల విష్ణువుచేత పోషింపబడుతున్నది కనుక ఆ విధంగా పిలువబడుతున్నది.

**న సా ధర్షయితుం శక్యా మైథిల్యోజస్వినః ప్రియా॥** (రామా–అర–37–20)

(మహాబలశాలి అయిన రాముని భార్య అపహరించడానికి సాధ్యం కానిది) అని, **"న త్వం సమర్థస్తాం హర్తుం రామచాపాశ్రయాం వనే"** (రామా.అర.37–18) (రాముని వింటిని ఆశ్రయించి ఉండే ఆమెను అపహరించడం నీకు సాధ్యం కాదు) అని, **"బాహూ రామస్య సంశ్రితా నాహారయతి సంత్రాసమ్"** (రామా.అర.60–20) (రాముని బాహువులను ఆశ్రయించి ఉన్నందున అరణ్యమృగాలను చూచి భయపడడం లేదు) అని కదా చెప్పబడింది.

**(నిత్యపుష్టామ్)**–ఎల్లప్పుడు సద్గుణాలు నిండి ఉండేది–అని కూడా భావం.



**(నిత్యపుష్టామ్)**–లౌకిక విషయానుభవం ఏమీ లేనందున, పుష్టిని పొందిన, జ్ఞానమయం అయిన దివ్యరూపాన్ని కల్గినది–అని కూడా భావం. **''ఉపవాసకృశామ్''**– (రామా.సుంద.15–19) (ఉపవాసంచేత కృశించిన సీతాదేవి) అనే సందర్భంలో చెప్పబడ్డ ఉపవాసం, భగవదనుభవం అనే ఉపవాసరాహిత్యాన్ని చెబుతున్నది. ఈ మూడు అర్థాలు, మంత్రవైభవం

**నిత్యేన విష్ణునా పుష్టా నిత్యం పుష్టా చ సద్గుణైః।**
**విషయైర్మే వినా పుష్టా నిత్యం సంవిత్పరా తనుః॥**
**సైవ పుష్ణాతి విషయాన్ అజడాభిర్జడాత్మనః।**
**నిత్యపుష్టాం తు మాం ప్రాహుః సిద్ధాస్సంవిద్విచక్షణాః॥**
**అష్టాక్షరో హ్యయం మంత్రో నిత్యం పుష్ణాతి సంవిదమ్।**

(నిత్యుడైన విష్ణువుచేత పుష్టిని పొందుతున్నది. సద్గుణాలతో ఎల్లప్పుడు పుష్టిని పొందుతున్నది. జ్ఞానాన్ని ప్రధానంగా కల నా శరీరం విషయానుభవం లేనందువల్ల పుష్టిని పొందుతున్నది. నిజానికి, జడమై, (స్వయంప్రకాశకం కానిదై), ఉన్న విషయాలను అజడాలైన (స్వయంగా ప్రకాశించే) తన సౌందర్యాది గుణాలతో ఆ మేనినే పోషిస్తున్నది. సిద్ధిని పొందిన జ్ఞానులు నన్ను (ఈ కారణాలవల్ల) **"నిత్యపుష్టా"** అని వ్యవహరిస్తున్నారు. **"ఓమ్ నిత్యపుష్టాయై నమః"** అనే ఎనిమిది అక్షరాలనుకల ఈ మంత్రం జ్ఞానాన్ని పోషిస్తుంది అని లక్ష్మీతంత్రంలో ఉద్ఘోషింపబడ్డాయి.

**(కరీషిణీమ్)–"కరి"** అనే పదం, **"ఇడు–ఇచ్ఛాయామ్"** అనే ధాతువు, **"ఇణ్–గతౌ"** అనే ధాతువు కలవగా ఏర్పడిన పదం ఇది. కృధాతువునుండి ఉత్పన్నమైన "కరి" శబ్దం కర్తలను నిర్దేశిస్తుంది. అంటే–మనస్సు, వాక్కు, శరీరం–అనే త్రికరణాలలో శుద్ధిని కలవారై, వర్ణాశ్రమధర్మానుష్ఠానం–మొదలైన ప్రవృత్తి క్రియలను, భగవత్ ప్రవృత్తి విరోధి స్వప్రవృత్తి నివృత్తి అనబడే నివృత్తిక్రియ అనే ప్రపత్తిని, భగవత్కైంకర్యం అనే ప్రవృత్తిని, ప్రపత్తి అనే నివృత్తిని కూడిఉండే ఉభయక్రియలను చేసేవారు ''కరిణః'' అని అనబడుతున్నారు. కోరికను తెలిపే **"ఇషు–ఇచ్ఛాయామ్"** అనే ధాతువు ముందు తెల్పిన కర్తలను ఎల్లప్పుడు వాంఛిస్తున్నది ఈ లక్ష్మీదేవి–అనే అర్థాన్ని ఇస్తుంది. గతిని తెలిపే **"ఇణ్–గతౌ"** అనే ధాతువు, వారిని తన మనస్సుతో ఎల్లప్పుడు పొంది ఉంటుంది లక్ష్మీదేవి– అనే అర్థాన్ని ఇస్తుంది. ఈ రీతిలో త్రివిధకర్మలను చేసేవారిని ఎల్లప్పుడు పొంది ఉండేది–అనే అర్థం "కరీషిణీ" అనే ఈ పదం వల్ల ఏర్పడుతున్నది.

**(కరీషిణీమ్)**–లేక, **"కరిన్"** అనే శబ్దం **"ఈశ్–ఐశ్వర్యే"** అనే ధాతువు, **"ఇణ్–గతౌ"** అనే ధాతువు కలవగా ఈ నామం ఏర్పడిందని కూడా చెప్పవచ్చు. **"కరిన్"** అనే శబ్దం గజాలను సూచిస్తుంది. **"ఈశ్–ఐశ్వర్యే"** అనే ధాతువు ఆ గజాలకు ఈశ్వరియై ఉన్నది లక్ష్మీదేవి–అని చూపుతున్నది. **"ఇణ్–గతౌ"** అనే ధాతువు వాటిపై అధిరోహించి

**"అనవధికాతిశయత్వవచనాత్ ఈశ్వరవ్యతిరిక్తాశేషగోచరస్యాపి తదైశ్వర్యస్య ఈశ్వరాభిమతత్వాన్నద్వైరాజ్యాదిదోషః" "అస్యేశానో జగతో విష్ణుపత్నీ"** (యజు-4-4-12 -57) **ఇతి విష్ణుపత్నీత్వవేషేణ హి సర్వస్య జగతః ఇయమీష్టే. "ఈశ్వరీం సర్వభూతానామ్" ఇత్యత్ర తు యద్యపి సర్వభూతానామితి ప్రతిసంబంధినిర్దేశాత్ స్త్రీప్రత్యయానుసారేణ ఈశ్వరపత్నీతి వివక్షాన శక్యా, తథాపి వ్యాఖ్యాంతరబలాదర్థస్య తథాత్వసిద్ధిః"** (ఈమె ఐశ్వర్యం అంతులేని గౌరవాన్ని కల్గినది అని అనడంవల్ల ఈశ్వరుడు తప్ప మిగిలిన వారిని అందరిని విషయీకరించే (విషయంగా కల్గి ఉండే) ఈమె ఈశ్వరీత్వం సర్వేశ్వరుని మనస్సునకు ఆనందదాయకం కనుక, ఇద్దఱు ఈశ్వరులు" అనే దోషం ఏమాత్రం లేదు. "విష్ణుపత్నియై, లోకానికి ఈశ్వరిగా ఉండే లక్ష్మి"-అని వేదం పల్కినట్లే విష్ణుపత్నిగా ఉంటూనే కదా ఈమె లోకాలను అన్నిటినీ నియమిస్తున్నది. "అన్ని భూతాలకు ఈశ్వరిని" అని శ్రీసూక్తంలో చెప్పబడిన చోట ఈశ్వరత్వానికి ప్రతిసంబంధిగా సర్వభూతాలను చెప్పినందువల్ల స్త్రీప్రత్యయాన్ని అనుసరించి ఈశ్వరునిపత్ని-అనే అర్థం చెప్పే వీలు లేకపోయినా, **"విష్ణుపత్నీ"** అని పూర్వం ప్రస్తావించిన వాక్యబలంచేత అర్థాన్ని ఆ విధంగానే చెప్పాలి).

ఇపుడు ఇంకొక పూర్వపక్షం, దానికి సమాధానం తెలుపబడుతున్నవి. **"ఈశ్వరః సర్వభూతానామ్"** (తైత్తి.ఉప. 2-46) (అన్ని భూతాలను నియమించేవాడు) అని భగవానుడు చెప్పబడేటట్లే, **"ఈశ్వరీం సర్వభూతానామ్"** అని లక్ష్మీదేవికూడా వేదంలో నిర్దేశింపబడింది. అందువల్ల ఇద్దఱూ సరిసమానం అయిన ఈశ్వరులే. లక్ష్మి భగవానునకు శేషభూతగా ఉండడం ఆమె ఇచ్ఛచేతనే తప్ప, సహజమైనది కాదు. అందువల్ల భగవానుని ఈశ్వరత్వం వంటిదే లక్ష్మీదేవి ఈశ్వరత్వంకూడా. అందువల్ల భగవానుడు పిరాట్టి అనే ఇద్దఱు కలిసే పరబ్రహ్మభూతులవుతున్నారు. **"ఉభయాధిష్ఠానం చ ఏకం శేషిత్వమ్"** (లక్ష్మీనారాయణులు ఇద్దఱు కలిసి ఒకే శేషిత్వానికి ఆశ్రయభూతులవుతున్నారు) అని షడర్థసంక్షేపం అనే గ్రంథంలో భగవద్రామానుజులశిష్యులలో ఒకరైన సోమాశి అణ్డాన్ అనే ఆచార్యులు పల్కిన రీతిలో ఉభయనిష్ఠం అయిన ఈశ్వరత్వం ఒకటే కనుక ఈశ్వరద్విత్వం అనే దోషం లేదు. దీనినే వేదాంతదేశికులు కూడా **"త్వామేవాహుః"** అని ప్రారంభం అయే శ్లోకంలో **"యువాం దైవతం దంపతీనః"** (మీ ఇద్దఱూ కలసి మాకు పరదేవత అవుతున్నారు) అని అన్నారు. అందువల్ల లక్ష్మీనారాయణులు ఇద్దరు పరబ్రహ్మభూతులే అన్నది పూర్వపక్షి హృదయం.

కాని, ఈ వాదం సరికాదు. శ్రుతిస్మృతీతిహాసపురాణవాక్యాలకు, దివ్యసూరుల సూక్తులకు చాలా విరుద్ధం కనుక పెద్దలు దీనిని ఆదరించలేదు. **"ఈశ్వరస్సర్వభూతానామ్"** అని భగవానుని గూర్చి చెప్పినట్లే, **"ఈశ్వరీం సర్వభూతానామ్"** అని లక్ష్మీదేవిని గూర్చి కూడా చెప్పినందువల్ల ఇద్దరు సమానం అయిన అనే అర్థాన్ని వేదాంతజ్ఞానాన్ని



ఎల్లప్పుడు సంచరిస్తాను. సృష్టి మొదలైన కార్యాలను చేసే దానినిగాను, అన్ని పదార్థాలను అంతర్భవించుకొన్నదానినిగాను ఎల్లప్పుడు నేను ఉంటాను. అందువల్ల నన్ను **"కరీషిణీ"** అని తత్త్వజ్ఞానులు నిర్దేశిస్తున్నారు. **"ఓమ్ కరీషిణ్యై నమః"** అనే ఏడు అక్షరాలను కల ఈ మంత్రం అన్ని మనోరథాల సమృద్ధిని కలిగిస్తుంది) అని ఈ మూడు అర్థాలు, మంత్రవైభవం లక్ష్మీదేవిచేత లక్ష్మీతంత్రంలో తెలుపబడ్డాయి.

**"కరీషిణీ"** అనే నామంచేత ఏనుగులకు నాయకిగా ఉంటుందనే అర్థం తెలుపబడుతున్నదని వివరింపబడింది. "కేవలం గజాలకు మాత్రమేకాదు, చిదచిత్తత్త్వాలకు కూడా నాయకిగా ఉండేది ఈమే" అని ఘోషిస్తున్నది తరువాతి నామం.

**(ఈశ్వరీం సర్వభూతానామ్)**-చేతనులు, అచేతనాలు, ఈశ్వరుడు-అనే మూడు విధాలుగా ఉండే తత్త్వాలు అన్నిటికీ ఈశ్వరియై ఉండే (నిన్ను)-అని భావం. **"సర్వభూతానామ్ ఈశ్వరీ"** (అన్ని భూతాలకు ఈశ్వరి) అనేచోట సర్వశబ్దానికి అర్థసంకోచం ఉన్నదని తెలిపే ప్రమాణంగాని, సూచకంగాని ప్రకృతంలో ఏమీ లేనందున, ఈమెయొక్క విలక్షణ నామం అయిన శ్రీశబ్దానికి **"శ్రీయతే ఇతి శ్రీః"** (అందఱిచేత ఆశ్రయింపబడుతున్నది -కనుక "శ్రీః" అని అనబడుతున్నది) అనే కర్మణివ్యుత్పత్తిలో" వీరిచేత మాత్రమే ఆశ్రయింపబడుతున్నది" అనే అర్థసంకోచం ఏమీ లేనందున, తత్త్వత్రయాలకు ఈశ్వరి అనే అర్థం గ్రాహ్యం. **శ్రీ వాసుదేవమహిషీ పుంప్రధానేశ్వరేశ్వరీ** (శ్రీ వాసుదేవుని మహిషి, చిదచిదీశ్వరులనే తత్త్వత్రయానికి ఈశ్వరి) అని కదా లక్ష్మీసహస్రనామ ప్రారంభంలో చెప్పబడింది. "ఆత్మేశ్వరమ్" (తైత్తి.నారా. 11) (తనకు తానే ఈశ్వరుడు) అని, **"నాదనై ఇఞాలమ్ విళుఙ్గుమ్ అనాదనై"** అందఱికీ అనాథుని, భూమిని మింగే, తనకు ఇంకొక నాథుడు ఎవరు లేని వానిని) (తిరువిరుత్తమ్-69) అని, **"ఈశతే దేవ ఏకః"** (శ్వేతా-6-10) (ప్రకృతి పురుషులను ఒకే దేవుడు నియమిస్తున్నాడు) అని, **"ఏకః శాస్తా"** (భార-అశ్వ-26-1) (ఈశ్వరుడొక్కడే) అని చెప్పబడే సర్వేశ్వరునకు ఈ లక్ష్మీదేవి ఈశ్వరి అంటే ఏ విధంగా పొసగుతుంది? అని అంటే, **"నిన్ అన్బిన్ వళినిన్రు శిలైపిడిత్తు ఎమ్బిరాన్ ఏక"** (భట్టనాథసూక్తం-3-10-7) (నీ ప్రేమపథంలో నిలచి, మాయామృగాన్ని పట్టుకోవడం కోసం వింటిని గ్రహించి స్వామి వెళ్ళగా) అని పెరియాళ్వార్లు,

**స్రష్టి శ్రీర్దిశతాదశేషజగతాం సర్గోపసర్గస్థితీః**
**స్వర్గం దుర్గతి మాపవర్గికపదం సర్వం చ కుర్వన్ హరిః।**
**యస్యా వీక్ష్య ముఖం తదింగితపరాధీనో విధత్తేऽఖిలం**
**క్రీడేయం ఖలు నాన్యథాऽస్య రసదా స్యాదైకరస్యాత్తయా॥**

(అన్ని లోకాలను సృష్టించి, రక్షించి, లయం చేయడం, స్వర్గ-నరక-మోక్షాలను అనుగ్రహించడం, చేసేటపుడు భగవానుడు ఎవరి ముఖాన్ని వీక్షిస్తూ, దాని ఇంగితాలకు వశుడై, అన్ని కార్యాలను చేస్తున్నాడో, ఆ లక్ష్మీదేవి నాకు మంగళాన్ని ప్రసాదించాలి.

భగవానుడు ఆమెతో ఒకే అభిప్రాయాన్ని కల్గినవాడు కనుక ఆమె ఇంగితాలకు పరాధీనుడుగా కార్యాలను చేయకపోయినట్లయితే, ఆ కార్యాలు ఆనందరసాన్ని కల్గించవు) అని శ్రీస్తవంలో కూరేశులు, **"యద్భ్రూభంగాః ప్రమాణం స్థిరచరరచనాతారతమ్యే మురారేః"** (మురారియొక్క స్థావరజంగమాల సృష్టిలోని హెచ్చుతగ్గులలో ఎవరి కనుబొమల కదలికలు ప్రమాణమో" (శ్రీగుణరత్నకోశం-4) అని, **"నమః శ్రీరంగనాయక్యై యద్భ్రూవిభ్రమ భేదతః, ఈశేశితవ్య వైషమ్యనిమ్నోన్నతమిదం జగత్"** (ఎవరి కనుబొమల కదలికలలోని తారతమ్యాలవల్ల ఈ లోకం పాలించేవాడు-పాలింపబడేవాడు అనే తేడాలతో హెచ్చుతగ్గులను కల్గినదై ఉన్నదో, ఆ శ్రీరంగనాయకికి నమస్కారం) (శ్రీరంగరాజ స్తవం-1-7) అని పరాశరభట్టరు, **"జగన్నాథోఽపి నారాయణః ధన్యం మన్యత ఈక్షణాత్తవ యతస్స్వాత్మానమాత్మేశ్వరః"** (శ్రీస్తవం-6) (తనకు తానే ప్రభువు, లోకానికి అంతటికీ పతి అయిన నారాయణుడు సైతం నీ కటాక్షాలచేత తనను భాగ్యశాలిగా తలుస్తున్నాడు) అని కూరేశులు చెప్పే రీతిలో అతడు పరమప్రణయి కనుక ఈమె భ్రూభంగాలకు పరతంత్రుడై కదా ఉంటాడు. ఈ విధంగా ప్రేమపరతంత్రుడై ఉండడంచేత అతనికికూడా లక్ష్మీదేవి ఈశ్వరి అని అనడంలో అడ్డులేదు. ఈ విధంగా ఈమె సర్వేశ్వరునకు కూడా ఈశ్వరి అయితే, ఈమె కదా పరబ్రహ్మ అని చెప్పబడాలి? అనే సందేహం కలుగవచ్చు. కాని, లక్ష్మీదేవి పరబ్రహ్మ కాబోదు. **"స్వతః శ్రీః త్వం విష్ణోః త్వమసి"** (శ్రీగుణరత్నకోశం-31) (శ్రీదేవి అయిన నీవు సహజంగా విష్ణువునకు సొత్తువై ఉన్నావు) అని అన్నట్లు ఈమె సహజంగానే అతనికి దాసభూతురాలు కనుక, అతడే ఈమెకు సహజంగానే ఈశ్వరుడు. అతడు పరమప్రణయి కనుక భక్తపరతంత్రుడు అయినట్లే, ప్రేమ కారణంగా ఈమెకు పరవశుడై ఉంటాడు. ఈమె అతనిని నియమించేదై ఉంటుంది. ఇందువల్ల వీరికి ఉండే సహజమైన శేష-శేషి భావానికి భంగం ఏమాత్రం లేదు. అతడు ఈమెకు ఈశ్వరుడు కావడం స్వాభావికం, ఈమె అతనికి ఈశ్వరి కావడం ప్రేమోపాధికం. అందువల్ల ఈమెకు పరబ్రహ్మత్వం అనే దోషం ఏమీ రాదు.

ఈ సందర్భంలో గోమఠరంగనాథ విరచితం అయిన శ్రీసూక్తభాష్యం కొన్ని లిఖిత ప్రతులలోని తొమ్మిదవ మంత్రం క్రింద పదిహేడు పత్రాలను కల కొంత అధిక భాగం కన్పిస్తున్నది. నిశితంగా విచారించినపుడు ఈ భాగం ప్రక్షిప్తమనే విషయం తెలుస్తుంది. మద్రాస్ గవర్నమెంటు తాళపత్ర లిఖిత గ్రంథాలయంలో గల గోమఠరంగనాథ భాష్య ప్రతులలో ఈ భాగం కొంచెంకూడా లేనందున ఇది తరువాతి కాలంలో చేర్చబడినదే అన్నది సుస్పష్టం. ఈ భాగం ప్రక్షిప్తమేనని అనడానికి ఇంకొక ముఖ్యమైన హేతువు కూడా ఉన్నది. ఈ గోమఠరంగనాథభాష్యంలో, లక్ష్మీతంత్రంలో లక్ష్మీదేవి తానే నిర్వహించే నామ నిర్వచనాలు ఏమీ చూపబడలేదు. పలు విషయాలలో లక్ష్మీదేవి నిర్వహించడానికి పూర్తిగా మార్చే అర్థం చెప్పబడింది. దానిని పూర్వం పలుసందర్భాలలో ప్రస్తావించడం



జరిగింది. ఇకపై ప్రస్తావింపబడనున్నది కూడా. దీనినిబట్టి ఈ భాష్యాన్ని వ్రాసిన వారు లక్ష్మీతంత్రాన్ని సేవించినవారే కారు-అని స్పష్టంగా గ్రహించవచ్చు. అందువల్ల, పూర్వం తెల్పిన ప్రక్షిప్తపంక్తులలో లక్ష్మీతంత్రంలో పలు అధ్యాయాలనుండి పలు ప్రమాణాలు ఉదహరింపబడ్డాయి. ఇది ఒక్కటే ఈ భాగం ప్రక్షిప్తం అనే విషయాన్ని ఋజువు చేయడానికి చాలు. అంతేగాక, ఈ పంక్తులలో శ్రీ వేదాంత దేశికాది పూర్వాచార్యులు అందఱు లక్ష్మీ విషయంగా గ్రహించిన ప్రమాణాలు అన్నీ ఖండింపబడ్డాయి. దివ్యసూరులచేత, పూర్వాచార్యులచేత ఏకకంఠంగా అంగీకరింపబడ్డ లక్ష్మీస్వాభావికశేషత్వం ఇందులో తిరస్కరింపబడింది. వేదాంతదేశికులు చతుఃశ్లోకి రెండవశ్లోక భాష్యంలో-**"కిం చ యథా ముక్తస్య భగవతా పరమసామ్యే శ్రుతిస్మృత్యాది సిద్ధేఽపి జగద్వ్యాపారవర్జమితి లక్షణభూతై రాకారై ర్వైషమ్యం స్థాప్యతే, తథా ఇహాపి భవతి"** (ముక్తాత్మకు పరమపురుషునితో పరమసామ్యం **"పరమం సామ్యముపైతి"** ఇత్యాది శ్రుతులలో, **"మమ సాధర్మ్యమాగతాః"** (భ.గీత. 12-2) మొదలైన స్మృతులలో సిద్ధిస్తున్నా, **"జగద్వ్యాపారవర్జమ్"** (బ్రహ్మసూత్రం) అనే పరబ్రహ్మలక్షణం అయిన జగత్కారణత్వం మొదలైన ఆకారాలచేత వ్యావర్తింప బడుతున్నట్లే, ప్రకృతంలోకూడా లక్ష్మీదేవికి చెప్పబడ్డ సామ్యం జగత్కారణత్వాదులు లేనిదిగానే అవుతున్నది) అని అంటూ చాలా సుస్పష్టంగా పరబ్రహ్మ లక్షణం అయిన జగత్కారణత్వం మొదలైనవి లక్ష్మికి లేవు అని చెప్పబడగా, ఈ ప్రక్షిప్తభాగంలో లక్ష్మికూడా భగవానునివలెనే జగత్కారణభూతగా, పరబ్రహ్మగా ఉంటుంది అని వాదింపబడింది. శ్రీదేశికుల అభిప్రాయానికి విరుద్ధంగా ఉండే పంక్తులు ఇంకా చాలా ఈ భాగంలో ఉన్నాయి-అన్నది ప్రామాణికులచేత కాదనడానికి వీలులేని విషయం. అందువల్ల ఈ కారణాలనుబట్టి అన్నిటిని గమనించినపుడు ఈ పంక్తులు పక్షపాతాన్నికల వారెవరో ప్రక్షిప్తం చేసి ఉంటారని విజ్ఞులు అంగీకరించవలసి ఉన్నది.

ఈ కారణాలవల్ల, పూర్వం చూపబడ్డ ఇంకా పలు హేతువులవల్ల ఈ గోమఠ రంగనాథభాష్యాన్ని "నంజీయర్" (వేదాంతి) అనే ఆచార్యులచేగాని, నారాయణ మునుల చేతగాని రచింపబడినది కాదు అనే విషయం స్పష్టంగా వ్యక్తమవుతున్నది. లక్ష్మీతంత్ర వచనాల తాత్పర్యాన్ని గ్రహించలేని ఈ భాష్యకర్త పూర్వాచార్యులలో ఒకరు కానేకారు-అన్నది నిస్సందేహం. ఈ ప్రక్షిప్తభాగంలో చెప్పబడ్డ-లక్ష్మీదేవికూడా పరబ్రహ్మభూతయే అనే అంశాన్ని బలపరుస్తూ ప్రస్తావించబడిన కొన్ని యుక్తులు సంగ్రహంగా తిరస్కరింపబడు తున్నవి-అని అంటూ ద్రావిడ వివరణకర్త ఈ విధంగా అన్నారు.

**"సర్వభూతేశ్వరీ"** అని కాకుండా **"సర్వభూతానామీశ్వరీ"** అని ఉన్నందున లక్ష్మి భగవానునకు పత్నీత్వాకారంతో కాకుండా, సహజంగానే సర్వభూతేశ్వరిగా ఉన్నది అని సిద్ధిస్తున్నది-అన్నది ఒక వాదం. ఈ వాదానికి బదులు శ్రీదేశికుల గీతాభాష్య తాత్పర్యచంద్రికలోని ఈ క్రింది పంక్తులే ఇస్తున్నవి.

అన్నది స్పష్టం అని శ్రీమాన్ కృష్ణస్వామి అయ్యంగార్ వివరణం. ఈ విషయం ఇంతటితో విరమింపబడుతున్నది.

"ఈశ్వరీ" అనే నామంయొక్క అర్థం ఇక వివరింపబడుతున్నది.

**(ఈశ్వరీమ్)**–సర్వభూతాలకు స్వామిని–అని అర్థం. అతడు సర్వభూతాలకు స్వామి అయినట్లే, ఈమె కూడా స్వామిని అని భావం. **"తిరుమాలే నానుమ్ ఉనక్కు ప్పళవడియేన్"** (లక్ష్మీనాథా! నేను నీకు అనాదిగా దాసుడను) (భట్టనాథసూక్తం), **"ఉలకాణ్డతిరుమాల్"** (భట్టనాథసూక్తం 4–9–1) (లోకాలను పాలించే శ్రియఃపతి) అని కదా భట్టనాథులసూక్తి.

**(ఈశ్వరీమ్)**–ఈశ్వరునితో కూడి ఉండి వరాలను ప్రసాదిస్తుంది–అని భావం. అతడు ఫలప్రదుడైనపుడు తన పారతంత్ర్యస్వరూపానికి తగినట్లు పురుషకారకృత్యం చేసే సహధర్మచారిణి–అని భావం.

**(ఈశ్వరీమ్)**–**"ఈశ్–ఐశ్వర్యే"** అని ధాతువు కనుక "అన్ని సంపదలను అనుగ్రహించేది" అని, **"వృతు–వర్తనే"** అని ధాతువు కనుక **"ఎల్లప్పుడు ఉండేది"** అని, **"రిజ్–క్షయే"** అని ధాతువు కనుక "పాపాలను నశింపజేసేది" అని భావం.

**భూతానామీశ్వరా చాస్మి ప్రియేణేశేన సర్వదా।**
**వరదా భువనేశానా వనితా చ సదాఖిలైః॥**
**వృద్ధిదా వర్ధమానా చ క్షపణీ చ సదాంహసామ్।**
**ఈశ్వరీత్యేవ మే నామ తేన వేదేన రూపితమ్॥**
**షడక్షరో హ్యయం మంత్రః సర్వైశ్వర్యసమృద్ధిదః॥**

(1) భూతాలకు ఈశ్వరినై ఉన్నాను, 2) ఈశ్వరునితో కలసి ఎల్లప్పుడూ వరాలను ఇస్తున్నాను, 3) లోకానికి ఈశానగాను, అందరిచే వసింపబడేదాననుగాను ఉన్నాను 4) ఐశ్వర్యవృద్ధిని ఇస్తాను, ఎల్లప్పుడు ఉంటాను, పాపాలను నశింపజేస్తాను. ఈ కారణాలచేత "ఈశ్వరీ" అనే నామం వేదం చేత నాకు ఇవ్వబడింది. **"ఓమ్ ఈశ్వర్యై నమః"** అనే ఆఱు అక్షరాలనుకల ఈ మంత్రం అన్ని సంపదల సమృద్ధిని ఇస్తుంది) అని ఈ నాల్గు అర్థాలు, మంత్రమహిమ లక్ష్మీచేతనే చెప్పబడింది.

**(శ్రియమ్)**–శ్రీదేవిని అని భావం. ఈ నామంయొక్క అర్థాలు ముందే వివరింపబడ్డాయి.

**(తామ్)**–పూర్వం చెప్పబడ్డ మహిమలను కల్గినదిగా ప్రసిద్ధి పొందిన నిన్ను

**(ఇహ)**–**"అభూతిమ్ అసమృద్ధిం చ సర్వాన్ నిర్ణుద"** (అన్ని విధాలైన దారిద్ర్యాలను నీవు నా ఇంటినుండి వెడలగొట్టాలి) అని ప్రార్థింపబడ్డ నీ అనుగ్రహంచేత పరిశుద్ధిని పొంది, నీవు వసింపదగినదిగా ఉండే ఈ నా నివాసంలోకి,

**(ఉపహ్వయే)**–నిత్యవాసం చేయాలి–అని ఆహ్వానిస్తున్నాను.



కలవారెవ్వరూ అంగీకరించలేని విషయం. **"న తత్ సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే"** (శ్వేతా–6) (ఆ పరమపురుషునితో సమానులుకాని, మించిన వారుకాని లేరు) అని పరమపురుషుని గూర్చి చెప్పినట్లు. **"న కిర్నిన్ద్ర త్వదుత్తరో న జ్యాయో అస్తి వృత్రహన్"** (ఋక్–అష్ట–3) (వృత్రాసురుని సంహరించిన ఇంద్రా! నీ కంటే ఉన్నతమైనది ఏదీ లేదు. గొప్పవాడు లేడు) అని ఇంద్రునికూడా చెప్పినందువల్ల ఇద్దఱూ సమానులే అనే మాటకూ, దీనికీ తేడా లేదు. అక్కడ ఇంద్రుడు పరమాత్మ కాడనే విషయం మిగిలిన పలు వాక్యాలనుండి సిద్ధిస్తున్నది కనుక ఇద్దఱినీ సమానులుగా గ్రహించడానికి వీలుకాదు–అని అంటే, ఇక్కడ కూడా **"శ్రీరుపబృంహణం తస్మిన్ బ్రహ్మా ఆస్తే"** (కౌషీతకి–1–50,51) (లక్ష్మీదేవి కాలి దిండుగా ఉన్నది. ఆ శయ్యపై పరబ్రహ్మ వేంచేసి ఉన్నాడు) అని, **"అస్యేశానా జగతో విష్ణుపత్నీ"** (విష్ణువుకు పత్నిగా ఉన్నందున లోకానికి అంతటికీ ఈశ్వరియై ఉన్నది) అని, **"హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ"** (శ్రీదేవి భూదేవులు నీకు పత్నులు) అని వేదాలు పల్కుతున్నందున, **"శాన్దణిమెన్ ములైమలరాళ్ తరణిమజ్గై తామిరువర్ అడివరుడుమ్ తన్మైయానై"** (కలివైరిసూరి సూక్తం–2–10–2) (చందనం అలంకరించుకొన్న మృదువైన స్తనాలనుకల లక్ష్మీదేవి, భూదేవి ఇద్దరు పాదసంవాహనం చేసే సన్నివేశంలో ఉన్నవానిని) అని, **"శెజ్గమలత్తిరుమకళుమ్ పువియుమ్ శెమ్బొన్ తిరువడియినిణై వరుడ మునివరేత్త"** (కలివైరి సూరిసూక్తం–7–8–1) (ఎఱ్ఱని తామరపూవులో ఉండే లక్ష్మీదేవి, భూదేవి, బంగారంవలె ఆశపడతగిన అందమైన శ్రీపాదద్వయిని సంవాహనం చేయగా, మునివరులు కీర్తించగా) అని, **"వడివిణై యిల్లా మలర్మవళ్ మత్తై నిలమకళ్ పిడిక్కుమ్ మెల్లడియై"** (రూపంలో సాటిలేని లక్ష్మీదేవి, ఇంకా భూదేవి సంవాహనం చేసే మృదుపాదాలకు) (శఠకోపసహస్రం –9–2–10) అని, **"నిన్ ఈరడి ఒన్ఱియ మనత్తాల్ ఒరుమదిముకత్తు మజ్గైయర్ ఇరువరుమ్ మలరన అజ్కైయిల్ ముప్పొళుదుమ్ వరుడ అఱితుయిల్ అమర్న్దనై"** (నీ ఉభయపాదాలను నిండు భక్తితో విలక్షణమైన, చంద్రునివంటి ముఖాన్నికల శ్రీదేవి, భూదేవి ఇద్దరూ పూవువలె సుకుమారం అయిన తమ అందమైన హస్తాలతో ముప్పొద్దుల సంవాహనం చేయగా ఆనందంగా యోగనిద్రలో వేంచేసి ఉన్నావు) అని కలివైరిసూరి, **"అల్లిమలర్ మజ్గైనాదన్"** (తామరపూవులో ఉండే లక్ష్మికి ప్రభువు) (కులశేఖరసూక్తం–2–10) అని, **"పూమకళ్నాయకన్"** (పూవులో ఉండే లక్ష్మికి నాయకుడు) (కలివైరిసూరిసూక్తం–3–3–2) అని, **"తిరువుక్కుమ్ తిరువాకియ శెల్వా"** (లక్ష్మికి కూడా లక్ష్మి అయిన సంప్రదూపా!) (కలివైరిసూరిసూక్తం–7–7–1), **"మలర్మజ్గైనాదర్"** (పూవులో ఉండే లక్ష్మికి నాథుడు) (కలివైరిసూరిసూక్తం–11–4–6) అని దివ్యసూరులు లక్ష్మీదేవి సహజంగానే భగవానునకు శేషభూతురాలు అని, అతడు ఆమెకు స్వామి అని ఉద్ఘోషించడంచేత, లక్ష్మీ(సీతా)దేవి **"తత్తస్య సదృశం భవేత్"** (రామా.సుందర.39–30) (నన్ను కాపాడడం శ్రీరామునకే తగినది) అని తన శేషత్వాన్ని వ్యక్తంచేసినందున, **"మచ్ఛేషభూతా"** అని భగవానుడు

లక్ష్మి తనకు శేషభూతురాలే అని పాంచరాత్రశాస్త్రంలో తెలుపబడినందున, **“స్వతః శ్రీః త్వం విష్ణోః స్వమసి”** (శ్రీగుణరత్నకోశం-3) (శ్రీదేవీ! నీవు సహజంగానే భగవానునకు శేషభూతురాలై ఉన్నావు) అని సర్వజ్ఞసార్వభౌములైన పరాశరభట్టర్ ఏ కొంచెం సందేహానికైనా తావులేని రీతిలో లక్ష్మీదేవి శేషత్వం స్వాభావికమైనదని ఘోషించినందున, శ్రీవేదాంతదేశికులు కూడా, **“ఈశ్వరవ్యతిరిక్త-అశేషగోచరస్యాపి తదైశ్వర్యస్య ఈశ్వరాభిమతత్వాన్నద్వైరాజ్యాది దోషః, “అస్యేశానా జగతో విష్ణుపత్నీ” ఇతి విష్ణుపత్నీత్వవేషేణ హి సర్వస్య జగతః ఇయ మీష్టే”** (ఈశ్వరుడు తప్ప మిగిలినవారంతా విషయంగా కల ఈమె ఈశ్వరత్వం సర్వేశ్వరునకు అభిమతమే కాబట్టి ఇద్దఱు ఈశ్వరులుగా ఉండడం”-మొదలైన దోషాలు ప్రసక్తం కావు). విష్ణుపత్ని కనుక లోకానికి ఈశ్వరి అవుతున్నది” అని విష్ణుపత్నిగా ఉన్నందున కదా ఈమె అన్ని లోకాలను నియమిస్తున్నది) అని తాత్పర్యచంద్రికలో ఈమె ఈశ్వరత్వం అతని ఇచ్ఛాయత్తమని, అందువల్లనే ఇద్దఱు ఈశ్వరులు లేరని, విష్ణుపత్ని అయినందువల్లనే ఈమె ఈశ్వరి అవుతున్నది అని కరబదరికా న్యాయంగా సుస్పష్టంగా తెలుపబడినందున, **“ఈశతే దేవ ఏకః”** (శ్వేత-1-10) (ఒక దేవుడే ప్రకృతి పురుషులను నియమిస్తున్నాడు), **“ఏకో హ వై నారాయణ ఆసీత్”** (మహోపనిషత్ 4-1) (నారాయణుడొక్కడే ఆదికారణమై ఉన్నాడు) అని, **“న తత్ సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే”** (శ్వేత) (అతనితో సమానుడు, అతనికంటె అధికుడూ ఎవరూ కానరావడం లేదు) అని, **“న తస్యేశే కశ్చన”** (తైత్తి.నారా) (అతనిని నియమించే వారెవ్వరూ లేరు) అని, **“తమీశ్వరాణాం పరమం మహేశ్వరమ్”** (శ్వేత) (ఈశ్వరులందఱిలో గొప్ప ఈశ్వరుడై ఉండే అతనిని) అని, **“పతిం విశ్వస్యాత్మేశ్వరమ్”** (తైత్తి. నారా. 11) (లోకానికి అంతటికీ పతిగా, తనకు తానే ఈశ్వరుడుగా ఉన్నవానిని) అని, **“ఏకస్స్వతంత్రో జగతో బభూవ”** (లోకానికి అంతటికీ ఒకే స్వతంత్రస్వామిగా నారాయణుడు వెలుగుతున్నాడు) అని, **“ఏకః శాస్తా న ద్వితీయోఽస్తి శాస్తా”** (భార.ఆశ్వ. 27-1) (నారాయణుడు ఒక్కడే ఈశ్వరుడు. వేఱొక ఈశ్వరుడు లేడు) అని, **“న త్వత్సమోఽస్తి అభ్యధికః కుతోఽన్యః”** (గీత) (నీతో సమానులు లేరు, ఇక మించిన వారెవరు?) అని, **“నాస్తి నారాయణసమో న భూతో న భవిష్యతి”** (నారాయణునితో సాటివచ్చేవాడు మూడు కాలాలలోను లేడు) అని శ్రుతి-స్మృతులు ముక్తకంఠంగా సర్వేశ్వరుడు ఒక్కడే అని ఉద్ఘోషించడంవల్ల, లక్ష్మీదేవి భగవానునివలె నిరతిశయ బృహత్వబృంహణత్వాలనే సర్వైశ్వర్యాన్ని కల్గినది కాదు-అని. జ్ఞానులకు సులభంగా స్ఫురిస్తుంది. **“యువాం దైవతం దంపతీ నః”** (మీరిద్దరు మాకు దైవం) అనే దేశికసూక్తి లక్ష్మికి శేషిత్వం లేదు, భగవదిచ్ఛాయత్తం అయిన ఏకోన ఈశ్వరత్వం కూడా లేదు-అనే వారిని ఉద్దేశించి చెప్పబడినది కనుక ఆ సూక్తితో కూడా విరోధం ఏమీ లేదు. లక్ష్మికి భగవదిచ్ఛాయత్తం అయినది, తత్పత్నీత్వ ప్రయుక్తమైనది అయిన ఈశ్వరత్వం ఉన్నది అని అనడంలో వైదికులెవ్వరికినీ భిన్నాభిప్రాయం లేదు. తాత్పర్యచంద్రికలో ఆ



అర్థాన్ని స్ఫుటంగా తెలిపినపుడు శ్రీస్తుతి శ్లోకానికి వేఱే రీతిలో ఏవిధంగా అర్థాన్ని గ్రహించడానికి సాధ్యం? **“ఉభయాధిష్ఠానం చ ఏకం శేషిత్వమ్”** అని అన్నట్లు ఇద్దరిలో ఉండే ఈశ్వరత్వం ఒకటే కనుక ఈశ్వరద్విత్వం లేదు-అని అనడం కూడా హాస్యాస్పదం. ఒకే శేషిత్వం ఇద్దఱిని ఆశ్రయంగా కల్గినది అని అనడంలో ఏ దోషం లేదు. శేషిత్వం అంటే-కైంకర్య ప్రతిసంబంధిగా ఉండే స్థితి. భగవానునకు చేసే కైంకర్యం లక్ష్మికి ముఖోల్లాసకరం కనుక, లక్ష్మికి చేసే కైంకర్యం భగవానుని మనస్సును సంతోషింపచేస్తుంది కనుక, కైంకర్యప్రతిసంబంధిత్వం అనే శేషిత్వం ఒక్కటై, ఇద్దరివద్ద ఉన్నది-అని అనవచ్చు. ఒకే ఈశ్వరత్వం ఇద్దఱివద్ద ఉన్నది అని చెప్పడానికి ఉపపత్తి ఏదీ లేదు. బాధకం అయితే చాలా ఉన్నది. ఆ విధంగా చెప్పాలని ప్రారంభిస్తే, ఒకే ఈశ్వరత్వం బ్రహ్మవిష్ణురుద్రాదులవద్ద ఉన్నది అని చెప్పే పక్షాలు ప్రామాణికాలై, **“ఆత్మైక్యం దేవతైక్యం త్రికసమధిగతా తుల్యతైక్యం త్రయాణామన్యత్రైశ్వర్యమ్”** (ఆత్మలన్నీ ఒక్కటే అని అనడం, దేవతలందరూ ఒక్కటే అని అనడం, ముమ్మూర్తులు సమానులని, ఒక్కరే అని అనడం, ఆ ముగ్గురికంటే వేఱయినవాడే ఈశ్వరుడు అని అనడం) అని అంటూ రహస్యత్రయసారంలో దేశికులచేత నిరసింపబడ్డ పక్షాలను అంగీకరించవలసివస్తుంది. తాత్పర్యచంద్రికలో దేశికులుకూడా లక్ష్మియొక్క ఈశ్వరత్వం భగవదభిమతం కనుక ఈశ్వరద్విత్వం లేదు అని అంటూ పరిహారం పలికారే తప్ప, ఇద్దరిదగ్గర ఉండే ఈశ్వరత్వం ఒక్కటే అని పల్కి పరిహరించలేదు. అందువల్ల **“ఈశ్వరీం సర్వభూతానామ్”** అనే ఈ తిరునామంచేత లక్ష్మికి పరబ్రహ్మత్వం అనే దోషం రాదు-అని స్థిరీకరింపబడింది.

**“సర్వభూతానామీశ్వరీ”** అని స్తుతింపబడే లక్ష్మిని ఈశ్వరకోటిలోనికి చేర్చగలమే తప్ప, జీవకోటిలోనికి చేర్చగలమా? అనే వాదం తలఎత్తే అవకాశం ఉన్నది. ఉభయవిభూతి శేషిత్వం, విభుత్వం-మొదలైన గొప్పతనాలు ఈ లక్ష్మికి ఉన్నందున ఈ లక్ష్మి ఈశ్వరకోటికి చేరినదే-అని కొందఱు ఆచార్యులు అభిప్రాయపడుతున్నారు. పత్నీత్వప్రయుక్తం అయిన ఈశ్వరత్వం ఉన్నా, శేషత్వమే ఈమెకు సహజం అయిన ఆకారం కనుక **“శేషత్వే సతి చేతనత్వమ్”** ఇత్యాది జీవలక్షణాలు ఈమెకు కూడా పొసగుతాయి కనుక, **“తత్తస్య సదృశం భవేత్”** అని పలికే ఈమెకు జీవత్వమే అతిశయాన్ని కల్గించేది కనుక, ఈమెను జీవకోటిలోనికే చేర్చాలి-అని కొందరు అభిప్రాయపడుతున్నారు. ఈ రెండు తెగలకు చెందిన ఆచార్యులు లక్ష్మికి ఉండే ఏకోన ఈశ్వరత్వాన్ని (భగవానుడొక్కడు తప్ప మిగిలిన వారికి ఈశ్వరిగా ఉండే స్థితిని), భగవచ్ఛేషత్వాన్ని కాదనలేదు. ఈమె పరబ్రహ్మభూత అని చెప్పలేదు. ఆచార్యులకు తరువాత గల కొందరు మాత్రమే లక్ష్మి పరబ్రహ్మభూత అని, ఈమెకు స్వాభావికం అయిన శేషత్వం లేదని తోచినరీతిలో వాదించారు. గోమఠరంగనాథభాష్యంలో వాటిని చేర్చి, అది నంజీయర్ అనే ఆచార్యులు రచించినట్లుగా చెప్పారు. కాని పూర్వం వివరింపబడ్డ రీతిలో ఈ వాదాలు ఏవీ ప్రమాణసహాలు కావు

**(సత్యమ్)**-సత్తుగాను, త్యత్తుగాను ఉన్నది-అని భావం. అంటే-ఎల్లప్పుడు "ఉన్నది" అనే చెప్పబడేదై, వినాశంలేని జీవాత్మగాను, ఎల్లప్పుడు పరిణామాన్ని పొందేది కనుక "లేదు" అని వ్యవహరింపబడే అచేతనంగాను ఉన్నది-అని భావం. **"ఏకతత్త్వమివోదితా"** (ఒకేతత్త్వంవలె చెప్పబడేవారు భగవానుడు-లక్ష్మీదేవి) అని పలికే రీతిలో అతని సర్వాత్మభావాన్ని, అంతరంగయై, అతని అతిశయానికి మూలభూతురాలై ఉన్నది అయిన ఈమెలో ఆరోపింపబడింది. **"అహం సర్వమ్"** (విష్ణుపురా.) (అంతా నేనే) అని ప్రహ్లాదుడు, **"అహమేకః ప్రథమమాసం వర్తామి భవిష్యామి చ"** (అథర్వశిరస్సు) (నేను ఒక్కడనే ప్రారంభంలో ఉన్నాను, ఉంటున్నాను, ఉండబోతాను) అని శివుడు, **"అహం మనురభవం సూర్యశ్చ"** (బృహదారణ్య-3-4-10) (నేనే మనువు, సూర్యుణ్ణి) అని వామదేవమహర్షి, **"కడల్ ఞాలమావేనుమ్ యానే యెన్నుమ్"** (శఠకోపసహస్రం-5-6-1) (సముద్ర పరివేష్ఠితం అయిన భూమికి అంతర్యామి అయినవాడను నేనే) అని శఠకోపమహర్షి పలికినపుడు, క్షణమైనా విశ్లేషించకుండా ఉండే నిత్యానపాయినియై, అతని అతిశయానికి చిహ్నమై, అతనికి స్వరూపనిరూపకయై ఉండే ఈమె అన్నీ-అని అనడంలో ఏ కొఱతాలేదు కదా! **"సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ"** (తైత్తి.ఆనంద-1) అని, **"సచ్చ త్యచ్చాభవత్"** (తైత్తి.ఆనంద. 6-5) (చేతనాచేతనాలుగా పరమాత్మ అయ్యాడు) అని అతడే కదా చెప్పబడుతున్నాడు. ఈ విధంగా సర్వాత్మభూతులుగా వీరిద్దరిని గ్రహిస్తే ఈశ్వరద్విత్వం మొదలైన పలుదోషాలు కూడా సంక్రమిస్తాయికదా! అందువల్ల ఆ విధంగానే అర్థాన్ని గ్రహించాలి. భగవానుడు సర్వాత్మకుడైనపుడు లక్ష్మికూడా అతనిలో విశేషణతయా భాసిస్తుంది అనే అర్థాన్ని -**"వానాకిత్తీయాయ్ మతికడలాయ్ మారుతమాయ్ తేనాకిప్పాలామ్ తిరుమాలే"** (ఆకాశస్వరూపుడై, అగ్నిస్వరూపుడై, సముద్రరూపుడై, వాయురూపుడై, తేనెవలె పాలువలె భోగ్యభూతుడై ఉండే (శ్రియఃపతి) (సరోయోగిసూక్తం-92) అని, **"తిరువాళ్ మార్బన్తన్నై త్తిశైమణ్ణీర్ ఎరిముదలా ఉరువాయ్ నిన్దవనై ఒలిశేరుమ్ మారుతత్తై అరువాయ్ నిన్దవనై"** (కలివైరిసూరిసూక్తం-7-6-7) (లక్ష్మినిత్యవాసం చేసే వక్షఃస్థలాన్ని కలవానిని, దిక్కులు, మన్ను, నీరు, అగ్ని మొదలైన పంచభూతాల స్వరూపుడై ఉన్నవానిని, శబ్దాన్ని గుణంగాకల వాయువునకు నిర్వాహకుడై, రూపరహితుడై ఉన్నవానిని) అని దివ్యసూరులు తెలిపారు. ఈ అరుదైన అర్థాన్ని, ఈ మంత్ర వైభవాన్ని-

**"సచ్చ త్యచ్చ జగత్ ద్వేధా యత్ ప్రమాణేన దృశ్యతే। 50-168**
**తత్ సర్వమహమస్మీతి సత్యం మామ్ ఋషయోఽబ్రువన్।**
**షడక్షరో హ్యయం మంత్రః సర్వసత్యఫలప్రదః॥**

(ఏనాడు నశించనిది కనుక 'సత్' అనబడే జీవతత్త్వం, ఎల్లప్పుడు పరిణామాన్ని పొందుతున్నందున "త్యత్" అనబడే అచిత్తత్త్వం-అని లోకం రెండు విధాలుగా ఉన్నది. నేను ఈ సత్, త్యత్ తత్త్వాలై ఉన్నాను కనుక నన్ను ఋషులు "సత్యమ్" అని



| | |
|---|---|
| **10.** | **మనసః కామమాకూతిం వాచః సత్యమశీమహి।** |
| | **పశూనాం రూపమన్నస్య మయి శ్రీః శ్రయతాం యశః॥ 10** |

**ప్రతిపదార్థము :** మనసః కామమ్=మనస్సుచే కోరదగినది, వాచః ఆకూతిమ్=శబ్దాలకు అర్థమై ఉన్నది, సత్యమ్=చిదచిత్తుల సమస్తమై ఉన్నది అయిన లక్ష్మిని, అశీమహి= పొందగలము, పశూనాం రూపమ్=జీవుల జ్ఞానస్వరూపంగా ఉన్నది, అన్నస్య యశః =భోగ్యవస్తువుల యశస్సుగా ఉన్నది అయిన, శ్రీః=శ్రీదేవి, మయి=నా వద్ద, శ్రయతామ్=ఆశ్రయించాలి(చేరాలి).

**భావము :** శ్రీదేవి నా ఇంటిలో నిత్యవాసం చేయాలి-అని గత మంత్రంలో వేదపురుషుడు ప్రార్థించాడు. ఈ మంత్రంలో నా దగ్గర నిత్యవాసం చేయాలి-అని ప్రార్థిస్తున్నాడు.

**(మనసః కామమ్)**-వారివారి మనస్సులతో ఆశించే ఆయా ఫలాలై ఉండేది-అని భావం. ఈ లోకంలో ఉండే ఆనందాలు, స్వర్గం మొదలైన పారలౌకిక సుఖాలు, వీటి అన్నిటినీ మించిన మహానందం-అనే వీటిలో ఎవరు ఎవరు దేనిని ఆశిస్తారో వాటిని వారికి ఇస్తుంది-అని భావం. **"హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ"** (పురుషసూక్తం) అనే ఈమె కలయికలోనే కదా అన్ని ఇష్టాలను పొందడం. ఈమె పుండరీకాక్షునకు వల్లభ-అని కూడా భావం.

**శ్రేయో న హ్యరవిందలోచనమనఃకాంతాప్రసాదాదృతే।**
**సంసృత్యక్షరవైష్ణవాధ్వసు నృణాం సంభావ్యతే కర్హిచిత్ ॥**

(పుండరీకాక్షుని మనస్సుకు ఇష్టురాలైన లక్ష్మీదేవి కరుణలేకుండా ఐశ్వర్యకైవల్య భగవత్ప్రాప్తులలో శ్రేయస్సు జీవులకు లభించదు) అని ఈ రెండు అర్థాలు చతుఃశ్లోకిలో భగవద్యామునులు పలికారు.

**(మనసః కామమ్)**-భగవానుని మనస్సుచే అభిలషింపబడేది. అస్యా దేవ్యా మనస్తస్మిన్ తస్య చాస్యాం ప్రతిష్ఠితమ్ (రామా.సుందర) (ఈ లక్ష్మీదేవి మనస్సు శ్రీరాముని యందు, అతని మనస్సు ఈమెయందు స్థిరంగా ఉన్నవి) అని హనుమానుడన్నాడు కదా!

**(మనసః కామమ్)**-మనస్సుతో ఆశించదగిన విషయాలలో చాలా గొప్పది-అని కూడా భావం. ఈ అర్థగౌరవాన్ని భావించే కదా **"కామధుక్, కామయోనిః, కామవత్సా, కామవర్షిణీ, కామవిజృంభిణీ, కామసూః, కామరూపిణీ, కామినీ, కామేశ్వరీ, కామ్యా"** అని లక్ష్మీసహస్రనామంకూడా పలు నామాలను వర్ణించింది. **"శిత్తమ్ నన్గొరుఙ్గి త్తిరుమాల్ మేల్ శెన్దశిన్దై పెరువర్"** (త్రికరణాలు చక్కగా ఏకరూపంగా కలవారై శ్రియఃపతిపై లగ్నమైన మనస్సును పొందుతారు) (భట్టనాథసూక్తం-4-5-10) అని, **"శిన్దనైయై త్తిరుమాలై"** (మనోరథానికి విషయభూతుడైన (శ్రియఃపతి) (కలివైరిసూరిసూక్తం) (5-6-7) అని, **"శిన్దైతన్నుళ్ నీఙ్గాదిరున్ద తిరువే"** (మనస్సులో ఒక క్షణంకూడా విడిచిపోని లక్ష్మిని కలవాడా!) (కలివైరిసూరిసూక్తం-4-9-2) అని దివ్యసూరులు ఈ అర్థాన్ని అనుగ్రహించారు. లక్ష్మీదేవి

స్వయంగా

**భౌమాంతరిక్షదివ్యాఖ్యా యే చాప్యప్రాకృతాః పరే।**
**సదానందమయాస్త్వేతే సర్వే కామా మయి శ్రితాః॥**
**మనోరథానాం సర్వేషాం పరాహం విభ్రమస్థలీ।**
**విష్ణోశ్చ మనసః కామస్సాహం సర్వాతిశాయినీ॥ 50-163**
**మనసః కామ ఇత్యేవ తేన మాం తుష్టువుస్సురాః।**
**నవాక్షరో హ్యయం మంత్రః సర్వకామసమృద్ధిదః॥**

(చేతనులకు ఎల్లప్పుడూ ఆనందాన్ని కల్గించే ఈ లౌకికానందం, అంతరిక్ష లోకంలోని ఆనందం, స్వర్గానందం, పరమపదంలో అప్రాకృతం అయిన మోక్షానందం–మొదలైన అన్ని కామాలు నా వద్ద ఉన్నాయి. అన్ని మనోరథాలకు నేను గొప్ప క్రీడాస్థలంగా ఉన్నాను. చాలా గొప్పదాననైన నేను పరమపురుషుని మనస్సుచేత అభిలషింపబడుతున్నాను. అందువల్ల నన్ను దేవతలు **"మనసః కామమ్"** అని స్తుతిస్తున్నారు. తొమ్మిది అక్షరాలను కల్గిన **"ఓమ్ మనసః కామాయ నమః"** అనే ఈ మంత్రం అన్ని మనోరథాల అతిశయాన్ని కల్గిస్తుంది) అని ఈ అర్థాలను, మంత్రవైభవాన్ని తెలియజేసింది.

**(వాచః ఆకూతిమ్)**– లౌకికంగాను, వైదికంగాను ఉండే వాక్కుల, బాహ్యమతవాదుల వాక్కుల అర్థస్వరూపిణిగా ఉన్నది–అని భావం. సర్వశబ్దవాచ్య–అని తాత్పర్యం. అతడు సర్వశబ్దవాచ్యుడైనపుడు, అతనికి స్వరూపనిరూపకభూతగా ఉండే ఈమె సర్వశబ్దవాచ్యయే కదా! లౌకికవైదికశబ్దాలు ఒకవైపు ఉండనీ. బాహ్యమతస్థులు తమతమ దైవాలను ఉద్దేశించి పలికే శబ్దాలుకూడా ఈమెతో కలిసి ఉండే పరమాత్మనే కదా తెలుపుతున్నవి. "భగవానుడు నిర్దేశింపబడినచోట అంతా అతని స్వరూపనిరూపక అయిన లక్ష్మీదేవి కూడా చెప్పబడినట్లే అవుతున్నది" అని కదా భగవద్రామానుజులు పలికారు. ఇందువల్లనే కదా

**నుమ్మిన్ కవికొణ్డు నుమ్ నుమ్ ఇట్టాదెయ్వ మేత్తినాల్**
**శెమ్మిన్ శుదర్ ముడి ఎమ్ తిరుమాలుక్కు చ్చేరుమే॥** (శఠకోపసహస్రం–3–9–6)

(మీ కవితలతో మీకు మీకు ఇష్టమైన దైవాలను స్తుతిస్తే, అది ప్రకాశించే కిరీటాన్ని కల శ్రియఃపతికి అన్వయిస్తుంది) అని, **"నీరేఱు శెఞ్జడైనీలకణ్ణనుమ్ నాన్ ముకనుమ్ ముఱైయాల్ శీరేఱు వాశకమ్ శెయ్య నిన్ఱ తిరుమాల్"** (భస్మధారి, ఎఱ్ఱని జటలను ధరించినవాడైన నీలకంఠుడు, చతుర్ముఖుడు శేష–శేషిక్రమంలో గొప్ప గుణప్రకాశకాలైన వచనాలతో స్తుతించేటట్లున్న శ్రియఃపతి) (భట్టనాథసూక్తం–4–1–5) అని, ''శెయ్యవళుఱై తిరుమార్బన్ పన్నునాన్మఱైప్పల్ పొరుళాకియ పరన్'' (కలివైరిసూరిసూక్తం–3–1–2) (హిరణ్యవర్ణ నిత్యవాసం చేసే వక్షఃస్థలాన్ని కలవాడు, పరంపరగా అధ్యయనం చేయబడే నాల్గువేదాల పలువిధాల అర్థాలు తానే అయిన



పరమపురుషుడు) అని,

"పన్దార్ మెల్విరల్ నల్ వళైత్తోళి పావైపూమకళ్ తన్నొడు ముడనే వన్దాయ్ ఎన్ మనత్తే మన్నినిన్దాయ్! మాల్ వణ్ణామఱైపోలొళి వణ్ణా! శన్దోకా! పౌళియా! తైత్తిరీయా! శామవేదియనే! నెడుమాలే!" (క్రీడాసాధనం అయిన కందుకాన్ని పొందికగా కల్గిన మృదువైన చేతివేళ్ళను కల్గినది, అందమైన బొమ్మవంటిది అయిన లక్ష్మీదేవితో కూడి ఉండేవాడా! నా మనస్సులో స్థిరంగా వేంచేసి ఉన్నవాడా! నల్లని వర్ణాన్ని కలవాడా! మేఘంవలె చల్లని, అందమైన రూపాన్ని కలవాడా! ఛాందోగ్యోపనిషత్ ప్రతిపాద్యుడా! కౌషీతకీ బ్రాహ్మణంచేత తెలియబడేవాడా!, తైత్తిరీయోపనిషత్ ప్రతిపాద్యుడా! సామవేద ప్రతిపాద్యుడా! సర్వాధికా!) (కలివైరిసూరిసూక్తం–7–7–2) అని –ఈ రీతిలో పలు సందర్భాలలో దివ్యసూరులు ఈ అర్థాన్ని ఉపబృంహణం చేశారు. **"ఒణ్ తామరై యాళ్ కేళ్వన్ ఒరువనైయే నోక్కు ముణర్వు"** (అందమైన తామరపూవులో ఉండే లక్ష్మీదేవి వల్లభుని ఒక్కని మాత్రమే లక్ష్యంగా కల్గినది జ్ఞానం) (సరోయోగిసూక్తం–67) అని చెప్పబడ్డ రీతిలో జ్ఞానానికి విషయభూతుడు శ్రీమన్నారాయణుడే అయినపుడు, జ్ఞానానికి రూపాన్ని ఇచ్చే వాక్కుకు విషయం అతడే అనే విషయం కింపునర్న్యాయసిద్ధం కదా! **"ఆకూతిః"** అనే నామం శ్రీ సహస్రనామంలో కూడా ఉన్నది.

**లౌకిక్యోఽపృథ వైదిక్యస్తథా బాహ్యాగమోద్భవాః।**
**నిర్ఘోషా ఘోషవత్యశ్చ యా వాచః పరికీర్తితాః॥**
**మామభిప్రేత్య సర్వాసాం తాసాముచ్చారణక్రియా।**
**మామభిప్రయతే సర్వో జనస్సర్వాత్మనా స్థితామ్॥**
**తేన తేన ప్రకారేణ వాచాముచ్చారణక్రమే।**
**ఆకూతిర్వచసాం తేన వేదజ్ఞైరస్మి భావితా॥**
**అష్టాక్షరో హ్యయం మంత్రః సర్వశబ్దార్థసిద్ధిదః॥**

(లౌకికంగాను, వైదికంగాను, బాహ్యమతగ్రంథాలలోను ఉన్నవి, ఇంకా మిగిలినవి అయిన ఏ శబ్దాలు ఘోషలేనివి, ఘోషింపబడేవిగా ఉన్నాయో–అవి అన్నీ నన్ను ఉద్దేశించే ఉచ్చరింపబడుతున్నాయి. ఆయా అర్థాలను చెప్పేటపుడు జనులంతా సర్వార్థభూతగా ఉండే నన్నే చెబుతున్నారు. అందుచేత వేదవిదులచేత "వాక్కుల అర్థభూత" –**"వచసా మాకూతిః"** అని ధ్యానింపబడుతున్నాను. ఎనిమిది అక్షరాలనుకల **"ఓమ్ వాచః ఆకూత్యై నమః"** అనే ఈ మంత్రం అని శబ్దాల అర్థాలలో సిద్ధిని ఇస్తుంది) అని లక్ష్మీదేవి ఈ అర్థాలను, ఈ మంత్రవైభవాన్ని లక్ష్మీతంత్రంలో తెలియజేసింది.

ఈ విధంగా లక్ష్మీదేవి అన్ని శబ్దాలకు అర్థమై ఉండడంకూడా ఈమె సమస్తమై ఉండడంవల్లనే–అని తరువాతగల నామం తెలుపుతున్నది.

స్వీకరించాడు. అప్పటినుండి లక్ష్మి **"కర్దమీ"** అనే పేరును పొందింది) అని గోమఠరంగనాథ భాష్యంలో ఉట్టంకింపబడ్డ ప్రమాణానుసారం లక్ష్మీదేవి కర్దమప్రజాపతియొక్క స్వీకృతపుత్రి అని తెలుసున్నది.

**(మయి సంభవ కర్దమ)**–కర్దమప్రజాపతీ! అఖిలజగన్మాత అయిన లక్ష్మిని, ఆమె బిడ్డ అయిన నాదగ్గర సంభవించేటట్లు చేయాలి. నీకు పుత్రిక అయినట్లే నాకు కూడా ఆమె కుమార్తె అయేటట్లు చేయాలి–అని భావం. **"పితా పుత్రేణ పితృమాన్"** (సర్వలోకపిత అయినవాడు తన కుమారుని తండ్రిగా గ్రహించి పుడుతున్నాడు) అని అన్నట్లు

**(శ్రియం వాసయ మే కులే)**–పుత్రిక కాబట్టి నీకు నియామ్య అయిన శ్రీదేవిని కేవలం నా వరకే కాకుండా, నా కులంలోనివారు అందరివద్ద నివసించేటట్లు చేయాలి. ఎటువంటి లక్ష్మీదేవిని? అని అంటే,

**(మాతరమ్)**–అఖిలజగన్మాతను. చేతనులకు తల్లివలె ప్రియాన్ని, హితాన్ని చేసేది. **"సర్వేషామేవ లోకానాం పితా మాతా చ మాధవః"** (లోకాలకు అన్నిటికీ తల్లి, తండ్రీ మాధవుడే) అని భారతంలోను, **"మాతావినై ప్పితువై త్తిరుమాలై"** (తల్లితండ్రి అయిన శ్రియఃపతిని) తిరువిరుత్తం–95) అని శఠకోపసూరిచేత ఉద్ఘోషింపబడిందికదా! ఈ నామంలోని అక్షరార్థాలను గమనించినపుడు **"మా–మానే", "మాఙ్–మానే"** అని ధాతువులు కనుక పరిచ్ఛేదించేది, పరిచ్ఛేదింపబడేది–అని మకారానికి అర్థం. **"పిణక్కఱ అఱువకైచ్చమయముమ్"** (శఠకోపసహస్రం–1–3–5) (వివాదరహితంగా ఆఱువిధాలైన మతాలు) అని చెప్పబడే ఆఱువిధాలైన బాహ్యమతాల నైచ్యాలను పరిచ్ఛేదించేది–అని భావం. వాటిచే తెలియడానికి వీలు కానిది–అని తాత్పర్యం.

**అఱువకై చ్చమయముమ్ అఱివరు నిలైయినై ఐమ్బాలోదియై ఆకత్తిరుత్తినై–**

(బాహ్యకుదృష్టిమతస్థులచేత తెలిసికోవడానికి వీలుకాని స్థితిలో ఉన్నావు. మార్దవ–శైత్య–సౌగంధ్య–నీలిమ–దైర్ఘ్యాలనే అయిదు లక్షణాలను కల కేశాలను కల్గిన లక్ష్మీదేవిని వక్షఃస్థలంలో కల్గి ఉన్నావు) అని కలివైరిసూరికూడా పలికారు.

**ఓదువార్ ఓత్తెల్లామ్ ఎవ్వులకత్తెవ్వైయుమ్**
**శాదువాయ్ నిన్పుకళిన్ తకైయాల్లల్ పిఱిదిల్లై**
**పోదువాళ్ పునన్తుళాయ్ ముడియినాల్ పూవిన్మేల్**
**మాదువాళ్ మార్బినాయ్** ॥(శఠకోపసహస్రం–3–1–6)

(అన్నిలోకాలలో అన్ని విధాలుగా అధ్యయనం చేసేవారి వేదాలన్నీ మంగళకరాలై, నీ గుణాలను కేవలం స్పృశించడం తప్ప వేఱే చేయగల్గినది లేదు. తన స్వస్థలంలో వికసించినట్లు వికసించే తులసి చేత కూర్చబడిన మాలను కిరీటంలో కలవాడవై, పుష్పంలో వాసం చేసే లక్ష్మీదేవి నిత్యవాసం చేసే వక్షస్సును కలవాడవై) అని శఠకోపసూరి కూడా



వ్యవహరిస్తున్నారు. ఆఱు అక్షరాలనుకల **"ఓమ్ సత్యాయ నమః"** అనే ఈ మంత్రం అన్ని విధాలైన సత్యఫలాలను ఇస్తుంది) అని లక్ష్మీదేవికూడా తెలిపింది.

**(అశీమహి)**–పూర్వం తెలుపబడ్డ గొప్పతనాన్నికల లక్ష్మిని మేము పొందాలి.

**(పశూనామ్ రూపమ్)–"పశ్యంతీతి పశవః"** (చూస్తున్నవి కనుక పశువులు అని అనబడుతున్నవి–చేతనులు) అనే వ్యుత్పత్తి వల్ల జ్ఞానాన్ని స్వరూపంగా కల త్రివిధ చేతనులు పశుశబ్దవాచ్యులు. వారి స్వరూపం అయిన జ్ఞానంగా ఉన్నది లక్ష్మి–అనే అర్థాన్ని ఈ నామం ఇస్తున్నది.

**పశ్యంతి పశవో జీవాః విధాభిస్తిసృభిః స్థితాః।**
**తేషాం రూపం తు యచ్ఛుక్రచైతన్యం హేయవర్జితమ్॥**
**తద్రూపమహమేవాస్మి చిత్ఘనానందరూపిణీ।**
**మచ్ఛక్తిలేశాస్తే సర్వే జీవాః చిచ్ఛక్తిసంజ్ఞితాః॥.....**
**పశూనాం రూపమిత్యేవం సాంఖ్యా మాం సంప్రచక్షతే।**
**నవాక్షరో హ్యయం మంత్రః సమ్యక్ జ్ఞానఫలప్రదః॥**

(నిత్యులు, ముక్తులు, బద్ధులు–అనే త్రివిధచేతనులు దర్శనమే స్వరూపంగా కలవారు కనుక పశువులు అని అనబడుతున్నారు. దోషంలేని వారి స్వరూపం అయిన ఏ చైతన్యం ఉన్నదో, ఆ చైతన్యం చిన్మయానందరూపిణి అయిన నేనే. "చిచ్ఛక్తి" అనే పేరును కల ఆ చేతనులందఱు నా శక్తియొక్క లేశభూతులు. అందువల్ల సాంఖ్యులు నన్ను "పశువులు–అంటే చేతనుల స్వరూపం" అని అంటున్నారు. తొమ్మిది అక్షరాలను కల **"ఓమ్ పశూనామ్ రూపాయై నమః"** అనే ఈ మంత్రం అందమైన జ్ఞానం అనే ఫలాన్ని ఇస్తుంది) అనే ఈ అర్థాలను, మంత్రమహిమను లక్ష్మీతంత్రంలో చెప్పబడ్డాయి.

**(అన్నస్య యశః)–"అద్యత ఇతి అన్నమ్"** (భుజింపబడుతున్నది కనుక అన్నం అని అనబడుతున్నది) అనే వ్యుత్పత్తినిబట్టి అనుభవింపబడే భోగ్యవస్తువులన్నీ అన్నీ శబ్దవాచ్యాలు. అవి రెండు విధాలు. సత్త్వరజస్తమస్సులనే మూడు గుణాలకు వశులైన బద్ధజీవులు అనుభవించే ప్రాకృతభోగ్యపదార్థాలు ఒక విధం. ఈ మూడు గుణాలకు అతీతులైన నిత్యముక్తులకు పరమపదంలో భోగ్యంగా ఉండే జ్ఞానబలైశ్వర్యవీర్యశక్తి తేజస్సులనే షాడ్గుణ్యమయం అయిన భగవత్స్వరూపం ఇంకొక విధం. వీటి భోగ్యత అనే కీర్తియై ఉంటుంది లక్ష్మీదేవి–అని ఈ నామంయొక్క అర్థం. అంటే–వీటి భోగ్యతకు కారణమై ఉండేది–అని భావం. **"వానాకి త్తీయాయ్ మఱికడలాయ్ మారుతమాయ్ త్తేనాకిప్పాలామ్ తిరుమాలే"** (సరోయోగిసూక్తం–92) (ఆకాశస్వరూపుడు, అగ్నిస్వరూపుడై, సముద్ర స్వరూపుడై, వాయుస్వరూపుడై, తేనె, పాలు వంటి భోగ్యవస్తుస్వరూపుడై ఉండే శ్రియః పతీ!) అని భౌతికమైన భోగ్యతకు, **"కోలమలర్ప్పావైక్కు అన్బాకియ ఎన్ అన్బేయో"**

(శఠకోపసహస్రం–10–10–6) (అందమైన లక్ష్మీదేవికి వల్లభుడవైన నా ప్రేమ స్వరూపా) అని భగవద్విషయంయొక్క భోగ్యతకు కూడా కారణభూతురాలు ఈ లక్ష్మీదేవియే–అని దివ్యసూరులు తెలియజేశారు కదా!

**త్రైగుణ్యం షడ్గుణోత్థం చ ద్విధాన్నం పరికీర్తితమ్।**
**త్రైగుణ్యమనుబద్ధానామితరేషామథేతరత్॥**
**ద్వివిధస్యాపి చాన్నస్య యద్యశో రూపముత్తమమ్। 50–174**
**తదహం సర్వభూతాత్మా తత్త్వజ్ఞైః పరికీర్తితా॥**
**ప్రాకృతాప్రాకృతా భోక్త్రా మచ్ఛక్తిప్రవిజృంభితాః।**
**అన్నస్య యశ ఇత్యేవ మాం విదుస్తత్త్వచింతకాః॥**
**నవాక్షరో హ్యయం మంత్రో భోగసర్వస్వదాయకః॥ 50–176**

(త్రైగుణ్యమని, షాడ్గుణ్యమని భోగ్యపదార్థాలు రెండు విధాలు. బద్ధులకు త్రైగుణ్యం భోగ్యం. నిత్యులకు, ముక్తులకు షాడ్గుణ్యం భోగ్యం. ఈ రెండు భోగ్య పదార్థాలకు ఉండే భోగ్యత అనే గొప్ప కీర్తి, సర్వభూతాత్మకయైన నేనే–అని జ్ఞానులచేత చెప్పబడుతున్నాను. ప్రాకృతమైనవి, అప్రాకృతమైనవి అయిన భోగాలు నా శక్తివల్ల ఉద్భవించినవి. అందువల్ల జ్ఞానులు నన్ను ''అన్నంయొక్క యశస్సు'' అని తెలిసికొంటున్నారు. తొమ్మిది అక్షరాలనుకల **"ఓమ్ అన్నస్య యశసే నమః"** అనే ఈ మంత్రం భోగాలన్నిటినీ ఇస్తుంది) అని ఈ అర్థాలు, మంత్రవైభవం లక్ష్మీతంత్రంలో ఘోషింపబడింది.

**(పశూనామ్ రూపమ్ అన్నస్య యశః)–"పశూనాం రూపమ్"** అని అనడం ద్వారా భోక్తృ స్వరూపంగా లక్ష్మి ఉన్నది–అని నిరూపింపబడింది. భోక్తృశక్తి ప్రభలని అంటూ "జ్వలంతీ" అనే నామ వివరణంలో నిరూపింపబడ్డ స్వర్గం, పర్జన్యుడు, భూమి, పురుషుడు, స్త్రీ–అనే పంచాగ్నులు, లౌకికాగ్ని–అనే ఆఱు అగ్నులు **"పశూనామ్ రూపమ్"** అనే పదంచేత సూచింపబడినవి కనుక, లక్ష్మీదేవి తదాత్మకయై ఉన్నదన్నది **"పశూనామ్ రూపమ్"** అనే నామానికి గల ఒక అర్థం. అదేరీతిలో భోగ్యశక్తి ప్రభలని అంటూ **"ప్రభాసా"** అనే నామంయొక్క వివరణంలో నిరూపింపబడ్డ శ్రద్ధ, సోముడు, జలం, అన్నం, వీర్యం, హవిస్సు అనే ఆఱు **"అన్నస్య యశః"** అనే ప్రయోగంచేత సూచింపబడినదని తలిస్తే లక్ష్మీదేవి తదాత్మక అనే అర్థం **"అన్నస్య యశః"** అనేది ఈ నామానికి ఇంకొక అర్థమని చెప్పవచ్చు.

**"ఆగ్నేయీ యాహి మచ్ఛక్తిః సా హి జాతా తథా తథా।"** (అగ్నిలో ఉండే నా భోక్తృశక్తి అక్కడక్కడ భోక్తలవద్ద ప్రకాశిస్తున్నది) అని,

**సోమశక్తి ర్మదీయా యా సా హి జాతా తథా తథా॥** (సోముడు మొదలైన హవిస్సులలో ఉండే నా భోగ్యశక్తి అక్కడక్కడ భోగ్యపదార్థాలలో వెలుగుతున్నది) అని ఈ



రెండు నామాలకు ఉన్న ఈ రెండు అర్థాలు లక్ష్మీతంత్రంలో చూపబడ్డాయి.

**(శ్రీః మయి శ్రయతామ్)**–లక్ష్మి నన్ను పొందుగాక. నన్ను ఆశ్రయించి ఉండడంద్వారా "శ్రీదేవి" తన పేరును స్థిరపఱచుకోవాలి. "శ్రీ" శబ్దానికి "భక్తులకు పరతంత్రయై, వారిని ఆశ్రయించి ఉంటుంది" అనే అపూర్వమైన వ్యుత్పత్తి దీనివల్ల సూచింపబడింది. **"నణ్ణి త్తొళువర్ శిన్దై పిరియాద నారాయణా"** (సేవించి, నమస్కరించేవారి మనస్సును విడువని నారాయణా!) (భట్టనాథసూక్తం–2–3–2) అనే ప్రయోగంలో భట్టనాథసూరి నారాయణ పదానికి ఈ విధంగా అర్థాన్ని గ్రహించారు కదా!

ఇక, ఈ మంత్రంలో **"మనసః కామమ్"** అని, **"వాచః ఆకూతిమ్"** అని, **"సత్యమ్"** అని, **"పశూనామ్ రూపమ్"** అని **"అన్నస్య యశః"** అని అయిదు నామాలు తనకు చెప్పబడినట్లుగా లక్ష్మీదేవే లక్ష్మీతంత్రంలో అనుగ్రహించింది. వస్తుస్థితి ఆ విధంగా ఉండగా, గోమఠరంగనాథభాష్యంలో ఈ క్రింది రీతిలో అర్థం చెప్పబడింది.

మనసఃకామమ్=మనస్సులలో అభిలషింపబడే వస్తువులను, ఆకూతిమ్= అభిప్రాయంలో ఉండే విషయాలను, వాచః=వాక్కుతో ప్రార్థింపబడేవి–అనే అన్ని మనోరథాలను, పశూనామ్ రూపమ్=జీవధనసమృద్ధిని, అన్నస్య రూపమ్=అన్నసమృద్ధికి కారణం అయిన అంతటినీ, సత్యమ్=ఏనాడూ మాఱని లక్ష్మియొక్క అనుగ్రహాన్ని, అశీమహి =పొందుతాము. శ్రీః=శ్రీదేవి, మయి=నాయందు (పూర్వం తెల్పిన సమృద్ధులను), యశః చ=కీర్తిని, శ్రయతామ్=ఆశ్రయించుగాక.

**11. కర్దమేన ప్రజాభూతా మయి సంభవ కర్దమ।**
**శ్రియం వాసయ మే కులే మాతరం పద్మమాలినీమ్॥ 11**

**ప్రతిపదార్థము :** కర్దమ=కర్దమప్రజాపతీ! కర్దమేన=కర్దముడవైన నీచే, ప్రజాభూతా=పుత్రికగా గ్రహింపబడినది (శ్రీదేవి), మాతరమ్=అన్నిలోకాలకు తల్లి, పద్మమాలినీమ్=తామరపూల మాలికలను కల, శ్రియమ్=శ్రీదేవిని, మయి=నాయందు, సంభవ=కల్గించు, (నీ కుమార్తె అయిన శ్రీదేవిని), మే=నాయొక్క, కులే=కులంలో, వాసయ=నివసించేటట్లు జేయాలి.

**భావము :** శ్రీదేవి నావద్ద నివసించాలి–అని గత మంత్రంలో ప్రార్థించిన వేదపురుషుడు, పాలసముద్రంలో లక్ష్మీదేవి అవతరించినపుడు ఆమెను పుత్రికగా స్వీకరించిన కర్దమ ప్రజాపతిని పురుషకారంగా ఆశ్రయించి, నా దగ్గరనే కాకుండా, నా కులంలో ఉండే అందరివద్ద లక్ష్మీదేవి నివసించేటట్లు చేయాలి–అని ఈ మంత్రంలో ప్రార్థిస్తున్నాడు.

**(కర్దమేన ప్రజాభూతా)**–కర్దమునియొక్క పుత్రిక లక్ష్మీదేవి.

**క్షీరోదార్ణవసంభూతాం శ్రియం జగ్రాహ కర్దమః।**
**ప్రజాత్వేన తదా లక్ష్మీం తదా ప్రభృతి కర్దమీ॥**

(పాలకడలిలో అవతరించిన లక్ష్మీదేవిని కర్దమప్రజాపతి తన కుమార్తెగా

(పద్ముడు, గతుడు, శంఖనిధి, నాల్గు దంతాలను కల గజం, కల్యాణసర్పం, పంచాననం (సింహం), చిక్లీతుడు-అనేవారు లక్ష్మీదేవి కోవెలకు రక్షకులు) అనే పురాణవచనాన్ని ప్రమాణంగా గోమఠరంగనాథులు ఉట్టంకించారు.

**(చిక్లీత వస మే గృహే)**-సూర్యోదయానికి ముందుగా అరుణోదయం అయేటట్లు లక్ష్మి నా గృహంలో నివసించడానికి ముందు ఆమె కోవెల ద్వారానికి రక్షకుడవైన నీవు ఆ లక్ష్మికి నివాసస్థానం అయిన నా ఇంటిని రక్షించడంకోసం వేం చేయాలి. ఇంకా ఏమి కావాలి? అని అంటే,

**(దేవీం..........నివాసయ)** లక్ష్మీదేవిని నా వంశంలో సాన్నిధ్యాన్ని పొందేటట్లు చేయాలి.

**(దేవీమ్)**-దేవుని పత్నిని. ఈ నామంయొక్క భావం ఇంతకుముందే వివరింపబడింది.

**(మాతరమ్)**-లోకానికి తల్లిని.

**(శ్రియమ్)**-"శ్రీః" అనే విలక్షణ నామాన్ని కలదానిని. ఈ రెండు నామాల అర్థాలు, నిర్వచనాలు ముందే తెలుపబడ్డాయి.

**(మే కులే)**-నా వరకే కాకుండా, పైన కింద ఏడుతరాల నా కులంలో అంతా.

**(నివాసయ చ)**-నీవు నివసించడమే కాకుండా, లక్ష్మిని కూడా నివసించేటట్లు చేయాలి. దీనివల్ల లక్ష్మీదేవి భక్తిపారతంత్ర్యం తెలుపబడింది.

**13. ఆర్ద్రాం పుష్కరిణీం యష్టిం పింగళాం పద్మమాలినీమ్।**
**చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ॥ 13**

**ప్రతిపదార్థము :** జాతవేదః=పరమపురుషా!, ఆర్ద్రామ్=ఆర్ద్రమైన-మృదువైన మనస్సును కల్గినది, పుష్కరిణీమ్=(దాసులను) పోషించేది, యష్టిమ్=(అందరికీ) ఆలంబనదండంగా ఉన్నది, పింగళామ్=పచ్చనివర్ణాన్ని కల్గినది, పద్మమాలినీమ్=తామరపూల మాలను ధరించినది, చంద్రామ్=ఆనందస్వరూపిణి, హిరణ్మయీమ్=సువర్ణమయమైనది అయిన, లక్ష్మీమ్=లక్ష్మీదేవిని, మమ=నాకు, ఆవహ=అనుగ్రహించాలి.

**భావము :** తండ్రి అయిన కర్దముని, దాసభూతుడైన చిక్లీతుని, ముందు మంత్రాలలో వేదపురుషుడు ప్రార్థించాడు. ఎవరు అంగీకరించినా, స్వామి అయిన సర్వేశ్వరుడు అంగీకరిస్తే తప్ప లక్ష్మీదేవియొక్క కరుణాకటాక్షం సిద్ధించదు కదా! అందువల్ల ప్రారంభంలో వలెనే, చివరలో కూడా మూడు మంత్రాలతో లక్ష్మి తనవద్ద నిత్యసాన్నిధ్యం కల్గి ఉండేటట్లు చేయాలని పరమపురుషుని ఆ వేదపురుషుడు ప్రార్థిస్తున్నాడు.

**(ఆర్ద్రామ్)**-ఆర్ద్రమైన మనస్సును కల్గినదానిని-అని భావం. ఈ నామంయొక్క అర్థంలోని అతిశయం ఇతఃపూర్వమే విస్తరంగా తెలుపబడింది.

**(పుష్కరిణీమ్)**-ఇతరులకు రూపాన్ని, కీర్తిని, సంపదను అనుగ్రహించి, పోషించేది-అని



అన్నారు. అన్ని అర్థాలు లక్ష్మీదేవిలోనే పరిచ్ఛేదింపబడ్డాయి అని దీనివల్ల తెలుస్తున్నది. **"ఒణ్ తామరైయాళ్‌కేళ్వన్ ఒరువనైయే నోక్కుమునర్వు"** (సరోయోగి సూక్తం-67) (అందమైన తామరపూవులో ఉండే లక్ష్మికి వల్లభుడైనవానిని ఒక్కని మాత్రమే జ్ఞానం లక్ష్యంగా కల్గి ఉంటుంది) అని సరోయోగి కూడా అన్నారు. ఈ అర్థాలన్నీ-

**మిమే షడధ్వనో వ్యగ్రా మీయే మానైస్తథాఖిలైః। 50-177**
**మితిశ్చ సర్వమానానామ్ మాతి చాంతర్మమాఖిలమ్॥**

(ఆఱు మతాలను పరిచ్ఛేదిస్తున్నాను, అన్ని ప్రమాణాలచేత పరిచ్ఛేదింపబడుతున్నాను. అన్ని ప్రమాణాల జ్ఞానమై ఉన్నాను. అన్ని అర్థాలు నాలో పరిచ్ఛేదింపబడుతున్నాయి.) అని లక్ష్మీదేవిచేత చెప్పబడ్డాయి. **"తౄ-ప్లవనతరణయోః"** (తౄ-అనే ధాతువునకు తేలడం, దాటడం అనే అర్థాలు) అని ధాతువు కనుక "మాతృ" శబ్దంలోని రెండవ అక్షరం అన్ని దోషాలను దాటి ఉండేది-అనే, తన మనస్సు అనే తెప్పతో సర్వభూతాలను తేలి ఆడించేది-అని, మేఘమై ఉండి లోకాలను అన్నిటినీ నీటిలో తేలేటట్లు చేసేది-అని ఈ విధంగా పలు అర్థాలు ఇస్తుంది. ఈ అర్థాలు, ప్రియాన్ని, హితాన్ని చింతించి వాటిని చేసే తల్లియై ఉంటుంది-అనే మాతృశబ్దార్థం, ఈ మంత్ర వైభవం-

**తారయామి జగత్సర్వమపారం భవసాగరమ్।**
**ఉత్తీర్ణా సర్వదోషాబ్ధేః ప్లవే భూతేషు చేతసా॥**
**ప్లావయామి జగద్విశ్వం పయసా మేఘతాం గతా।**
**ప్రియం హితం చ సర్వేషాం చింతయామి కరోమి చ॥**
**తేన మాం సర్వభూతానాం మాతరం యోగినో విదుః। 50-180**
**పంచాక్షరో హ్యయం మంత్రః సర్వభోగసమృద్ధిదః॥**

(లోకాన్ని అంతటినీ అపారమైన సంసారసాగరాన్ని దాటేటట్లు చేస్తాను. దోషాల సముద్రాన్ని దాటినదానను. మనస్సుతో భూతాలలో తేలి ఆడతాను. మేఘమై అన్ని లోకాలను నీటితో తేలియాడేటట్లు చేస్తాను. అందఱికీ ప్రియాన్ని, హితాన్ని, చింతిస్తాను, చేస్తాను. అందువల్ల నన్ను అన్ని భూతాలకు తల్లి అని యోగులు తెలిసికొంటున్నారు. అయిదు అక్షరాలను కల **"ఓమ్ మాత్రే నమః"** అనే ఈ మంత్రం అన్ని భోగాల సమృద్ధిని ఇస్తుంది) అని లక్ష్మిచేత లక్ష్మీతంత్రంలో చెప్పబడింది.

**(పద్మమాలినీమ్)**-తామరమాలను కల్గినది. తామరను ఆసనంగా గ్రహించినదై, చేతిలో తామరపూవును ధరించి ఉన్నదై, శిరఃపద్మం కింద ఉన్నదై, తామరపూలమాలను కల్గినదై ఉండడంవల్లనే కదా **"తామరైయాళ్"** అని, **"మలర్‌మకళ్"** అని, **"కమలప్పావై"** అని, "మలరాళ్" అని లక్ష్మీదేవి కీర్తింపబడుతున్నది.

**(పద్మమాలినీమ్)**–సుషుమ్నానాడి అని తలలో బ్రహ్మరంధ్రం నుండి పైభాగంలో ఉండే నాడి ఒకటి ఉన్నది. మోక్షాన్ని పొందేవారు ఈ నాడిద్వారా బ్రహ్మరంధ్రాన్ని ఛేదించుకొని పరమపదాన్ని పొందుతారు–అని వేదాంతాలలో చెప్పబడుతున్నది. ఈ నాడిలో ఆధారపద్మాలు అనబడే ముప్పైరెండు పద్మాలున్నాయి. ఈ నాడిగానే చెప్పబడేది, ఈనాడిలో సంచరించేది అయిన లక్ష్మీదేవి ఈ పద్మాలనే మాలచేత అలంకరింపబడిన సన్నివేశంలో దర్శనాన్ని ఇస్తుంది. అందువల్ల ఈమె "పద్మమాలినీ" అని అనబడుతున్నది అని లక్ష్మీతంత్రంలో ఒక విశిష్టమైన అర్థం చెప్పబడింది.

**సుషుమ్నా నామ యా నాడీ నాడీచక్రస్య నాయికా।**
**ముక్తియానం మహాయానం యోగియానమితి శ్రుతా॥**
**శక్తిర్యా వైష్ణవీ సూక్ష్మా మన్మయీ పరికీర్తితా।**
**సంకల్పవిషయస్సర్వో యామాలంబ్యావతిష్ఠతే॥**
**ఊర్ధ్వం చాధశ్చ యా భిత్వా ప్రతిజీవం వపుర్గతిమ్।**
**వ్యాప్తా పరమమాకాశం సా సుషుమ్నేతి గీయతే॥**
**ముక్తయేఽఖిలజీవానాం సంసారాఖిలఖేదినామ్।**
**సాహం సుషుమ్నారూపేణ వర్తే దేహేషు దేహినామ్॥**
**ఆవస్తిశీర్షాదా మూర్ధ్నస్తస్యాం శక్తౌ పురందర।**
**ఆధారాఖ్యాని పద్మాని ద్వాత్రింశత్ సంస్థితాని వై॥**
**పద్మానాం మాలయా వ్యాప్తా తతో–హం పద్మమాలినీ॥ 50–186**

(నాడీసమూహం అంతటికీ నాయికయై ఉన్నది, మోక్షమార్గం అని, గొప్పమార్గం అని, యోగులమార్గం అని చెప్పబడేది, విష్ణువుయొక్క సూక్ష్మశక్తిగాను, మన్మయంగాను చెప్పబడేది, అన్ని సంకల్పాలకు జన్మభూమిగా ఉన్నది, ఒక్కొక్క జీవుని శరీరంలోని పై భాగాన్ని, క్రింది భాగాన్ని ఛేదించుకొని, బ్రహ్మరంధ్రాన్ని చేరి వ్యాపించి ఉండేది–అయిన నాడి సుషుమ్నానాడి అని చెప్పబడుతున్నది. సంసారంలోని అన్ని దుఃఖాలను అనుభవించే జీవులు అందరు మోక్షాన్ని పొందడంకోసం జీవుల దేహంలో నేనే సుషుమ్నానాడి రూపంలో ఉన్నాను. ఇంద్రా! వస్తిశీర్షంనుండి తలలో బ్రహ్మరంధ్రంవరకు విష్ణుశక్తిరూపంగా ఉండే నాడిలో ఆధారపద్మాలు అనబడే ముప్పైరెండు తామరలు ఉన్నాయి. ఈ తామరల మాలచేత నేను వ్యాపింపబడి ప్రకాశిస్తున్నాను. అందువల్ల పద్మమాలిని–అని అనబడుతున్నాను) అనే లక్ష్మీతంత్రంలోని వచనాలు స్మరణీయాలు.

**(పద్మమాలినీమ్)**–**"పద్మేస్థితామ్"** అనే తిరునామం వివరణలో **"పద్మయానం మినోతీతి కాలం పద్మం ప్రచక్షతే"** (తాను చలిస్తూనే మిగిలినవానిని పరిచ్ఛేదిస్తుంది కనుక కాలాన్ని పద్మమని అంటారు) అని పద్మంగా చెప్పబడ్డ కాలాన్ని **"పద్మవర్ణామ్"** అనే నామ వివరణంలో సూర్యునివల్ల వికసించే తామరవలె పిరాట్టిని చూచి వికసించేవిగా చెప్పబడ్డ ప్రకృతి పురుషులను తామరపూలవలె ధరించి ఉండేది కనుక **"పద్మమాలినీ"** అని అనబడుతున్నది అనికూడా చెప్పవచ్చు. ఈ అర్థాలు, ఈ మంత్ర వైభవం–

**ప్రకృతిం పురుషం చైవ కాలం చాపి సనాతనమ్।**
**ధారయామి స్వరూపేణ తతోఽహం పద్మమాలినీ॥**
**అష్టాక్షరో హ్యయం మంత్రః సర్వకర్మఫలప్రదః।**

(ప్రకృతిని, పురుషుని, సనాతనం అయిన కాలాన్ని నేను స్వరూపంతోనే ధరించి ఉన్నాను. అందువల్లనే పద్మమాలిని అని అనబడుతున్నాను. ఎనిమిది అక్షరాలను కల **"ఓమ్ పద్మమాలిన్యై నమః"** అనే ఈ మంత్రం అన్ని కర్మల ఫలాన్ని ఇస్తుంది) అని లక్ష్మీతంత్రంలో వ్యక్తం చేయబడ్డాయి.

ఇటువంటి లక్ష్మీదేవిని నా కులంలో వసించేటట్లు చేయాలి–అని అన్వయం.

**12. ఆపః సృజంతు స్నిగ్ధాని చిక్లీత వస మే గృహే।**
**ని చ దేవీం మాతరం శ్రియం వాసయ మే కులే॥ 12**

**ప్రతిపదార్థము :** ఆపః=నీరు, స్నిగ్ధాని=(లక్ష్మికి) ప్రియమైన వానిని, సృజంతు=సృష్టించుగాక, చిక్లీత=లక్ష్మి కోవెలను కాపాడేవాడా!, మే=నాయొక్క, గృహే=ఇంటిలో, వస=నివసించు, మాతరమ్=తల్లి అయిన, శ్రియం దేవీమ్=శ్రీదేవిని, మమ కులే=నా వంశంలో, నివాసయ చ =నిత్యవాసాన్ని చేయించు.

**భావము :** కర్దమ ప్రజాపతిని పురుషకారంగా ఆశ్రయించి, శ్రీదేవిని నా కులంలో నిత్యంగా నివసించేటట్లు చేయాలని గత మంత్రంలో ప్రార్థింపబడింది. ఆ కర్దమ ప్రజాపతికంటే, అంతరంగ సేవకుడు, లక్ష్మి ఆలయాన్ని కాపలాకాసేవాడు అయిన చిక్లీతుని పురుషకారంగా ఆశ్రయించి, నా ఇంటిలో నీవు ఉండాలి. లక్ష్మి నా కులంలో నిత్యవాసం చేసేటట్లు చేయాలి–అని ఈ మంత్రంలో ప్రార్థిస్తున్నాడు వేదపురుషుడు.

**(ఆపః సృజంతు స్నిగ్ధాని)**–**"ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః, తాయదస్యాయతనం పూర్వం తేన నారాయణః స్మృతః"** (నరుడనే భగవానుని వల్ల ఉద్భవించినవి కనుక జలం నారమనబడుతున్నది. దానిని నివాసస్థానంగా కలవాడు కనుక పరమపురుషుడు నారాయణుడనబడుతున్నాడు) అని మనుస్మృతిలో చెప్పిన రీతిలో శ్రీమన్నారాయణునకు నివాసస్థానంగా ఉండే జలం లక్ష్మికి భోగ్యమైన వస్తువులను నావద్ద సృష్టించుగాక! **"స్నేహిన్యః ఆపః"** (స్నేహమనే గుణాన్ని కల్గినవి జలాలు) అని చెప్పబడే నీరు స్నేహవిషయీభూతాలైన పదార్థాలను సృష్టించాలి–అని భావం.

**(చిక్లీత)**–భగవానుని అంతఃపురానికి ద్వారపాలకుడవైన ఓ చిక్లీతా!

**పద్మో గతో నిధిః శంఖః చతుర్దంతీ గజస్తథా।**
**కల్యాణసర్పపంచాస్యాః చిక్లీతో గృహరక్షకాః॥**

చేసికొని గొప్ప సంపదను పొందాడు) అన్నది కూడా పత్ని అయిన ఈమెవల్ల పొందిన దానిని ఈమె భర్త అయిన భగవానునిలో ఆరోపించి చెప్పబడిందని గ్రహించాలి. **"మయైవ విహితాన్ హితాన్"** (భగవద్గీత) (నాచేతనే అనుగ్రహింపబడిన వానిని) అని అన్నట్లు ఇతర దేవతలు ఇవ్వడంకూడా వారికి అంతర్యామి అయిన ఇతడు ఇచ్చినట్లే అయినపుడు, అంతరంగ అయిన ఈమె ఇవ్వడం భగవానుడు ఇవ్వడమే అవుతుందని ఉపపాదించాలా! శ్రీ సాత్త్వతాదులలో మోక్షాన్ని పరమపురుషుడే ఇస్తాడని, ఐశ్వర్యాన్ని లక్ష్మీమూలంగా అనుగ్రహిస్తాడని విభజించి చెప్పబడింది కదా! లోకంలోకూడా తండ్రి హితాన్ని కల్గించేవాడుగాను, తల్లి ప్రియపరగాను ఉండడాన్ని చూస్తున్నాము. హితం అయిన మోక్షాన్ని తండ్రి అయిన అతడు ఇస్తాడు, ప్రియం అయిన ఐశ్వర్యాన్ని తల్లి అయిన ఈమె ఇస్తుంది అనే నియమాన్ని దివ్యదంపతులు ఏర్పాటుచేసికొన్నారు కాబోలు! **"ఉతామృతత్వస్యేశానః"** అని, **"ఇష్టం మనిషాణ"** అని పురుషసూక్తం మొదటలో, చివరలో మోక్షప్రదుడు అతడే అని ఉద్ఘోషించడం, **"యస్యాం హిరణ్యం విందేయం గామశ్వం పురుషానహమ్"** అని, **"యస్యాం హిరణ్యం ప్రభూతం గావో దాస్యోశ్వాన్ విందేయం పురుషానహమ్"** అని ఈ శ్రీసూక్తం ప్రారంభంలోను చివరలోను ఐశ్వర్యం ఈమే అని ఉద్ఘోషించడం ఈ అభిప్రాయాన్నే తెలుపుతున్నవి. ముకుందుడు (ముక్తిప్రదుడు) అని పేరు పొందిన ఆ జనార్దనుడే మోక్షాన్ని ఇస్తాడని, ఐశ్వర్యపర్యాయం అయిన "శ్రీః", "లక్ష్మీః" అనే తిరునామాలను కల ఈమె సంపదను ఇస్తుంది అని లోకంలో కూడా ప్రసిద్ధి ఉన్నది కదా! "పింగళా" అనే నామంయొక్క రెండు అర్థాలు, ఈ మంత్రవైభవం

**పింగళాస్మి స్వయా భాసా ప్రతప్తకనకాభయా।**
**పింగాయ చాప్యదామ్ పూర్వం యక్షేశాయ మహాశ్రియమ్॥**
**యక్షేశో మాం పురా శక్ర! పింగలేత్యేవ మూచివాన్।**
**సప్తాక్షరో హ్యయం మంత్రో యోగతేజస్సమృద్ధిదః॥ 50-194**

(కఱగించిన బంగారంవంటి నా కాంతితో నేను పింగళ అని అనబడుతున్నాను. యక్షులను నాయకుడైన, "పింగః" అనబడే కుబేరునకు నేను మొదట గొప్ప సంపదను ఇచ్చాను. ఓ ఇంద్రా! ఈ కారణాల వల్ల మొదట నన్ను ఇంద్రుడు **"పింగలా"** అని పిలిచాడు. ఏడు అక్షరాలను కల్గిన **"ఓమ్ పింగలాయైనమః"** అనే ఈ మంత్రం యోగాన్ని అనుష్ఠించడానికి కావలసిన తేజస్సమృద్ధిని ఇస్తుంది) అని పిరాట్టి చేతనే తంత్రంలో చెప్పబడ్డాయి.

**(పద్మమాలినీమ్)**-తామరమాలను కల్గినది. **"పూవార్ తిరుమామకళ్"** (పూలు నిండిన లక్ష్మీదేవి) (కలివైరిసూరిసూక్తం (4-7-9) అని దివ్యసూరుల వాక్కు.

**(చంద్రామ్)-"చది-ఆహ్లాదనే"** అని ధాతువు కనుక ఆనందమయిగా ఉన్నదానిని-అని భావం.



భావం. సర్వేశ్వరునకు కూడా **"అతీవ రామః శుశుభే"** (రామా. బాల-77-30) (సీతవల్ల రాముడు గొప్పగా ప్రకాశించాడు), **"తికళ్కిన్ఱ తిరుమార్బిల్ తిరుమజ్ఞైతన్నోడుమ్ తికళ్కిన్ఱ తిరుమాలార్"** (శఠకోపసహస్రం-16.6.9) (ప్రకాశించే అందమైన వక్షస్సులో వెలిగే లక్ష్మీదేవితో భాసిస్తున్న శ్రియఃపతి) అని అందాన్ని, **"మన్ను పెరుమ్పుకళ్ మాదవన్"** (స్థిరంగా ఉన్న గొప్పకీర్తిని కల మాధవుడు) (గోదాసూక్తం-5-1), **"మరుత్తాల్ తొల్ పుకళ్ మాదవనై"** (కలివైరిసూరిసూక్తం-10-10-1) (గొప్ప సువాసనను కల మాలను అలంకరించుకొన్న, నిత్యసిద్ధమైన కల్యాణగుణాలను కల మాధవుని), **"అలర్మేల్ మజ్ఞైయుఱైమార్బా నికరిల్ పుకళాయ్"** (శఠకోపసహస్రం-6-10-10) (పద్మావతీదేవి నిత్యవాసం చేసే వక్షఃస్థలాన్ని కలవాడా! సాటిలేని వాత్సల్యగుణాన్ని కలవాడా!) అని కీర్తిని, **"శ్రద్ధయా దేవో దేవత్వమశ్నుతే"** (శ్రద్ధాశబ్దవాచ్యురాలైన లక్ష్మీదేవిచేత దేవశబ్దవాచ్యుడైన నారాయణుడు దేవత్వాన్ని-ఐశ్వర్యాన్ని-పొందుతున్నాడు) అని అన్నట్లు ఐశ్వర్యాన్ని ఇచ్చి పోషిస్తున్నది ఈ లక్ష్మియే అయినపుడు, మిగిలినవారిని పోషించేది కూడా ఈమె అనే విషయాన్ని వివరించాలా?

**(పుష్కరిణీమ్)**-పుష్కరశబ్దం తామరపూవును తెలుపుతుంది. పద్మంగా చెప్పబడ్డ కాలాన్ని నియమిస్తున్నది కనుక **"పుష్కరిణీ"** అని అనబడుతున్నది అని కూడా చెప్పవచ్చు.

**(పుష్కరిణీమ్)**-తామరలను కల్గినది-అనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు. మొదటి రెండు అర్థాలు, ఈ మంత్రవైభవం-

**పోషం కరోమి సర్వేషాం రూపేణ యశసా శ్రియా।**
**పుష్కరం చ నయామ్యేకా కాలాఖ్యం పద్మరూపకమ్॥**
**తేన పుష్కరిణీత్యేవం ఋషయో మాం ప్రచక్షతే।**
**సప్తాక్షరో హ్యయం మంత్రః సర్వపోషఫలప్రదః॥**

(అందంతో, కీర్తితో, సంపదతో అందఱిని పోషిస్తున్నాను. పద్మంగా చెప్పబడే కాలమనే తామరను నేను ఒక్కతెనే నియమిస్తున్నాను. అందువల్ల **"పుష్కరిణీ"** అని నన్ను మహర్షులు వ్యవహరిస్తున్నారు. ఏడు అక్షరాలను కల **"ఓమ్ పుష్కరిణ్యై నమః"** అనే ఈ మంత్రం అన్ని విధాలైన సమృద్ధులను ఇస్తుంది) అని లక్ష్మీతంత్రంలో తెలుపబడ్డాయి. ఏవిధంగా పోషిస్తుంది? అని అంటే,

**(యష్టిమ్)-"యా-ప్రాపణే"** అనే ధాతువునుండి ఈ శబ్దం ఉత్పన్నమైనదని భావిస్తే అన్ని కామాలను పొందింపజేయటం ద్వారా అందఱినీ పోషిస్తుంది-అని భావం. ఈమె అన్ని కామాలను పొందింపజేస్తుంది అనే అర్థాన్ని-

**మణ్ణులక మాళేనే వానవర్క్కుమ్ వానవనాయ్**
**విణ్ణులకమ్ తన్నకత్తు మావేనే-నణ్ణి**

**త్తిరుమాలై చ్చెజ్గణ్ నెడియానై ఎజ్గళ్**
**పెరుమాన్ క్కై తొళుదపిన్** (భూతయోగిసూక్తం–90)

(శ్రియఃపతి, ఎఱ్ఱని నేత్రాలను కలవాడు, మనకు ఆశ్రయణీయుడు, మనకు స్వామి అయిన సర్వేశ్వరుని సమీపించి, చేతులను జోడించిన పిదప, భూలోకాన్ని ఏలనా? దేవతలకంటే అధికుడనై, పరమపదంలో అమరి ఉండనా?) అని భూతయోగి వచించారు.

**(యష్టిమ్)**–"యా–ప్రాపణే"–అనే ధాతువునకు కర్త్రర్థం కూడా ఉన్నది కనుక, "సర్వేశ్వరుని ఎల్లప్పుడు పొంది ఉండేది"–అనే అర్థాన్ని చెప్పవచ్చు.

**(యష్టిమ్)**–"ఇషు–ఇచ్ఛాయామ్" అనే ధాతువునుండి పుట్టిన పదంగా దీనిని గ్రహిస్తే, దేవతలందఱికి ఇష్టమై ఉన్నది అనే అర్థాన్ని గ్రహించవచ్చు.

**తతోఽవలోకితా దేవా హరివక్షఃస్థలస్థయా।**
**లక్ష్మ్యా మైత్రేయ! సహసా పరాం నిర్వృతిమాగతాః॥ (విష్ణు.పు.1–9–106)**

(మైత్రేయా! తరువాత పరమపురుషుని వక్షఃస్థలంలో వేంచేసి ఉండే లక్ష్మీదేవిచేత కటాక్షింపబడ్డ దేవతలు గొప్ప ఆనందాన్ని పొందారు) అని కదా చెప్పబడింది.

**(యష్టిమ్)**–యష్టి శబ్దం ఆలంబనదండాన్ని సూచిస్తుంది కనుక ఆలంబన దండంవలె (పట్టుకొమ్మవలె) అందఱికీ ఆధారమై ఉంటుందని భావం. **"ఆవిక్కోర్ పత్తు క్కొమ్బునిన్నలాల్ అఱికిన్డిలేన్ యాన్"** (శఠకోపసహస్రం–10–10–3) (నా ప్రాణానికి అద్వితీయం అయిన పట్టుకొమ్మ నీకంటే వేఱొకటిని నేను తెలియను) అని, **కోల్తేడియోడుమ్ కొళున్దదే పోన్ఱదే మాల్ తేడియోడుమ్ మనమ్"** (భూతయోగిసూక్తం–27) (ఆలంబనదండాన్ని వెదకుతూ పాకే తీగవలె సర్వేశ్వరుని వెదకుతూ పరుగెత్తుతున్నది నా మనస్సు) అని పలికే రీతిలో అందఱికీ ఆలంబనదండంగా ఉండే అతనికి కూడా **"మలరాళ్ తనత్తుళ్ళాన్"** (లక్ష్మీదేవి స్తనంలో ఉండేవాడు) (మహాయోగిసూక్తం–3) అని, "శఙ్గుతఙ్గు మున్గై నఙ్గై కొఙ్గైతఙ్గలుత్తవన్" (భక్తిసార యోగిసూక్తం–57) (చేతిగాజులు అమరి ఉండే ముంజేతిని కల లక్ష్మీదేవి స్తనాలలో ఉండేవాడు) అనే రీతిలో ఆలంబనదండంగా ఉంటుందికదా ఈ లక్ష్మీదేవి.

**యామాలంబ్య సుఖేనేమాం దుస్తరం త్రిగుణోదధిమ్।**
**నిస్తరంత్యచిరేణైవ వ్యక్తధ్యానపరాయణాః॥**

(దర్శనసమాకారం అయిన ధ్యానంలో అభినివేశాన్ని కల పెద్దలు దాటటానికి సాధ్యంకాని త్రిగుణసముద్రాన్ని ఎవరి ఆధారంగా చేసికొని చాలా త్వరగా అతిసులభంగా దాటుతున్నారో) అని అంటూ ఈ లక్ష్మీదేవి సకలాత్మలకు ఆలంబనంగా ఉంటుంది–అనే అర్థం సాత్త్వతసంహితలో కూడా చెప్పబడింది కదా!

**(యష్టిమ్)**–తీగవలె సుకుమారంగా ఉండేది–అని కూడా భావం. **"కొమ్బుపోల్ శీదై"**



(తీగవంటి సీత) (శఠకోపసహస్రం–4–2–8) అని శఠకోపసూరి అన్నారు. "దెయ్వవణ్డు తుదైత్త ఎమ్పెణ్మై అమ్పూ" (శఠకోపసహస్రం–9–9–4) (దైవభ్రమరం అయిన భగవానునిచేత మర్దింపబడిన సుందరమైన పుష్పం) అనే రీతిలో సర్వేశ్వరుని భోగంచేత అలసి, చిక్కి ఉండే పూలతీగవంటి మేనిని కల్గినది–అని భావం.

**మర్మస్పృశో రససిరా వ్యతివిధ్య వృత్తైః**
**కాంతోపభోగలలితైః లులితాంగయష్టిః।**
**పుష్పావలీవ రసికభ్రమరోపభుక్తా**
**త్వం దేవి! నిత్యమభినందయసే ముకుందమ్॥** (శ్రీగుణరత్నకోశమ్–45)

(లక్ష్మీదేవీ! మర్మాలను స్పృశించే రసనాడులను అభిఘాతంచేసి ఏర్పడే పరమపురుషుని సంభోగలీలలచేత అలసి, కృశించి ఉండే లతవంటి రూపాన్ని కల్గినదానవై, రసాన్ని తెలిసిన తుమ్మెదచేత అనుభవింపబడిన పూలగుత్తివలె నీవు ముకుందుని సదా ఆనందింపజేస్తున్నావు) అని పరాశరభట్టరు ఈ అర్థాన్ని వివరించారు.

**(యష్టిమ్)**–యాగక్రియయై ఉన్నది–అని, యాగంచేత ఆరాధింపబడేది అని గోమఠరంగనాథ భాష్యంలో అర్థం తెలుపబడింది. మొదటి మూడు అర్థాలు, ఈ మంత్ర మహిమ

**ఇష్టాస్మి సర్వదేవానాం సంగతా హరిణా సదా।**
**దాత్రీ చ సర్వకామానామఖిలస్యావలంబనమ్॥**
**మామాలంబ్యావతిష్ఠంతే ప్రధానపురుషాదయః॥ 50–191**
**యష్టిరిత్యేవ మృషయో మాం తత స్సంప్రచక్షతే॥**
**షడక్షరో హ్యయం మంత్రః సర్వయోగఫలప్రదః॥**

(అందఱు దేవతలకు ఇష్టురాలనై ఉన్నాను. భగవానునితో ఎల్లప్పుడు కూడి ఉన్నాను. అన్ని కోరికలను ఇచ్చేదానను, అందఱికీ పట్టుకొమ్మనై ఉన్నాను. ప్రకృతి–పురుషుడు మొదలైన తత్త్వాలు నన్ను ఆశ్రయించి ఉన్నాయి. అందువల్ల నన్ను మునులు "యష్టి" అని వ్యవహరిస్తున్నారు. ఆఱు అక్షరాలనుకల **"ఓమ్ యష్ట్యై నమః"** అనే ఈ మంత్రం కర్మ–జ్ఞాన–భక్తులనే అన్ని యోగాల (ఉపాయాల) ఫలాన్ని ఇస్తుంది అని లక్ష్మీతంత్రంలో ఉద్ఘోషింపబడ్డాయి.

**(పింగళామ్)**–కఱగించిన బంగారంవలె పచ్చని వర్ణాన్నికల మేనిని కల్గిన దానిని.

**(పింగళామ్)**–**"ఏకపింగః"** అనే పదం కుబేరుని తెలుపుతుంది. **"నామైకదేశేన నామ గ్రహణమ్"** అనే న్యాయంతో పింగశబ్దం కూడా కుబేరుని సూచిస్తుంది" **లా–దానే"** అనే ధాతువు కనుక, పింగుడనబడే కుబేరునకు సంపదను ఇస్తున్నది–అనే అర్థాన్ని ఇస్తుంది–**"పింగళా"** అనే నామం. ఐశ్వర్యానికి అధిదేవత కదా ఈ లక్ష్మి. **"అర్ధమేకపింగః ప్రసాద్య విష్ణుం సంప్రాప్తః"** (విష్ణుధర్మమ్–43–47) (కుబేరుడు విష్ణువును ప్రసన్నుని

**"శెయ్యదోర్ ఞాయిత్తై క్కాట్టి చ్చిరీదరన్ మూర్త్తి యీదెన్నుమ్"** (శఠకోపసహస్రం -4-4-2) (ఎఱ్ఱని, అద్వితీయం అయిన సూర్యుని చూపించి, శ్రీధరునిమూర్తి ఇది అని అంటుంది) అని శఠకోపసూరి సైతం అన్నారు. ఈ మూడు అర్థాలు, మంత్రవైభవం

**హితాయ సర్వజీవానాం ప్రసూయే తత్త్వపద్ధతిమ్।**
**రమయామి పునస్తత్ర భుక్త్వా ముక్త్యా యదర్థతః॥**
**నియచ్ఛామి తథా కాలై స్సజీవాం తత్త్వపద్ధతిమ్।**
**సూరిభ్యశ్చ హితా నిత్యం సూర్యరూపార్కమండలే॥**
**సూర్యేతి సూరిభిః ప్రోక్తా తతోఽహం తత్త్వచింతకైః॥**
**షడక్షరో హ్యయం మంత్రో భోగమోక్షఫలప్రదః॥**

అందఱు జీవుల మంచికోసం ఇరవైనాల్గు తత్త్వాలను నేను సృష్టిస్తున్నాను. 2) వారివారికి తగిన రీతిలో భోగాలను, మోక్షాన్ని ఇచ్చి రమింపజేస్తాను. 3) కాలంతో జీవునితో కూడిన తత్త్వసమూహాన్ని నియమిస్తున్నాను. 4) సూరులకు, పండితులకు ఎల్లప్పుడు హితంగా ఉంటాను. 5)సూర్యమండలంలో సూర్యరూపిణియై ఉంటాను. ఈ కారణాలచేత తత్త్వజ్ఞానులైన పెద్దలు నన్ను **"సూర్యా"** అని అంటున్నారు. ఆఱు అక్షరాలను కల **"ఓమ్ సూర్యాయై నమః"** అనే ఈ మంత్రం లౌకికభోగాలను, మోక్షాన్ని ఇస్తుంది) అని లక్ష్మీతంత్రంలో అఖిలజగన్మాత అయిన లక్ష్మిచేతనే ఘోషింపబడ్డాయి. ఈ నామంతో కలిపి శ్రీసూక్తంలో యాభైమూడు నామాలు లక్ష్మీదేవికి పఠింపబడ్డాయి. ఇకపై రాబోయే నామాలన్నీ ఇంచుమించుగా పూర్వోక్తాలే. ఈ యాభైమూడు నామాల మహిమ–

**ఇతి నామ్నాం త్రిపంచాశత్ సూక్తస్థానాం ప్రకీర్తితా।**
**కృతార్థయంతి మాం ప్రాప్య ధీరాన్ స్వైః స్వైరభీప్సితైః॥**
**యద్యప్యేషా మయా ప్రోక్తా వ్యవస్థా ఫలగోచరా। 50–205**
**న తావదేవ మాహాత్మ్యమేషాం చింత్యం విపశ్చితా॥**
**నామావళీ యతో హ్యస్యాః శ్రీరహం దేవతా పరా॥**

(ఈ విధంగా ఈ శ్రీసూక్తంలో కీర్తింపబడ్డ యాభైమూడు నామాలు నన్ను ఆశ్రయించిన జ్ఞానులను వారువారు కోరిన వానిని ఇచ్చి కృతార్థులను చేస్తాయి. ఒక్కొక్క తిరునామానికి ఒక్కొక్క ఫలం కల్గుతుందని నాచే చెప్పబడినా, జ్ఞానులు వీటికి ఇంతమాత్రమే గొప్పతనం అని భావించరాదు. నామావళి అంతా మోక్షపర్యంతం ఏ శ్రమ లేకుండా అన్ని ఫలాలను ఇవ్వగల్గినది. గొప్పదైన, శ్రీ అనబడే నేనే కదా వీటికి అధిదేవతను) అని లక్ష్మిచేతనే లక్ష్మీతంత్రంలో చెప్పబడింది.

**(హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ)**–స్వామీ! బంగారుమయం అయిన లక్ష్మీదేవిని నాకు అనుగ్రహించండి. **"హిరణ్మయీమ్" "లక్ష్మీమ్"** అనే తిరునామాల గొప్పతనం ఇంతకుముందే వివరింపబడింది.



**(హిరణ్మయీమ్)**–సువర్ణమయంగా ఉన్నదానిని. హిరణ్మయం అయిన నీ పత్నిని.

**(లక్ష్మీమ్)–"తిరువుక్కుమ్ తిరు"** (లక్ష్మికి కూడా లక్ష్మి) అని స్తుతింపబడే నీకు **"విష్ణోః శ్రీః"** (విష్ణుపురాణం) అనేటట్లు సంపదగా ఉన్నదానిని. ఈ నాల్గు నామాల అర్థగౌరవం ఇతఃపూర్వమే వివరింపబడింది.

**(జాతవేదః)**–వేదాన్ని అనుగ్రహించిన వేదప్రతిపాద్యా!

**(మమ ఆవహ)**–నాకు అనుగ్రహించు. ఆ లక్ష్మి కరుణాకటాక్షం నాపై ప్రవహించడానికి అంగీకరించు–అని భావం.

**14. ఆర్ద్రాం పుష్కరిణీం తుష్టిం సువర్ణాం హేమమాలినీమ్।**
**సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ॥ 14**

**ప్రతిపదార్థము :** జాతవేదః=స్వామీ!, ఆర్ద్రామ్=తడిసి ఉన్నది–మృదువైనది, పుష్కరిణీమ్=తామరలను కల్గినది, తుష్టిమ్=సంతోషింపజేసేది, సువర్ణామ్=అందమైన శబ్దం అయిన వేదమై ఉన్నది, హేమమాలినీమ్=హైమపర్వతాన్ని మాలగా ధరించేది, సూర్యమ్=సూర్యరూపిణియై ఉన్నది, హిరణ్మయీమ్=సువర్ణమయం అయిన తిరుమేనిని కల్గినది అయిన, లక్ష్మీమ్=శ్రీదేవిని, మమ=నాకు, ఆవహ=అనుగ్రహించు.

**భావము :** భక్త్యతిశయంవల్ల మళ్ళీ లక్ష్మిని పలురీతుల్లో వర్ణిస్తూ, పరమపురుషునివద్ద వేదపురుషుడు ఈ మంత్రంలో ప్రార్థిస్తున్నాడు.

**(ఆర్ద్రామ్)**–అమృతప్రవాహంచేత తడిసిన మేనిని కల్గిన దానిని–అని భావం.

**(పుష్కరిణీమ్)**–తామరపూవును చేతిలోను, పాదాలకింద, తలపై, మాలగాను కల్గి ఉండడమే కాకుండా, ఎఱ్ఱని దొండపండువంటి పెదవి, ఎఱ్ఱని కమలం, ఎఱ్ఱని తామరలవంటి పాదాలను కల్గినదానిని –అని భావం. పుండరీకావయవుడైన అతని తామరలవంటి అవయవాలను తన కోసంగా కల్గి ఉన్నదానిని–అని కూడా భావం. ఈ నామానికి చెందిన మిగిలిన అర్థాలు ఇంతకుముందే వివరింపబడ్డాయి.

**(తుష్టిమ్)**–తన స్వరూపరూపగుణాలతో సర్వేశ్వరుని సంతోషింపజేసేదిగాను, అతని స్వరూపాదులతో తాను సంతోషించేదిగాను ఉన్నదానిని. **"తర్పయంతీమ్"** అనే తిరునామం వివరణంలో గ్రహింపబడ్డ ప్రమాణాలు ప్రకృతంలో అనుసంధేయాలు.

**అస్యా దేవ్యాః మనస్తస్మిన్ తస్య చాస్యాం ప్రతిష్ఠితమ్।**
**తేనేయం స చ ధర్మాత్మా ముహూర్తమపి జీవతి॥**

(ఈ సీతాదేవి మనస్సు అతనిలో, అతని మనస్సు ఈమెలో ప్రతిష్ఠితాలై ఉన్నాయి. అందువల్లనే ఈమె, ధర్మాత్ముడైన ఆ శ్రీరాముడు కొంచెం సేపయినా జీవించగల్గుతున్నాడు) అని అంటూ హనుమానుడు పల్కినట్లు ఒకరికొకరు ధారకంగా వీరిద్దరు ఉంటారు కదా!

**(తుష్టిమ్)**–తమతమ వర్ణాశ్రమధర్మాలతో చేతనులచేత ఆరాధింపబడి, సంతోషింప

చేయబడేది–అని భావం. **"తవనెతియై త్తిరుమాలై"** (కలివైరిసూరిసూక్తం–4–6–7) (తపోమార్గమై ఉన్నవాడు (శ్రియఃపతి) అని కలివైరిసూరికూడా అన్నారు.

**"వర్ణాశ్రమాచారవతా పురుషేణ పరః పుమాన్।**
**విష్ణురారాధ్యతే పంథా నాన్యస్తత్తోషకారకః॥**

(వర్ణాశ్రమాచారాలను కల పురుషునిచేత పరమపురుషుడైన విష్ణువు ఆరాధింప బడుతున్నాడు. అతనిని సంతోషింపజేసే దారి వేఱే ఏదీ లేదు) అని అతనికి సమారాధన అయినపుడు, అతనిని విడచి ఉండని ఈమెకు కూడా అది సమారాధనంగా అవుతుందని వేఱే చెప్పాలా! ఈ అర్థాలు, మంత్రమహిమ–

**తోషయామి గుణైర్విష్ణుం తుష్యామి చ హరేర్గుణైః।**
**మయి తుష్టిస్సమస్తానామ్ ఈడితాయాం స్వకర్మభిః॥**
**తుష్టిర్నిరూపితా తేన సాహం యోగాబ్ధిపారగైః।**
**షడక్షరోహ్యయం మంత్రో మనస్సంతోషదాయకః॥ 50–196**

(నా గుణాలతో విష్ణువును సంతోషింపజేస్తున్నాను. హరియొక్క గుణాలతో సంతోషిస్తున్నాను. తమ కర్మలతో ఆరాధింపబడే నాకు ఆనందం కల్గుతున్నది. అందువల్ల యోగసముద్రతీరాన్ని చేరినవారు నన్ను "తుష్టిః" అని నిరూపిస్తున్నారు. ఆఱు అక్షరాలనుకల **"ఓమ్ తుష్టయే నమః"** అనే ఈ మంత్రం మనస్సుకు ఆనందాన్ని కల్గిస్తుంది) అని లక్ష్మీతంత్రంలో తెలుపబడ్డాయి. **"ఆర్ద్రామ్ పుష్కరిణీం పుష్టిమ్"** అనే పాఠాన్ని స్వీకరించి, గోమఠరంగనాథులు అర్థాన్ని చెప్పారు. గత మంత్రంలో **"ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిమ్"** అని, ఈ మంత్రంలో **"ఆర్ద్రాం పుష్కరిణీం యష్టిమ్"** అని, **"ఆర్ద్రాం యః కరిణీమ్"** అని పలు రీతుల్లో పాఠాంతరాలున్నాయి. ఆ పాఠాలన్నీ లక్ష్మీతంత్రంలో లక్ష్మీదేవిచే ఆదరింపబడ్డవి కాదు. కనుక అనాదరణీయాలు.

**(సువర్ణామ్)–"సుష్ఠు వర్ణయతీతి సువర్ణా"**–తనకంటె ఇతరులను చక్కగా రంజింపజేస్తుంది–ప్రకాశింపజేస్తుంది కనుక **"సువర్ణా"** అని అనబడుతున్నది–అని ఒక అర్థం. **"హిరణ్యవర్ణా"** అని ప్రారంభించి చెప్పబడే సుశబ్దాలను తనకు వాచకాలుగా కల్గినదని ఇంకొక భావం. అందమైన శబ్దం అయిన వేదమై, సుందరుని వర్ణించేది–అని మఱొక అర్థం. **"అర్థో విష్ణురియం వాణీ"** (విష్ణువు అర్థం, ఈ లక్ష్మి శబ్దం) అని పరాశర మహర్షి కూడా శ్రీవిష్ణుపురాణంలో పలికారు.

**సువర్ణయామి సంసిద్ధానపరం పరమేవ వా।**
**అనిదం ప్రథమా వర్ణాః శోభనా మమ వాచకాః॥**
**నిత్యా సరస్వతీ భూత్వా శోభనం వర్ణయామ్యహమ్।**
**సువర్ణేతి తతో విప్రైః తత్త్వజ్ఞైః పరికీర్తితా॥**



**సప్తాక్షరో హ్యయం మంత్రః సర్వసంపత్ సమృద్ధిదః।**

(యోగసిద్ధిని పొందినవారిని, మిగిలినవారిని, పరమపురుషుని చక్కగా భాసించేటట్లు చేస్తాను. అనాదియై, అందమైన శబ్దాలు నాకు నామాలు. నిత్యత్వం అనే అందాన్ని కల్గిన వర్ణం అయిన వేదమై, సుందరుడైన స్వామిని నేను వర్ణిస్తాను. అందువల్ల తత్త్వజ్ఞులైన విప్రులు నన్ను **"సువర్ణా"** అని కీర్తిస్తున్నారు. ఏడు అక్షరాలను కల **"ఓమ్ సువర్ణాయై నమః"** అనే ఈ మంత్రం అన్ని సంపదల సమృద్ధిని ఇస్తుంది) అని ఈ మూడు అర్థాలు, మంత్రవైభవం లక్ష్మీతంత్రంలో ఉద్ఘోషింపబడింది. "సువర్ణమయంగా ఉన్నది" అనే అర్థాన్ని చెప్పేవారు కూడా కొందఱు ఉన్నారు.

**(హేమమాలినీమ్)**–బంగారుమాలను ధరించేదానిని–అని భావం. భూమియై, బంగారుమయం అయిన **"హైమనమ్"** అనే దివ్యపర్వతాన్ని మాలగా ధరించి ఉన్నది–అని లక్ష్మీతంత్రంలో ఒక అర్థం గ్రహింపబడింది. ఈ అర్థం, మంత్రవైభవం రెండూ–

**హైమం పర్వతం దివ్యం చంద్రార్కగ్రహపూరితమ్।**
**ధారయామి ధరా భూత్వా వేధసః స్థితిసిద్ధయే॥**
**తుష్టావ మాం పురా తేన విరించో హేమమాలినీమ్।**
**అష్టాక్షరో హ్యయం మంత్రో మానవానాం ధృతిప్రదః॥**

(చంద్రుడు, సూర్యుడు, గ్రహాలు–మొదలైనవి నిండిన హైమనం అనే దివ్య పర్వతాన్ని, బ్రహ్మను స్థిరంగా నిలుపడంకోసం భూమియై ధరిస్తున్నాను. అందువల్ల బ్రహ్మ నన్ను పూర్వకాలంలో **"హేమమాలినీ"** అని స్తుతించాడు. ఎనిమిది అక్షరాలను కల **"ఓమ్ హేమమాలిన్యై నమః"** అనే ఈ మంత్రం మానవులకు ధైర్యాన్ని కల్గిస్తుంది) అని లక్ష్మీతంత్రంలో చెప్పబడ్డాయి.

**(సూర్యామ్)–"షూఙ్–ప్రాణి విమోచనే"**–అనే ధాతువు కనుక "సూ" అనే అక్షరం సకల ప్రాణులను సృష్టించేది–అనే అర్థాన్ని ఇస్తుంది. రేఫం ఆ ప్రాణులను భోగమోక్ష ప్రధానం ద్వారా ఆనందింపజేస్తుంది–రమింపజేస్తుంది–అనే అర్థాన్ని ఇస్తుంది. "య"–అనే అక్షరం వాటిని కాలాన్ని సాధనంగా చేసికొని, నియమించేది అనే అర్థాన్ని ఇస్తుంది. ఈ కార్యాలను లక్ష్మి భగవానునిద్వారా చేయిస్తుంది కనుక వాటిని చేసే కర్త్రిగా చెప్పబడిందని గ్రహించాలి.

**(సూర్యామ్)**–నిత్యసూరులకు కైంకర్యాన్ని అనుగ్రహిస్తుంది కనుక, ("యా–ప్రాపణే" అను ధాతువును బట్టి) హితమై ఉంటుంది అనే అర్థాన్ని గ్రహించవచ్చు. **"తేవిమారావార్ తిరుమకళ్ పూమి ఏవ మత్తమరర్ ఆట్చెయ్‌వార్"** (దేవేరులైన లక్ష్మీదేవి, భూదేవి నియమించగా మిగిలిన నిత్యసూరులు సేవను చేస్తారు) (శఠకోపసహస్రం 8–1–1) అని శఠకోపసూరి అన్నారు కదా!

**(సూర్యామ్)**–సూర్యమండలం నడుమ సూర్యరూపిణియై ఉండేది–అని కూడా భావం.

విరోధి అయిన స్వప్రవృత్తి స్వరూపహాని అయేటట్లున్న ఆత్మయొక్క అత్యంత పారతంత్ర్యస్వరూపాన్ని) యథాతథంగా తెలిసినవాడైన నాకు, శాస్త్రాలలో విధింపబడ్డ కర్మజ్ఞానభక్తులనే మూడు మోక్షోపాయాలు లేవు. నా దగ్గర కన్పించే కర్మజ్ఞానభక్తులు నీ ఆజ్ఞాకైంకర్యరూపమై ఉన్నాయి. ఈ కారణంచేత నేను ఉపాయశూన్యుడను కనుక అకించనుడనై, ఏ గతిని లేనివాడనై తాపాలను తీర్చే నీ ఛాయలో ఒదిగి జీవిస్తున్నాను. సహజంగానే నాకు పరతంత్ర కానిది గాను, స్వామినిగాను, కరుణాసముద్రంగా ఉండే నీవే అన్ని శాస్త్రాలలో ఉపాయంగా చెప్పబడుతున్నావు. ఆత్మ, ఆత్మకు చెందినవై విడిచిపెట్టలేకుండాను, భరించలేకుండాను ఉండే విషయాలన్నీ నీ మంగళకరం అయిన పాదపద్మాలలో సమర్పింపబడ్డాయి. ఉపేయభూత అయిన నిన్ను పొందడంకోసం నిన్నే ఉపాయంగా వరిస్తున్నాను. లక్ష్మీ! నాకు నీవు ఉపాయం కావాలి. అంబుజా! నాకు నీవు గతి కావాలి. నా పాపాలను అన్నిటినీ దహించాలి. నీ విషయమై జ్ఞానాన్ని వృద్ధి చేయాలి".

ఈ రీతిలో భావించి ప్రపన్నుడు నన్ను, ఆదిదేవుడు, జగత్స్వామి, సర్వనియంత అయిన పురుషోత్తముని శరణు పొందాలి. ఇంద్రా! ఈ విధంగా చేస్తే గొప్ప శుభం కల్గుతుంది. అన్ని విధాలైన దారిద్ర్యాలు తొలగుతాయి. నా సూక్త విధిని కర్మకాలాలలో ముముక్షువు వినాలి. ఆ విధంగా చేస్తే కర్మలను సఫలం చేస్తాను. వినే వారిని పోషిస్తాను. అజ్ఞానాన్ని అంతటినీ, దారిద్ర్యాన్ని దోషాలతో పాటు పోగొట్టగలను. మనోవాక్కాయాలతో ఈ సూక్తం అభ్యసింపబడినది అయితే గొప్పపాపంనుండి జీవుని కాపాడుతుంది. స్థిరమైన సంపదలను ఇస్తుంది.)

ఇటువంటి గొప్పతనాన్ని కల ఈ శ్రీసూక్తంయొక్క సారం ఇక సంగ్రహింపబడు తున్నది. భగవానునకు సహజంగానే శేషభూతయై, సమస్తజీవులకు స్వామినియై, జీవుని సర్వేశ్వరుని వద్దకు చేర్పించే పురుషకారభూతయై లక్ష్మి ఉన్నది. వ్యక్తిని ఆశ్రయించి ఉండే జాతివలె అతనికి స్వరూపనిరూపకభూతయై, అతడున్నచోట అంతా వ్యాపించి ఉండే గొప్పతనాన్ని కల్గినది లక్ష్మి. అతని జగత్కారణత్వంలోను, మోక్షప్రదత్వంలోను ప్రేరకత్వరూపమైన అప్రధానమైన అన్వయం ఈమెకు ఉన్నది. జగత్ సృష్ట్యాదులను మోక్షప్రదానాన్ని చేసేవాడు భగవానుడు. చేయించేది లక్ష్మి. ఈ కారణాలవల్లనే ఈ లక్ష్మికి పరబ్రహ్మత్వం ఏనాడూ సిద్ధించదు. **"ఈశ్వరీం సర్వభూతానామ్"** (అన్ని భూతాలకు ఈశ్వరిని) అని చెప్పబడ్డ గొప్పతనాన్ని కల్గిన ఈమెకు కూడా **"విష్ణుపత్నీ"** అని, **"లక్ష్మీశ్చ పత్న్యౌ"** అని, **"జాతవేదో మ ఆవహ"** అని, **"శ్రీరుపబర్హణమ్"** అని, **"తిరువుక్కుమ్ తిరు"** అని అన్నట్లు, ఈశ్వరుడై ఉండే అతడే పరబ్రహ్మ. లక్ష్మి నివసించే భాగమే గొప్పది. లక్ష్మిలేని దేవతలు దేవతలు కారు. కరుణ మూర్తీభవించిన, అఖిలజగన్మాత అయిన ఈమెతో చేరి ఉండే పరమపురుషుడే సర్వరక్షకుడు. ఇదే శ్రీసూక్తసారం.





**15. తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీమనపగామినీమ్।**
**యస్యాం హిరణ్యం ప్రభూతం గావో దాస్యోఽ శ్వాన్**
**విందేయం పురుషానహమ్॥** **15**

**ప్రతిపదార్థము :** జాతవేదః=సర్వేశ్వరా!, యస్యామ్=ఏ లక్ష్మి విషయంలో, ప్రభూతం హిరణ్యమ్=అధికమైన బంగారాన్ని, గావః=పశువులను, దాస్యః=పరిచారికలను, అశ్వాన్=అశ్వాలను, పురుషాన్=పురుషులను, అహమ్=నేను, విందేయమ్=పొందగలనో, తామ్=అటువంటి, అనపగామినీమ్=విడచిపోని, లక్ష్మీం=లక్ష్మీదేవిని, మే=నాకు, ఆవహ=అనుగ్రహించు.

**భావము :** ఈ చివరి మంత్రంలో తిరిగి లక్ష్మీదేవిని అనుగ్రహించాలని పరమపురుషుని ప్రార్థించి, ఆ లక్ష్మీదేవి వల్ల తాను పొందగోరిన ఫలాలను తెలుపుతూ వేదపురుషుడు ముగిస్తున్నాడు.

**(తాం మ ఆవహ జాతవేదః)**–స్వామీ! ఆ లక్ష్మిని నాకు అనుగ్రహించాలి. ఎటువంటి లక్ష్మిని? అని అంటే–

**(లక్ష్మీమ్ అనపగామినీమ్)**–నీకు సంపద, నిన్ను విడచి ఉండని నిత్యసంశ్లిష్ట అయిన ఆ దేవతను నాకు సంపదగాను, నన్ను విడచిపోని రీతిలో అనుగ్రహించాలి. ఈ రెండు నామాల అర్థాలు పూర్వమే వివరింపబడ్డాయి. ఎందుకోసం? అని అంటే,

**(యస్యాం హిరణ్యం.................పురుషానహమ్)**–అధికమైన బంగారాన్ని, పశువులను, అశ్వాలను, దాసీజనాన్ని, పురుషులను ఆ లక్ష్మి వల్ల పొందడం కోసం–అని భావం. భగవద్భాగవతారాధనకు పనికి వచ్చేవి కనుక వీటిని ఆశించడంలో లోటు లేదు. **"తిరుమామకళ్ తన్నరుళాల్ ఉలకిల్ తేర్ మన్నరాయ్ ఒలిమాకడల్ శూళ్ శెఱునీర్ ఉలకాణ్డు తికళ్వర్కళే"** (కలివైరిసూరిసూక్తం–2–9–10) (లక్ష్మీదేవి అనుగ్రహంవల్ల లోకంలో రథాలను నడిపే ప్రభువులై, శబ్దించే సముద్రం పరివేష్టించి ఉండే ఈ భూమండలాన్ని పాలించి, ప్రకాశిస్తారు) అని కలివైరిసూరికూడా అన్నారు కదా!

**(పురుషాన్)**–ఈ లోకంలో పుత్రపౌత్రాది పురుషులను, ఉత్పురుషులనబడే ముక్తులను, ఉత్తరపురుషులైన నిత్యులను, ఉత్తమపురుషుడైన భగవానుని పొందగలను. ఈ లోకంలో వైష్ణవసంతానాన్ని, ఆ లోకంలో, భగవద్దాసవర్గాన్ని, ఆ స్వామిని పొందడం లక్ష్మివల్లనే అనే అర్థాన్ని వేదపురుషుడు వ్యక్తం చేస్తున్నాడు.

**ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ।**
**క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽ క్షర ఉచ్యతే॥**
**ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః।**
**యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః॥**
**యస్మాత్క్షరమతీతోఽ హమక్షరాదపి చోత్తమః।**

**అతోఽస్మి వేదే లోకే చ ప్రథితః పురుషోత్తమః॥ (గీత. 15-16,17,18)**

(క్షరుడని, అక్షరుడని లోకంలో పురుషులు రెండు విధాలు. అన్ని భూతాలు క్షరశబ్దవాచ్యులు. కూటస్థుడైన ముక్తాత్మ అక్షరశబ్దవాచ్యుడు. ఎవడు ముల్లోకాలలోను ప్రవేశించి, వాటిని ధరించేవాడుగా, ఏ కొఱత లేనివాడుగా, నియమించేవాడుగా, పరమాత్మ అని చెప్పబడే వాడుగా ప్రకాశిస్తున్నాడో ఆ పురుషోత్తముడు (పూర్వం తెలుపబడిన పురుషుల కంటే) విలక్షణుడు. నేను క్షరాక్షరులైన బద్ధముక్త పురుషులకంటే ఉత్తముడను కనుక, శ్రుతిస్మృతులలో పురుషోత్తముడనే ప్రసిద్ధిని పొందాను) అని గీతలో శ్రీకృష్ణుడు పురుషులు మూడు విధాలుగా భావించి పలికాడు కదా!

ఈ శ్రీసూక్తవైభవాన్ని, దీనిని తెలిసినవారి అధ్యవసాయ ప్రకారాన్ని లక్ష్మీతంత్రంలో లక్ష్మీదేవి ఈ క్రింది రీతిలో పలికింది.

**నక్షత్రాణి యథా వ్యోమ్ని యథా రత్నాని వారిధౌ।**
**వసుధాయాం యథా భోగా యథా కామాస్సురద్రుమే॥**

**మహిమానో యథా గోషు తేజాంసి బ్రాహ్మణే యథా।**
**యథానంతా గుణా దివ్యా దేవదేవే జనార్దనే॥**

**మహిమానో హ్యసీమాన స్తథాస్మిన్ సూక్తకే మమ।**
**యావాన్ హి భగవాన్ కాలః కలాకాష్ఠాదిలక్షణః॥**

**తావతా నైవ శక్నోమి వక్తుం సూక్తగుణానహమ్। (50-210)**
**సైషా వేదవిదాం నిష్ఠా సైషా తంత్రవిదాం గతిః॥**
**మాం ప్రపద్యేత సతతం సూక్తేనానేన మానవః।**
**సూక్తార్థమనుసంస్మృత్య చిరం సూక్తమధీత్య చ॥**

**లబ్ధే చిత్తప్రసాదే తు మాం ప్రపద్యేత వై గతిమ్।**
**ప్రపద్యమానో మాం నిత్యం దేవం వా పురుషోత్తమమ్॥**

**ఇత్యేవమనుసందధ్యాత్ శ్రద్దధానో జితేంద్రియః।**
**ప్రాతికూల్యం పరిత్యక్తమానుకూల్యం చ సంశ్రితమ్॥**

**మయా సర్వేషు భూతేషు యథాశక్తి యథామతి।**
**అపాయేభ్యో నివృత్తోఽస్మి పాతకేభ్యో భవోదధౌ॥**

**తథాప్యత్ర ప్రవృత్తిర్యా త్వత్స్మృతే స్సాపి నశ్యతు।**
**అలసస్యాల్పశక్తేశ్చ యథావచ్చావిజానతః॥**
**ఉపాయాః చోదితాః శాస్త్రైర్న మే స్యుస్తారకాస్త్రయః॥**

**తథాప్యత్ర ప్రవృత్తిర్యా త్వదాజ్ఞాపాలనం తు తత్।**
**అతోఽహమనుపాయత్వాత్ కృపణోఽకించనోఽగతిః॥**



**ఛాయామాశ్రిత్య వర్తేఽహం త్వదీయాం తాపహారిణీమ్।.....**
**త్వమేవ సర్వశాస్త్రేషు శరణత్వేన గీయసే॥**

**ఆత్మాత్మీయం చ యత్ కించిత్ దుస్త్యజం దుర్భరమ్ మతమ్॥**

**తత్ సర్వం తవ విన్యస్తం శుభయోః పాదపద్మయోః।**
**ఉపేయాయాస్తవ ప్రాప్త్యై త్వాముపాయం తథా వృణే॥**

**ఉపాయో భవ మే దేవి! శరణం భవ మేఽంబుజే।**
**ప్లుష్య మే దురితం సర్వం పుష్య మే త్వద్గతాం ధియమ్॥**

**ఇత్యేవమనుసంధాయ మాం ప్రపద్యేత వై గతిమ్।**
**ఆధిదైవం జగన్నాథమీశం వా పురుషోత్తమమ్॥**

**పరం స్వస్త్యయనం శక్ర! సర్వాఽలక్ష్మీనిబర్హణమ్।**
**శ్రావయేత్ కర్మకాలేషు మత్ సూక్తస్య విధిం నరః॥ 50-223**

**సమర్ధయతి కర్మాణి శ్రోతారం పోషయత్యుత।**
**నిర్ణుదత్యఖిలాం మాయామలక్ష్మీం చ మలైస్సహ॥**

**ఏతదభ్యస్యమానం హి కర్మణా మనసా గిరా।**
**త్రాయతే మహతః పాపాత్ శ్రియం చావహతి ధ్రువమ్॥**

(ఆకాశంలో వెలిగే నక్షత్రాలవలె, సముద్రంలో వెలిగే రత్నాలవలె, భూమిలోని భోగాలవలె, కల్పవృక్షంనుండి జాలువారే కామాలవలె, గోవులలోని మహిమలవలె, బ్రాహ్మణులలోని తేజస్సులవలె, దేవదేవుడైన జనార్దనునిలో దర్శనమిచ్చే అనంత కల్యాణగుణాలవలె, అంతులేని మహిమలు నా సూక్తానికి ఉన్నాయి. కలాకాష్ఠాది సమూహంగా ఉండే కాలతత్త్వం ఉన్నంతసేపు చెప్పినా, ఈ సూక్తంయొక్క గొప్పదనాన్ని పూర్తిగా చెప్పలేను. ఈ సూక్తమే వేదపాఠకులు స్థిరంగా నిలచే చోటు. తంత్రజ్ఞులు స్థిరంగా నిలచే చోటు. ఈ సూక్తంలో నన్ను ముముక్షువు శరణు పొందతగినవాడు. చిరకాలం ఈ సూక్తాన్ని అధ్యయనం చేసి, సూక్తంయొక్క అర్థాన్ని మననంచేసి, మనస్సు తేటపడగానే ప్రాప్యంగా, ప్రాపకంగా ఆశ్రయించాలి. ప్రతిదినం నన్ను, దేవుడైన పురుషోత్తముని శరణుపొంది, శ్రద్ధను కలవాడై, ఇంద్రియాలను జయించినవాడై, ఈ క్రింది రీతిలో ధ్యానించాలి.

"వీలయినంతవరకు, తెలిసినంతవరకు అన్ని జీవరాసులు విషయంలో ప్రతికూలుడై ఉండే స్థితి నాచే పరిత్యజింపబడినది. అనుకూలుడై ఉండే స్థితి అంగీకరింపబడింది. సంసారసాగరంలో పాపాలనే ఉపాయాలను అనుష్ఠించడం మానుకొన్నాను. అయినా నీ విషయంలో భక్తియోగానికి నేను ప్రయత్నం చేయడమనేది ఏది ఉన్నదో, అది కూడా పోవాలి. ఆలస్యాన్ని, అల్పశక్తిని కలవాడు (భగవత్ప్రవృత్తికి

8. క్షుత్పిపాసాం మలాం జ్యేష్ఠామలక్ష్మీం నాశయామ్యహమ్।
అభూతిమసమృద్ధిఞ్చ సర్వాన్ నిర్ణుద మే గృహాత్॥ 8

9. గంధాద్వారాం ధురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్।
ఈశ్వరీం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియమ్॥ 9

10. మనసః కామమాకూతిం వాచః సత్యమశీమహి।
పశూనాం రూపమన్నస్య మయి శ్రీః శ్రయతాం యశః॥ 10

11. కర్దమేన ప్రజాభూతా మయి సంభవ కర్దమ।
శ్రియం వాసయ మే కులే మాతరం పద్మమాలినీమ్॥ 11

12. ఆపః సృజంతు స్నిగ్ధాని చిక్లీత వస మే గృహే।
ని చ దేవీం మాతరం శ్రియం వాసయ మే కులే॥ 12

13. ఆర్ద్రాం పుష్కరిణీం యష్టిం పింగళాం పద్మమాలినీమ్।
చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ॥ 13

14. ఆర్ద్రాం పుష్కరిణీం తుష్టిం సువర్ణాం హేమమాలినీమ్।
సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ॥ 14

15. తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీమనపగామినీమ్।
యస్యాం హిరణ్యం ప్రభూతం గావో దాస్యోఽశ్వాన్
విందేయం పురుషానహమ్॥ 15



**పద్మప్రియే! పద్మిని! పద్మహస్తే! పద్మాలయే! పద్మదళాయతాక్షి।**
**విశ్వప్రియే! విష్ణుమనోనుకూలే! త్వత్పాదపద్మం మయి సన్నిధత్స్వ॥**

తామరపూవులో ప్రీతిని కల్గినది, స్త్రీలలో గొప్పది, తామరపూవులు చేతిలో పెట్టుకొన్నది, తామరపూవుపై వేంచేసి ఉన్నది, తామరరేకులవంటి విశాలమైన కన్నులను కల్గినది, అందఱిపట్ల వాత్సల్యాన్ని కల్గినది, విష్ణువు మనస్సుకు అనుకూలమైనది, అయిన మహాలక్ష్మీ! తామరపూవువంటి నీ పాదాన్ని నా తలపై పెట్టాలి.

**శ్రియైజాత శ్రియ ఆనిర్యాయ శ్రియం వయో జనితృభ్యో దదాతు।**
**శ్రియం వసానా అమృతత్వమాయన్ భజంతి సద్యః సవిదధా వితద్యూన్॥**

భగవత్కైంకర్యం అనే సంపదను అనుభవించడం కోసం ఆ భగవానునినుండి నేను ఆవిర్భవించాను. నన్ను మఱుగుపఱచే అచేతనాంశం తొలగి, నేను శుభరూపంతో ఆవిర్భవించడానికి హేతువులైన ఉపాయాలను అనుష్ఠించడంకోసం స్థిరమైన సంపదను, ఆయుస్సును నాకు ఏర్పడేటట్లు శ్రీదేవే చేయాలి. లక్ష్మియొక్క చింతనతోనే కాలం గడిపేవారు జననమరణాలు లేకుండా అమరత్వాన్ని పొందుతారు. వారే పరమపదనాథుని వద్దకు చేరడం, వెంటనే విశేషంగా ఆ పరబ్రహ్మకటాక్షంచేత పాపం, ముసలితనం, మరణం, శోకం, ఆకలి, దాహం-మొదలైన వానిని లేని స్వభావాన్ని, కోరినదానిని పొందే శక్తిని, తలచిన రీతిలో ప్రవర్తించడంలో ఎవరూ అడ్డుకోలేని స్థితిని (అపహతపాప్మత్వం, విజవత్వం, విమృత్యుత, విశోకత్వం, విజిఘత్సత, అపిపాస, సత్యకామత్వం, సత్యసంకల్పత్వం-అనే వీనిని) పొందుతారు.

**"శ్రియ ఏవైనం తచ్ఛ్రియమాదధాతి"**

(ఆ పరబ్రహ్మ ఈ లక్ష్మిని ఉపాసించేవానికి ఇంకా ఇంకా కైంకర్యం అనే సంపదను ఇస్తాడు).

**"సంతతం ఋచా వషట్కృత్యం సంధత్తం సంధీయతే ప్రజయా పశుభిః య ఏవం వేద"**

(ఈ ఋగ్వేద ఖిలమంత్రాలతో ఎల్లప్పుడు వశం చేసికోతగినవారైన ఈ విశ్లేషంలేని దంపతులను ఇక్కడ తెల్పిన రీతిలో ఉపాసించేవాడు పుత్రపౌత్రాదులలో పశువులు, అశ్వాలు, సంపద-మొదలైనవానితో నిరంతరం ఉజ్జీవిస్తాడు.

**"ఓమ్ మహాదేవ్యై చ విద్మహే విష్ణుపత్న్యై చ ధీమహి। తన్నో లక్ష్మీః ప్రచోదయాత్॥**

లక్ష్మీదేవియొక్క అనుగ్రహాన్ని పొందడంకోసం ఉపాసనలను చేస్తాము. దాసులకు నాల్గు విధాలు అయిన పురుషార్థాలను అనుగ్రహించడం-అనే యాగంలో దీక్ష వహించిన నారాయణునితోపాటు, వాటిని నిర్వహించే అతని ధర్మపత్నిని నిరంతరం ధ్యానిస్తాము. తన ధ్యానంలో ఆమె మనకు ప్రేరణను కల్గించాలి.

**శ్రీసూక్తవ్యాఖ్యేయం కవితా శ్రీశింగరార్యవిబుధేన।**
**పదపరిచర్యాలక్ష్మ్యాః తృప్త్యై భవతాత్ జగన్మాతుః॥**

**శ్రీః**

## శ్రీసూక్తంలో పఠింపబడ్డ లక్ష్మీనామావళి

1. ఓమ్ హిరణ్యవర్ణాయై నమః
2. ఓమ్ హరిణ్యై నమః
3. ఓమ్ సువర్ణస్రజే నమః
4. ఓమ్ రజతస్రజే నమః
5. ఓమ్ చంద్రాయై నమః
6. ఓమ్ హిరణ్మయ్యై నమః
7. ఓమ్ లక్ష్మ్యై నమః
8. ఓమ్ అనపగామిన్యై నమః
9. ఓమ్ అశ్వపూర్వాయై నమః
10. ఓమ్ రథమధ్యాయై నమః
11. ఓమ్ హస్తినాదప్రబోధిన్యై నమః
12. ఓమ్ శ్రియై నమః
13. ఓమ్ మాయై నమః
14. ఓమ్ దేవ్యై నమః
15. ఓమ్ కాయై నమః
16. ఓమ్ సోస్మితాయై నమః
17. ఓమ్ హిరణ్యప్రాకారాయై నమః
18. ఓమ్ ఆర్ద్రాయై నమః
19. ఓమ్ జ్వలంత్యై నమః
20. ఓమ్ తృప్తాయై నమః
21. ఓమ్ తర్పయంత్యై నమః
22. ఓమ్ పద్మే స్థితాయై నమః
23. ఓమ్ పద్మవర్ణాయై నమః
24. ఓమ్ చంద్రాయై నమః
25. ఓమ్ ప్రభాసాయై నమః
26. ఓమ్ యశసాయై నమః
27. ఓమ్ జ్వలంత్యై నమః
28. ఓమ్ దేవజుష్టాయై నమః
29. ఓమ్ ఉదారాయై నమః
30. ఓమ్ తాయై నమః
31. ఓమ్ పద్మనేమ్యై నమః
32. ఓమ్ ఆదిత్యవర్ణాయై నమః
33. ఓమ్ కీర్త్యై నమః
34. ఓమ్ ఋద్ధయే నమః
35. ఓమ్ గంధద్వారాయై నమః
36. ఓమ్ దురాధర్షాయై నమః
37. ఓమ్ నిత్యపుష్టాయై నమః
38. ఓమ్ కరీషిణ్యై నమః
39. ఓమ్ ఈశ్వర్యై నమః
40. ఓమ్ మనసః కామాయ నమః
41. ఓమ్ వాచః ఆకూత్యై నమః
42. ఓమ్ సత్యాయ నమః
43. ఓమ్ పశూనాం రూపాయ నమః
44. ఓమ్ అన్నస్య యశసే నమః
45. ఓమ్ మాత్రే నమః
46. ఓమ్ పద్మమాలిన్యై నమః
47. ఓమ్ పుష్కరిణ్యై నమః
48. ఓమ్ యష్టయే నమః
49. ఓమ్ పింగళాయై నమః
50. ఓమ్ తుష్టయే నమః
51. ఓమ్ సువర్ణాయై నమః
52. ఓమ్ హేమమాలిన్యై నమః
53. ఓమ్ సూర్యాయై నమః





# శ్రీసూక్తమ్

1. హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణరజతస్రజామ్।
చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మ ఆవహ॥ 1

2. తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీమనపగామినీమ్।
యస్యాం హిరణ్యం విందేయం గామశ్వం పురుషానహమ్॥ 2

3. అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాదప్రబోధినీమ్
శ్రియం దేవీముపహ్వయే శ్రీర్మా దేవీ జుషతామ్॥ 3

4. కాం సోస్మితాం హిరణ్యప్రాకారామార్ద్రాం
జ్వలంతీం తృప్తాం తర్పయంతీమ్।
పద్మేస్థితాం పద్మవర్ణాం త్వామిహోపహ్వయే శ్రియమ్॥ 4

5. చన్ద్రాం ప్రభాసాం యశసాం జ్వలన్తీం
శ్రియం లోకే దేవజుష్టాముదారామ్।
తాం పద్మనేమీం శరణమహం ప్రపద్యే
అలక్ష్మీర్మే నశ్యతాం త్వాం వృణే॥ 5

6. ఆదిత్యవర్ణే తపసోఽధిజాతో
వనస్పతిస్తవ వృక్షోఽథ బిల్వః।
తస్య ఫలాని తపసా నుదంతు
మాయాంతరాయాశ్చ బాహ్యా అలక్ష్మీః॥ 6

7. ఉపైతు మాం దేవసఖః కీర్తిశ్చ మణినా సహ।
ప్రాదుర్భూతోఽస్మి రాష్ట్రేఽస్మిన్ కీర్తిమృద్ధిం దదాతు మే॥ 7



**శ్రీశ్రీశ్రీ అరుళానందసరస్వతిస్వామివారు**

శ్రీ సదాశివబ్రహ్మేంద్రాశ్రమము,

**చిల్లకల్లు-521178**

జగ్గయ్యపేట మండలం, కృష్ణాజిల్లా,

ఆంధ్రప్రదేశ్.

శ్రీః

# శ్రీసూక్తవ్యాఖ్యానమ్

తమిళమూలం :

శ్రీ ఎస్.కృష్ణస్వామి అయ్యంగార్, పుత్తూరు అగ్రహారం

తెలుగువ్యాఖ్య :

"పదపరిచర్యా" డా॥ ఈ.ఏ.శింగరాచార్యులు, తిరుపతి.



ప్రకాశకులు

**శ్రీ సదాశివబ్రహ్మేంద్రాశ్రమము, చిల్లకల్లు-521178**

జగ్గయ్యపేట మండలం, కృష్ణాజిల్లా.